శ్రీ ర స్తు.

# సహస్రకంఠరామాయణము

అను నామాంతరముగల

## శ్రీ రా మ వి జ య ము

ఇ ది

శ్రీరామావఝల కొండయ్యశాస్త్రిచే

వి ర చి త ము



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వా రి చే ( బ్ర క టి త ము.

1954

# విషయసూచిక

## పూర్వభాగము



## ఉత్తరభాగము.

సీ. నిజభర్తృవరచిత్త నీరజాకరమాన సావాస యాకలహంసగమన
శతకంఠదైత్యేశ సంహారసంజాత సంతోషభరిత యా జనకతనయ
చారుతనుప్రభా సౌభాగ్యజితరతి భామాలలామ యా భాసురాంగి
కరుణాకటాక్షవీక్షణభక్తజనచక్ర రక్షణదీక్షయా రమ్యనేత్ర
తే. సత్యజనపాల జననుతిజాల పూర్ణ,చంద్రనిభఫాల సంతత చారుశీల
వసుమతీబాల పరమకృపావిశాల, భద్రవిజ్ఞానముల నిచ్చి పరఁగఁ బ్రోచు. 5

మ. ధరణీపాలునిపార్శ్వభాగముల నుద్యద్దీప్తికోదండభీ
కరశస్త్రాన్వితహస్తులై గురునుతు ల్గావించి సేవించుచున్
సురవైద్యోత్తములట్లు మైత్రి గదురన్ శోభిల్లుసౌమిత్రి సో
దరకైకాత్మజులన్ భజింతుఁ గరుణాత్తస్వాంతులన్ భక్తితోన్. 6

మ. కరుణాలోకనలోలితాత్ముఁ డగుచుం గళ్యాణరాముం బరున్
స్థిరచిత్తంబున నిల్పి చాపశరముల్ చేకోయి సంధించి భూ
వరు వెన్కన్నివసించి కార్యకరణప్రారంభుఁడై వేడ్కతోఁ
గరమొప్పారెడిలక్ష్మణుం డెపుడు న న్గాపాడుతం బ్రేమతోన్. 7

ఉ. శ్రీరఘురామశాసనము శీర్షమునం దొగిఁ దాల్చి ముందటన్
సారసుభక్తితో నిలిచి సన్నుతి చేసెడిశౌర్యవంతు వి
స్తారయశోవిలాసగుణసాహసవంతు సురారి పేటికా
మారణవంతు శాంతు హనుమంతునిఁ గొల్చెద నిష్టసిద్ధికై. 8

మ. స్థిరచిత్తంబుల భక్తియుక్తి గదురన్ దిక్కోణభాగంబులన్
సరసానూనవిశేషభావణములన్ సర్వేశ్వరుం జిన్మయున్
ధరణీనాథుని వేఁడుచున్నఘనులన్ దాశేశదైత్యేశభా
సురభల్లూకగణేశులం గొలుతు నీ క్షోణిన్ శుభావాప్తికై. 9

తే. మూఁడుమూర్తుల కవ్వలిమూర్తిఁ గలిగి, యాదిమధ్యాంతశూన్యుఁడై యలరుచున్న
నిర్గుణబ్రహ్మమును మది నియలితోడఁ, దలఁతుఁ గామ్యార్థసంసిద్ధి యలరుటకును. 10

సీ. తలఁపుకేళాకూళి పులుగు నెక్కెడురౌతు నిక్కపు జగమేలు నేర్పుకాఁడు
మాటలజవరాలి మగఁడు ప్రాఁజదువుల మన్నఁడు వలరేని మిన్నియున్న
తెలిదమ్మిగద్దియఁ గొలువున్నదిట్టరి దీవంచమోములఁ దివురుజాణ
విడువక యేప్రొద్దు వేగనున్నదురాకు లెక్కవ్రాయువలంతి పక్కిడాలు
ఆ. వేల్పుబొద్దుతమ్మి వేడ్కనాడెడు పట్టి, జన్నిగట్టుమేటి జగమెఱుంగు
పేరుగల్గుతాత పెంపురుఖాంబుల, నిచ్చి మనుచు నన్ను మచ్చికలర. 11

ఉ. వాణి సురాసురప్రముఖ వర్ణ్యపవిత్రచరిత్ర సద్గుణ
శ్రేణి సుమాక్షదామసరసీరుహసుందరకీరయుక్త స
త్పాణిమదద్విరేఫగణపత్త్రి నీలసమానకాంతిభృ
ద్వేణి మహాత్వసుందరకవిత్వపటుత్వ మొసంగి ప్రోవుతన్. 12

ఉ. ఉల్లమునందు నక్కటిక ముండదుబోయకొలంబువారి కం
చల్లన గేలిచేయం సతి నాత్మను మెచ్చుచు జామదగ్నికిం
గొల్లగ మేటికోలలను గోరినకోర్కుల నిచ్చుపార్వతీ
వల్లభుఁ డేలు న న్నెప్డు వాంఛితసిద్ధిదుఁడై ముదంబునన్. 13

చ. తనతనుకాంతు లెల్లెడలఁ దద్దయుఁ బర్వ శివార్ధదేహియై
మన మలరార లోకముల మాటికిఁ బుట్టఁగఁజేసి ప్రోచి వా
నిని మడియించి మించుఘననీలమధువ్రతపక్ష వేణి యా
మనసిజవైరిరాణి మహి మంజులవాక్తతిఁ గూర్చి కావుతన్. 14

క. క్షీరార్ణవమధ్యస్థిత, సారసపీఠమున వెలయుశతధృతి శస్త్ర
శ్రీరమ్యదేవతయు నేఁ, గోరిన కోరికల నెల్లఁ గూర్మి నొసగున్. 15

సీ. సురవిరోధులఁ జంపి శోభిల్లె నేదేవి రణముచే వీర్యకారణముచేతఁ
దనభక్తవరులను దయనేలె నేదేవి రసముచే నేత్రసారసముచేత
నిఖిలజగంబుల నిర్మించె నేదేవి క్రియలచే బహుతను క్రియలచేత
నన్నదానప్రీతి నలరారు నేదేవి కరముచే సత్ఫలాకరముచేత
తే. నిత్యధవళోపసంకీర్ణ సత్యపూర్ణ, భవ్యనవరత్నమండితాభరణకర్ణ
అన్నపూర్ణ మదంబ హృద్యసుకవిత్వ, సిద్ధిఁ జేకురునట్టులు చేయుఁగాత. 16

మ. తనయా రమ్మని శంకరుండు పిలువం దా వచ్చి పార్శ్వంబునన్
వినయం బొప్పఁగఁ జేరి కంధరమునన్ వ్రేలాడుసర్పావళిం
గని దానిన్ బిసకాండ మంచు మదిలోఁ గాంక్షించి తొండంబుచే
తను బట్టం గమకించువిఘ్నపతిఁ జిత్తంబందు భావించెదన్. 17

## గురుధ్యానము

సీ. కందార్ణవలసింధు కమలవైరిని గావ్య రచనాప్రశస్తుని రమ్యగుణుని
శాంతభూయిష్ఠుని జారుతత్త్వజ్ఞుని ఛాత్రసమేతుని సత్యరతుని
మాధవపదపద్మమధురసాస్వాదనమత్తేందిరాయితమంజుచిత్త
వరుని దాసాచార్య భాసురనాముని వినుతచారిత్రుని విమలయశుని
తే. వ్యాకరణశాస్త్రవేత్తను భవ్యశీల, సంతతానందనిర్మలసౌఖ్యయుతుని
విద్య గఱపినగురుని సేవింతుఁ గూర్తు, యత్నకార్యార్థసిద్ధికై యాత్మలోన. 18

మ. అని నిశ్చింతగ నిర్ణయించుకొని నిత్యంబీశ్వరున్ రామునిన్
మనసారం దలపోసి తద్విజయము న్మందాత్ముఁడౌ నేను జే
యను యత్నించుట చూడ నందనిఫలంబందంగఁ గాంక్షించువా
మనురీతిం బరిహాస మొందుదుఁ దుది న్మర్యాద లేకిద్ధరన్. 38

తే. ఐన నాకేర్చినట్టు లోయనఘులార, యవనిఁ బద్మపురాణస్థమౌ సహస్ర
వదనరామాయణము నాంధ్రపదవిఁ గృతినొనర్పఁబూనితి నిర్వచనముగ నేను. 39

తే. సంతసంబున రామునిఁ జింత చేసి, యనుదినంబును బెద్దల నభినుతించి
తొలుత మద్వంశసరణిని లలితరీతిఁ, జెప్పెదను పేర్కొ నెట్టన క్షితితలమున. 40

## నిజవంశక్రమము

ఉ. నాకనదీనిభం బగుపినాకిని కుత్తరతీరమందుఁ బు
ణ్యాకరమై సమస్తకలుషౌఘవనోజ్జ్వలపావకంబునై
ప్రాకటదివ్యచిత్తవర భక్తమనఃప్రియదంబునై తగన్
శ్రీకరమైనసోమశిలసీవ్యతటం బొకటొప్పు నుర్విపై. 41

క. నక్షత్రనాథుచే ము,న్నీక్షితి నిర్మింపఁబడియె నీక్షేత్రమునా
దక్షిణకాశి యటం చని, దక్షులు పల్కుదురు మోక్షదంబగుచుంటన్. 42

క. ఆరమ్యస్థలి కామడ, దూరం బగుధనదుదిశను ద్యుతితతియుతమై
భూరిశుభోన్నతమానవ, వారంబున కెపుడు రమ్యవాసం బగుచున్. 43

ఆ. పరఁగి చాపురాళ్లపల్లి యొక్కటి కల, దదియు సకలజనుల కధికశర్మ
దాయకంబు నగుచుఁ దనరారునద్దాని, యంద గాపురంబుఁ జెందువారు. 44

సీ. శ్రీపతిచరణాబ్జసేవాపరాయణ న్యస్తచిత్తులు ముల్కినాడువారు
పౌరాణికోత్తముల్ భవ్యాత్ము లాఢ్యులు నయకోవిదులు ముల్కినాడువారు
సంగీతసాహిత్య సారసంపన్నులు నాకభోగులు ముల్కినాడువారు
వ్యవహారవిజ్ఞాన బలజితకార్యులు నగధైర్యులును ముల్కినాడువారు
ఆ. అట్టి ముల్కినాడునందు విశ్రుతకీర్తి, శౌర్యధైర్యసాహసములఁ దనరి
రామవజ్ఝలనెడి రమ్యపౌరుషనామ,ధేయు లవని గలరు ధీరు లెన్న. 45

క. శ్రీకరరామావజ్ఝుల, ప్రాకటసద్వంశదుగ్ధవనరాశికి స
త్కోకనదవైరిఁ బోలి ప్ర,భాకరుఁడై కొండయార్యుఁ డవనిఁ జెలంగెన్. 46

శా. కారుణ్యాంబుధి యైనకొండయ మహాకళ్యాణి సావిత్రియన్
పేరం బేర్కొనుకామినీమణిని సంప్రీతిం దగం బెండ్లియై
యారామామణిఁ గూడి సౌఖ్యముల నిత్యానందమున్ బొందుచున్
దారాధీశుని మాడ్కిఁ దా వెలిఁగె నిద్ధాత్రిన్ బుధు ల్మెచ్చఁగన్. 47

సీ. పుణ్యకార్యంబులు పొలుపొందఁ జేయుచు నతిథిసత్కారంబు లాచరించి
పెద్దలఁ బోడఁగన్నఁ బ్రియమునఁ బూజించి దేవతాభక్తిచేఁ దేజరిల్లి
నంతవారికిఁ బుట్టి రనఘులు కొండయ సుబ్బయ పోలయన్ సుతులు మువ్వు
రం దగ్రజుఁడు కొండయాఖ్యుఁడు శాంతుఁడు పౌరాణికుఁడు భూరివైద్యవేది
తే. యగుచు జను లెల్ల వినుతింప నధికశీల, పరమగుణపేటి యన్నమాంబావధూటిఁ
బెండ్లియై సౌఖ్యములఁ దేలెఁ బ్రేమ మీఱ, రతిని గూడినయా వలరాజుపగిది. 48

క. శ్రీమహితులు నగువారికిఁ, బ్రేమను సుతు లుద్భవించి పెరిగిరి తేజః
కాములు కొండయ సుబ్బయ, నాములు వ్యవహారకార్య నయతంత్రాత్మల్. 49

క. అం దగ్రజుండు కొండయ, పొందికతోఁ బెండ్లి యయ్యెఁ బోలఁతి నమందా
నందిని లక్ష్మీనామ బుధరందరలలనాసమానరాజితమూర్తిన్. 50

చ. వినయవివేకశీలముల విశ్రుతి కెక్కినభార్యఁ గూడి యా
ఘనుఁడు దయార్ద్రచిత్తమునఁ గాపుర మొప్పఁగఁ జేయుచుండ స
ద్వినుతగుణుండు కొండయ వివేకులుసుబ్బయ సుబ్బరాము లన్
తనయులు పుట్టి రయ్యెడ సతర్కమనీషులువారి కిద్దరన్. 51

తే. వారియం దగ్రజుండనై వసుధ నుందు, కొండయాఖ్యుఁడ నగునే నఖండభక్తి
దివ్యకుసుమభూషితోన్నతధీయుతుండ, నై మనోహరవృత్తకంజమందు నిపుడు. 52

కృతిసమర్పణము

క. శ్రీనీలాభూవిమలా, మానసరమ్యాంబుజాత మార్తాండునకున్
మానవపతిమండనునకు, గోనాశ్రప్రముఖవినుత కోదండునకున్. 53

క. దోషాకరభీషణఖర, దూషణముఖహరణునకును దురితహరలస
ద్భాషణునకు భాషాధిప, భాషాపతిముఖ్య సేవ్య వరచరణునకున్. 54

క. ధీరునకు సత్యరతునకు, వారిధిగంభీరునకును వసుధేశునకున్
నీరదనిభకాయునకును, సారసదళలోచనునకు సమభావునకున్. 55

క. సత్రాశనముఖకోవిద, విత్రాసకదుష్టహరణ విధినిపుణునకున్
మిత్రకులపవిత్రునకు సుమిత్రాత్మజసేవితునకు మేటిగుణునకున్. 56

క. శీతాచలజాతానిశ, గీతామలనామునకును ఘృణిధామునకున్
భీతాభిపాలనోద్యమ, చేతోయుతకామునకును శ్రీరామునకున్. 57

క. ఘనభక్తిసమర్పితముగఁ, బనిగొని నాచేతఁ జేయఁబడుకృతివిధ మే
మన దివ్యవృక్షశోభిత, మనిశము మునిసంఘసేవ్య మమలము నగుచున్. 58

సీ. పొలుచునై మిశ మనుపుణ్యపదంబున శిష్యప్రశిష్యులు చెలఁగ భవ్యు
లగుశౌనకాదిమహర్షులు ద్వాదశ హాయనగతసత్రయాగ మొకటి

చేయుచుండఁగ నంతఁ జిరతపోనిష్ఠుఁడు సుగుణసంపన్నుఁడు సూరినుతుఁడు
సంతతానందుఁడు శాంతుఁడు వికసితవదనుండు పరమార్థపరుఁడు ఘనుఁడు

తే. భస్మధూళితసర్వాంగభాసురుండు, వల్కలాజినవరజటాపరివృతుండు
దివ్యరుద్రాక్షభూషణదీప్తతనుఁడు, సర్వశాస్త్రార్థతత్త్వవిశారదుండు. 59

తే. మఱి త్రిపుండ్రాంకవిలసితమస్తకుండు, విజితసకలేంద్రియుండును వీతకోపుఁ
డపగతాఘుండు భవదూరుఁ డమలభావుఁ, డన్నిలోకంబులను బూజ్యుఁడైనవాఁడు. 60

క. వ్యాసానుగ్రహపాత్రుఁడు, వ్యాసునివలె విగతకాముఁ డగువాఁడు ముదా
వాసుఁడు శ్రుతిగతమార్గో, ద్భాసితవర్తనుఁడు దివ్యపౌరాణికుఁడున్. 61

తే. ఐనసూతుండు వచ్చిన నచటిమునులు, చిత్రకథలను వినఁగోరి చెంతఁ జేరి
బహువిధార్చనవందన పాద్యముఖ్య, ముల మనస్తుష్టి గావింప ముదితుఁ డగుచు. 62

క. వినయంబున నామునులకు, ఘనభక్తిన్ మ్రొక్కి యాజ్ఞఁ గైకొని యస్వా
సనమం దుపవిష్టుండై, మనమున హరిఁ దలఁచి యోగ మగ్నుం డయ్యెన్. 63

ఉ. అప్పుడు శౌనకాదిమును లాఘనయోగరతాత్ముఁ జూచి నీ
వొప్పుదు నేకదా శివము లోలిని వ్యాసుని సత్కృపాధనం
బొప్పఁగఁ జెంది సాతతము నుర్విని వర్తిలుచుంట సంశయం
బెప్పుడు లేదు నీకు సరి యెవ్వఁడు చూడఁగఁ బండితోత్తమా. 64

క. భవదీయాగమనంబున, భవములు తుది నుట్టె మాకుఁ బాపము వీడెన్
బ్రవిమలసౌఖ్యము లలరెను, భువనంబునఁ గీర్తి గలిగెఁ బుణ్యం బబ్బెన్. 65

చ. సకలపురాణవేత్త జనసన్నుతసత్కులజాత ప్రాశస
త్ప్రకటితరాత్మతత్త్వయుత భాసురయోగసమేత సూత నా
మకహృదయస్థసంశయసమాజముఁ బాపుట నీవె కాని వే
ఱొకఁడు సమర్థుఁ డౌనె సుగుణోజ్జ్వలభూషణ దివ్యభాషణా 66

క. మును సర్వపురాణంబులు, వినితిమి నీవలన నవియు విస్మృతి నొందెన్
గనుక మనంబునఁ గ్రమ్మఱ, వినఁగోరితి మొకటి దాని వివరింపవగున్. 67

ఆ. ఐదుపదులమీఁద నఱువది గలవేల, సంఖ్య నొప్పు శ్లోక సమితిఁ గూడి
పాద్మనామమునను బరఁగుపురాణంబు, గలదు దానియందుఁ గాంతదీరి. 68

క. రాముని విజయం బనుకథ, భూమానందదము నగుచుఁ బొలుపుగ నుండున్
బ్రేమం దానిన్ వినఁగను, మామనముల నిచ్చ గలిగె మహితవిచారా. 69

ఆ. సకలపాపహరము సంపత్ప్రదంబు శ్రీ, కరము భవహరంబు కాంతికరము
మూఢదుష్కరంబు మోక్షప్రదంబునై, రామచరిత మొప్పు రమ్యఫణితి. 70

క. నిరుపమమై గురుఋషివర, గరుడోరగసిద్ధసాధ్య గంధర్వమునీ
శ్వరసంఘసేవితము నై, వరరుచి నొప్పారు నదియుఁ బరమంబగుచున్. 71

## సూతుఁడు శౌనకాదులకు శ్రీరామజయంబుఁ జెప్పుట

ఉ. కావున రామచంద్రు జయగాథను జెప్పుమటంచు వేఁడఁగా
భావము పొంగి వారిఁ గని పల్కెను సూతుఁడు మానులార యీ
పావనసత్కథామృతముఁ బానముఁ జేయుఁడి వేడ్కఁ జెప్పెదన్
భావదురంతకష్టములు పాయును మోక్షపదంబు గాంచ నౌ. 72

క. రామునివిజయ మనంతము, నై మహి నొప్పారుచుండు నటు కావున నే
నేమని వచింతు నిఁక నో, భూమీసురులార సత్యభూషణులారా. 73

క. రాముని నామము నెవ్వఁడు, ప్రేమను నిత్యంబుఁ దలఁచుఁ బృథ్వీస్థలిలో
నేమఱక వాని రాముఁడు, కామితఫలముల నొసంగి కడుఁ దమిఁ బ్రోచున్. 74

సీ. భవభయంబుల నెల్లఁ బాఱఁగఁ దోలును సర్వరోగంబుల సమయఁ జేయుఁ
బ్రతిపక్షనాశంబుఁ బాటించు సతతంబు నొలయుదుర్దశలను నులిమి వైచు
బహుబంధనంబుల భగ్నంబు గావించు దుఃఖసంతతులను ద్రుంచి వైచు
సర్వకాలంబును సకలశుభంబుల సమకూర్చు సంప్రీతి సరణి మెఱయఁ
తే. బరమశోభనకరమునై పరఁగుఁ గాన, ధర్మకామార్థమోక్షప్రదమ్ము నగుచు
వెలయుచుండును శ్రీరామవిభునినామ,మహిమఁ బొగడంగఁదరమౌనె మానులార. 75

క. నను మీ రడిగినవిధమున, దనవిభునిం గిరిజ తొల్లి తమిమై నడుగన్
మనసిజవైరి నిజప్రియ, కును రామజయంబుఁ జెప్పెఁ గూర్మి దలిర్పన్. 76

చ. అనవుడు వార లిట్లని రహార్యవిభుప్రియపుత్రి కయ్యెడన్
మన మలరార శంకరుఁడు మానుగఁ దద్విజయంబు నేవిధం
బున వచియించె దాని గుణపూత జగద్ధిత సూత సెప్పవే
యనుటయుఁ నాతఁ డిట్లనియె నయ్యెడ వారికి మోద మొప్పఁగన్. 77

మ. కరుణాసాగరుఁ డైనవ్యాసుఁడు మదిం గౌతూహలం బొప్ప శ్రీ
ధరణీపాలుజయంబు నాకు నుడివెన్ దక్షంబుగన్ దాని నేఁ
గర మర్థి న్వినిపింతు వేడ్క వినుఁడీ కళ్యాణమోక్షాప్తిసం
భరితు ల్గాఁగలవారు నిక్కముగ దివ్యం బద్భుతంబై మహిన్. 78

క. శ్రీరమణికాటపట్టయి, కోరికతో నభము దాఁకు కూటంబులచే
భూరినవరత్నగణరుచి, వారముచే వెలయు విమల వసుధోజ్జ్వలమై. 79

ఆ. మీఁదనీలశిలలు మెఱయుచుండఁగఁ గ్రింద, కనకమేఖలంబు గలది యగుచు
నవ్యపీతవసన నారాయణునిమాడ్కి, భాసమాన మగుచుఁ బరఁగి క్షితియు. 80

క. క్రిందనీ మీఁదను స్ఫటికము, లందంబుగ నుండి తెల్లనై నీలశిలల్
పొందిక నడుమను వెలయఁగ, సుందరశంకరునిరీతి శోభిల్లి తగన్. 81

తే. ఇంద్రనీలశిలాఢ్యంబు సాంద్రహేమ, వామరేఖాంతరాంతరభాసమాన
మై తటిద్వ్యక్తవారివాహంబుపగిది, సంతతంబును వెలుఁగుచు సరసభూమి. 82

తే. కాంతకాసారకల్లోల కమల కుముద, రాజిసంచారపక్షివిరావఘుష్ట
శోభితోద్యానములచేత సురుచిరంబు,నగుచుఁ జెన్నొంది మఱియు నహర్నిశముల.

సీ. హరిశాతనఖభిన్న హస్తికుంభస్థల నిర్గతమౌక్తికనిచయకలిత
వనరాజితంబును వరశరభాకృష్యమాణకేసరజాల మహితసింహ
రవపూరితానేక రమ్యకందరమును గరిణులవెనువెంటఁ గదిసి తిరుగు
మదపుటేనుంగుల ప్రథితవాదంబులు వినువీథి నిండఁగ వెలయునదియు

తే. పులులు పందులు చలమున బొబ్బలిడుచుఁ,గదనమొనరింపఁ దత్పాదఘట్టనమునఁ
బగులుతాలుల చూర్ణంబు పైకి నెగయ, మిగుల శోభిల్లునదియు నై మెఱయునదియు. 84

చ. కనులు సగంబు మూసి మదిఁ గంజదళాక్షుని వేడి భక్తితో
ననిశము పాశుసూత్రయుత హస్తులు నిశ్చితభావమార్గులున్
వినయతపోధనాన్వితులు విశ్రుతకీర్తులు నై గుహాంతరం
బున నివసించుసిద్ధగణ పూర్ణము నై విలసిల్లి పొంపుసన్. 85

క. శ్రీసహితశుద్ధసత్త్వా, వాసంబై సకలవినుత భవహిమపుత్రీ
భాసురవాసము నై కైలాసము చెన్నొందు నొకఁ డిలాస్థలిలోనన్. 86

క. అనగమందు వియస్స్థలి, మానుగఁ దాఁకుచును దివ్య మణికాంతులచే
భానునికైవడి వెలుఁగుచుఁ, గానంబడునట్టి దగుచుఁ గడు నుజ్జ్వలమై. 87

తే. ప్రమథవిద్యాధరాప్సరః ప్రతతిచేత, విమలగంధర్వకిన్నర వితతిచేతఁ
గల్పతరుదివ్యసుమఫలగణముచేతఁ, జెన్ను మీఱినకైలాసశిఖరి తనరు. 88

క. ఆకూటోపరితలమున, శ్రీకరశుభమూర్తులైన సిద్ధులు గొలువన్
బ్రాకటవైభవయుతుఁ డై, లోకేశుఁడు భవుఁడు భక్తలోలుఁడు పేర్మిన్. 89

క. రతనంపుగద్దెమీఁదను, సతతానందమున నున్న శంకరు హరుఁ బా
ర్వతి చూచి ధర్మసంహిత, యుతమగువాక్యంబు పలికె యుక్తి దలిర్పన్. 90

తరల. ప్రమథనాయక నిన్నుఁ బాయక భక్తి పీడక నిత్యమున్
విమలభావముచేతఁ బాళిని వేడ్క గొల్చుటకన్న నా
కు మఱికార్యము లేదు చూడఁగఁ గోర్కె నొక్కరహస్యమున్
సుమహితంబుగఁ జెప్పవే నను శోధనంబుగ ధారుణిన్. 91

ఉ. వేలుపుఁగొండ విల్లుగను వేయితలల్గలపాము నారిగన్
మేలగు వెండికొండ తుది మిన్నగు టెక్కెముఁగాఁగ వెన్నునిం
గాలనిభప్రకాండముగఁ గైకొని యా త్రిపురంబుల న్వడిన్
గూలఁగఁ జేసి దేవతలఁ గూరిమి నేలినవాఁడ వీశ్వరా. 92

క. సర్వజగద్ధితకరణా, సర్వామరమౌనిచక్రసన్నుతచరణా
సర్వరిపువ్రజహరణా, సర్వేశ్వర చిత్ప్రకాశ సకలాధీశా. 93

ఉ. శంకర భక్తమానసవశంకర సజ్జనతాపకృద్విశా
శంకర సర్వవారబుధసంఘవిహార మృగాంకశేఖరా
శంకర మోక్షమందిర విశాలకృపారస దివ్యసాగరా
పొంకము మీఱ నేలు నను బూర్ణమతిన్ రజతాచలేశ్వరా. 94

క. దశకంధరశతకంధర, దశశతవదనాఖ్యు లలరు దనుజులు లోకా
తిశయభయంకరరూపులు, విశదోన్నతబలులు నగుచు వెలసిరి పుడమిన్. 95

తే. వారియం దాదిరక్షస ద్వయచరిత్ర, మతివిచిత్రకరంబునై యమరునటులు
చెప్పితివి మున్న యోచించి శివ తృతీయ, కథను చెప్పినవాఁడవు కావు నీవు. 96

క. సకలాత్ముఁడు భక్తేష్టుఁడు, సకలేశుండైన రామచంద్రునివిజయం
బిక నైనఁ జెప్పి నామన, మకళంకము గాఁగఁ జేయనగు నీవేళన్. 97

చ. అని నయభక్తితో నడుగు నంబికమాటల నాలకించి యా
మనసిజవైరి మెచ్చి పలుమాఱులు రామునిపాదపద్మముల్
ఘనముగ సంస్మరించుచును గౌతుకమొప్ప దయార్ద్రచిత్తుఁడై
విను గిరిరాజపుత్రి రఘువీరునిదౌ విజయంబు సర్వమున్. 98

తే. తేట తెల్లంబుగాఁగను దెలిసి చెప్ప, నలవిగా దెన్నటికి నైన నతనితత్త్వ
మెఱిఁగినంత ముదంబున నిపుడు నీకుఁ, జెప్పెదను భక్తితో విను చిత్త మలర. 99

## ఈశ్వరుఁడు పార్వతికి రామవిజయంబుఁ జెప్పుట

మానిని. భామిని రాముఁడు సద్గుణధాముఁడు భక్తహృదుత్పలసోముఁడు శ్రీ
ధాముఁడు సజ్జనకాముఁడు దుర్జనదానవభీముఁడు సంతతసు
త్రామముఖామరవందితనాముఁడు రమ్యపయోధరసన్నిభసు
శ్యాముఁడు సుందరకాముఁడు భూవరసంఘలలాముఁడు సత్యముగన్. 100

క. కాత్యాయని బ్రహ్మాదులు, సత్యానందాత్మునందు సత్యము గాఁగన్
నిత్యము రమించుచుంటను, నిత్యునకున్ రామపదము నెగడె ధరిత్రిన్. 101

క. మాయాగుణుఁడై నిత్యము, పాయక సర్వంబు నతఁడె పరమప్రీతిం
జేయుం నని తోఁచు నేమియుఁ, జేయఁ డసంగుండు నగుటచే నెల్లపుడున్. 102

ఉ. భూమిని ధర్మమే విధిగ భూరివిభూషణపంక్తియై జన
స్తోమము మెచ్చ నేర్పడుచుఁ జూడ్కి కింపయినట్లు రాఘవుం
డీమహిఁ బెక్కురూపముల నేర్పడి సర్వహృదబ్జసీమలన్
బ్రేమ దలిర్పఁ దాఁ దగిలి వెల్గుచు నుండు ననంతకాంతిచేన్. 103

ఉ. ఈపదునాల్గులోకముల నేర్పడఁ జూడఁగ రామనామమున్
బాపును సర్వపాపముల భక్తులకున్ మతిపాతకంబులన్
బాపఁగ లేదు లే దనుచుఁ బల్కెడివారల పాపసంఘమున్
బాపఁగఁజాల దెన్నటికిఁ బావనరాముని నామ మారయన్. 104

క. భవసర్పదష్టజనులకు, భవతారక మైనరామపదసంస్మరణం
బవితథపరమౌషధమై, భువి వారిని బ్రతుకఁ జేయుఁ బూర్ణేందుముఖీ. 105

క. సారెకు సారెకు రాముని, గోరికతోఁ దలఁచువారు కుంభినిలోనన్
దారుణసంసారోదధి, తీరము దాటంగఁ గలరు ధీరత్వముతోన్. 106

తే. ధరణి నెవ్వాఁడు రామునిఁ దలఁచుచుండు, వెనుకటియఘంబుల కతండు వెలివడలఁడు
మేడపైఁ జేరుకొని సారమేయములను, గాంచి దిగులొందనేల యక్కజముగాఁగ.

మ. సకలాఘౌఘనివారకంబు విగతాశాచక్రసంబంధ మ
త్యకలంకాత్మబుధేంద్రసేవితము నిత్యానందసౌభాగ్యదా
యకసాహస్రశిరస్సురారిబలసంహారంబు నిత్యంబునై
సుకరంబై విలసిల్లు రామజయ మీక్షోణీస్థలిం జూడఁగన్. 108

క. నిత్యుఁడు నిర్మలగాత్రుఁడు, సత్యచరిత్రుండు భక్తసంరక్షణుఁ డా
దిత్యకులదీపతుల్యుఁడు, ప్రత్యగభిన్నాత్ముఁ డితఁడు పరికింపంగన్. 109

తే. నయవిదూరులు కొందఱు నరుఁ డటంచు, దశరథాత్మజు మదిలోనఁ దలఁచి మాయఁ
జిక్కి తముఁ గానఁజాలక స్రుక్కి జన్మములను బొందుచున్నారు పుడమిలోన.

క. దేవాదిదేవుఁ డజరుఁడు, భావాతీతుండు త్రిగుణబాహ్యుఁడు భూభృ
ద్దేవాదిసర్వవినుతుఁడు, పావననాముండు రామభద్రుఁడు చూడన్. 111

క. శ్రీరమణీమణి పార్వతి, భూరమణుం డైనరామపుంగవుచరితం
బారసి చెప్పెద వేడుక, లూరఁగ విని ముదము చెందు ముజ్జ్వలమతివై. 112

## పూర్వ సంగ్రహ రామాయణము

సీ. ద్వాదశయోజనాత్యాయతత్రియుతయోజనవిస్తృతంబునై తనరునదియుం
మనునిర్మితంబునై మణిధర్మకాంతిచేఁ జెన్నొందునదియును జిత్రరుచుల
నెపుడు భావిత్రివ్యల కెదురుదు క్కుగుచును రఘువంశజుల కెల్ల రాజధాని
యగుచుఁ గోసలదేశమందు సరయుంబొంత ధరణికిఁ దొడవునై తగునయోధ్య

ఆ. యనెడుపురము పుడమి నమరావతినిఁబోలి, వెలయుచుండుదాని విబుధరాజ
విహితపీఠభాగ విలసితుఁ డౌపంక్తి, రథుఁడు వేడ్కనేలుఁ బ్రథితకీర్తి. 113

క. మేరునగధీరుఁ డమలుఁడు, సారసద్గుణకదంబసహితుఁడు దివ్యా
చారసుశీలుఁడు దీనో,ద్ధారుఁడు నై ఖ్యాతి నొందెఁ దజ్ఞులు మెచ్చన్. 114

సీ. హరిసూను హరిసూను హరిసూను లనుమీఱు నేరాజు జయరూపసారములను
గోపతి గోపతి గోపతిసన్నిభుఁ డేరాజు మతిభోగగౌరవములఁ
గమలాక్ష కమలారి కమలాప్తతుల్యుఁ డేదొర నేత్రశీతలద్యుతివితతుల
భవపుత్ర భవమిత్ర భవశత్రుసామ్యుఁ డేదొర రౌద్రరక్షణతోషణముల
ఆ. ద్వాదశాబ్దభీతిదక్షామవారణుఁ, డెవ్వఁ డట్టిదశరథేశవిభుఁడు
పెక్కువత్సరములు ప్రియభోగవారాశిఁ, దేలి సుతులు లేక జాలి నొంద. 115

ఉ. కాంచి సుమంత్రుఁ డోనృపతి కల్గుదు రాత్మజులింక నీవు నొ
క్కించుక సాళయింప వల దీవ్రతముం దగుఋష్యశృంగునిన్
వంచన చేసి నీపురికి బాగుగఁ దెచ్చి వసిష్ఠచోదితో
దంచితవీతిమేధమును నందఱు మెచ్చఁగఁ జేసి క్రమ్మఱన్. 116

తే. పుత్రకామేష్టిఁ గావింపు పుత్రవరులు, నల్గు రొగిఁ గల్గుదురు జననాథ యనఁగ
నట్ల భూపతి చేసినయజ్ఞపురుషుఁ, డొక్కరుం డేగుదెంచి మహోత్సవమున. 117

ఉ. పాయస మిచ్చి పోవఁగను బాయనిప్రేమ దలిర్చుచుండ నా
పాయస మాత్మపత్నులకు బంధురభక్తి నొసంగె వేడ్కతోఁ
దోయజనేత్రలందుకొని తోడ భుజించి తదీయశక్తిచే
నాయెడ గర్భధారణము నందఱు చెంది క్రమక్రమంబునన్. 118

క. పరిపూర్ణచంద్రుఁ గేరెడి, వరముఖములు వేగుచంద్రు వైఖరి దాల్చెన్
అరుదుగ నడుములు కడువడి, గురుభావము నొంద సాగెఁ గువలయనేత్రా. 119

తే. అలరువిల్తునిపూబంతు లనఁగ నొప్పు, చనులమొనలను నలుపెక్క సాగె మిగులఁ
దొండపండులరుచులను దొంగిలించు, పెదవులకుఁ గృష్ణభావంబు పెంపు సెందె.

క. మేనుల నెప్పుడు బడలిక, గానంబడె నాభివితతి కన్పడఁ జొచ్చెన్
నానాఁటికి మృద్భక్షణ, మానసముల కింపు దోఁచె మానుగ సంతన్. 121

ఉ. భామలచూపులందు హిమభానునిరోచులు పర్వెనో యనం
గా వఱలి గండభాగములు గ్రక్కునఁ బల్చనవాఱె మోములన్
సోములు గోములై యమృతసోనలు చిల్కనరీతిఁ జిట్టెముల్
కోమలతావిశేషమునఁ గూర్మి జనించెను వారి కింపుగన్. 122

క. వారక చీమలబారుల, మీఁటెడినూగారు తెలిమి మిలమిల మెఱసెన్
ధీరక్ష్యసరణి యొదవెను, ధీరాత్ములు గర్భములను దిరముగ నుంటన్. 12[illegible]

తే. అంత నవమాసములు పూర్ణమైనఁ జైత్ర, శుద్ధనవమిని బుధవార శుభదకర్కి-
సవ్యలగ్నంబునందుఁ గౌసల్యకిరయె, రాము గుణధాము మునికాము రమ్యనాముఁ

చ. అదితియుఁ దొల్లి శక్రుఁ గనినట్టులు ప్రాక్సతి చంద్రుఁ గన్నరీ
తి దగ సుపుష్యతారకను దీపితవారిచరాలయంబునన్
విదితచరిత్ర కైక మది వేడుక లూరఁగఁ గాంచె జైత్రునిన్
వరభరతాఖ్యపుత్రుని బ్రభంజితశత్రుని దివ్యగాత్రునిన్. 125

తే. అతులఫణితారకోపేతమైన కటక, రాశిలక్ష్మణశత్రుఘ్ను రమ్యసుతుల
సత్యచారిత్ర సద్గుణ సంఘపాత్ర, యగుసుమిత్రయుఁ గాంచెను హర్ష మొదవ.

సీ. కలనిస్వనంబుల ఘనతతి ఘోషించెఁ దెలివొందె దిక్కులు దీప్తి గుల్క-
సుద్రంబు లేదుచు స్వచ్ఛంబులై పొంగెఁ జల్లని తెమ్మెర ల్చాల వీచె
గ్రహతారకంబుల గగనంబు భాసిల్లె వెలుఁగొందె హోమాగ్ని విపుల మగుచు
సారసకహ్లార సారసతతులచేఁ గాసారములు చాలకాంతి నొందెఁ

తే. గురిసెఁ బుష్కరమున నుండి కుసుమవృష్టి, పక్షిరవములు వనముల బహుళమయ్యె
మాను లెల్లను సంతోషమగ్నలైరి, రాముఁ డుదయించువేళ నో రమణి మున్ను.

క. సన్నుతచరితుని రాముని, గన్నంతనె జగములకును గాంతి చెలంగెన్
గన్నీరు పగర చెలులకు, మన్నీరై పాఱెసాగె మోదముఁ దొలఁగన్. 128

తే. సరసగుణుఁడు వసిష్ఠుండు జాతకర్మ, నామకరణంబులను జేసె నరకదంబ
నాథసుతులకు సంప్రీతి నాఁటనుండి, సకలజనములు పొదఁగాంచి సంభ్రమింప.

క. చెలఁగి హిమాంశునికై వడి, సలలితముగఁ బెరిగి జనక జననీహృదయం
బులు రంజిల్లఁగఁ జేయుచు, విలసిల్లుచు నుండి రపుడు విస్మయ మొప్పన్. 130

మ. క్రతురక్షార్థము దండ్రి పంపఁగను వేడ్కన్మౌనితో నేగి దు
ర్వ్రితభాషావరనాటక స్గుటిలదివ్యక్షేటకం దాటకం
గ్రతునాశేచ్ఛు సుబాహుఁ బాపవహు నభ్రవ్యాప్తు మారీచునిన్
క్షితిపైఁ గూల్చె నుదగ్రబాణతతి నక్షీణప్రభావోన్నతిన్. 131

క. ధీరుండై కౌశికుమఖ, మారాముఁడు కాచి మరల నందఱుఁ జూడన్
సూరిమి నిజపదధూళి, న్నారీమణిఁ జేసె ఱాలి నైజమహిమచేన్. 132

క. కరి చెఱుపగదను గోరిక, విఱిచెనుకై వడిని బాహు విస్తృతశక్తిన్
హరువిల్లు విఱిచి సీతా, వరసతికై నృపులమానభంగం బొదవన్. 133

ఉ. భూతలనాథుఁ డైనరఘుపుంగవుఁ డార్యసమస్తసద్గుణ
వ్రాతను దివ్యభూషణసువస్త్రసమేతను భూరివైభవో
పేతను దారితాఖిలవిభీషణదుర్మదదైత్యకోటిసం
ఘాతను సీతనుం దమిని గాంచియుఁ బెండిలి నాడి త్రోవలోన్. 134

క. రాముఁ దీర్ఘకుఠారో, ద్దాము న్విదళీకృతాతిదర్పితభూభృ
ద్ధాము న్భార్గవరాముఁ, భీమాస్త్రహతాంగుఁ జేసి భీతుం జేసెన్. 135

ఆ. దేవి పిదప రామదేవుఁడు పురిఁ జేర, రాజ్యమునకు నతని రాజుఁ జేయ
రాజు తలఁచు టెఱిఁగి రామునిపైఁ బగఁ, దలఁచి పాపబుద్ధి తనరుచుండ. 136

చ. మలయుంచు మంథరాఖ్య గలమానిని చయ్యనఁ గైకఁ జేరి యో
లలనరో నిన్ను నీసుతుని లక్ష్యము చేయక నీమనోహరుం
డిలకును రాజుఁ జేయ రఘువీరుఁ దలంచెను వేడ్కనింక నిం
జాలకన గాఁగ నీసవతిమాచును నీబ్రతు కేల కుంభినిన్. 137

చ. అని పలుమాఱు దుష్టవిషయం బగుబోధన చేయఁ గైక తా
విని తలయూఁచి మంచి దని వేగమె జీర్ణపుఁగోకఁ దాల్చి చ
య్యన భువి వ్రాలి సొమ్ములఁ బ్రయత్నముతో నటఁ బాఱ వైచి భ
ర్తను గని రోష మొప్పఁగను బల్కుచు దోరపుయుక్తి మీఱఁగన్. 138

క. దేవాసురయుద్ధంబున, భూవర నీవిచ్చినట్టి ముఖ్యవరంబుల్
గావలె నం దొకదానికి, నేవగపును లేక రాము నిందఱు చూడన్. 139

క. వనములఁ దిరుగం బంపుము, మనసారగ భరతు నిపుడు మహి నేలుటకై
మనుజేశుఁ జేయుము మీపని, మనుజేశులు పొగడుచుండ మహితవిచారా. 140

క. నీరధిసమగంభీరా, ధీరా నీకీర్తి సకలదిక్కుల వెలుఁగం
గూరిమి నాకోరిక నీ, ధారుణి సఫలంబుఁ జేయఁ దగు నీవేళన్. 141

చ. ఇనకులజన్ము లెల్ల మును లింపుగ నాడినమాట దప్పకే
ఘనులని పేర్కొనం బడుచుఁ గాశ్యపి నేలిరి నీవు తత్కులం
బున జనియించి సత్యమును బో విడనాడి నటింప మెత్తురే
జనము లటంచుఁ బల్కుసతి సాహసవృత్తిని జూచి యాత్మలోన్. 142

క. ఈనవల కేను లోఁబడఁగా నా కిటువంటిదుష్టకష్టము గలిగెన్
గానిమ్మెడ రాముఁ డేటికిఁ, గాననసీమకును బోవఁ గలుగునె చూడన్. 143

క. అడవికి రాముఁడు పోయిన, నొడలిం బ్రాణమ్ము లెట్టులుండును నాకున్
జడమతిమాటలకే నిపు, డొడఁబడఁగా వలదె నీకి యొనఁగూడెఁదుదిన్. 144

తే. కాముకుని కెన్నటికి నైనఁగలదె సుఖము, మున్ను మహిళారతిచ్ఛాసముద్రమందు
మునిఁగి పెక్కండ్రు చెడిరని ఋషులు చెప్ప, పలుకు నిజమయ్యెఁ జూడ నీపడఁతికతన.

క. వేమాఱిటు చింతించుచు, భూమీశుఁడు గహనమునకుఁ బొమ్మని పనిచెన్
రామున్ సద్గుణధామున్, క్షేమాసురభీము లోకపృథుహితకామున్. 146

చ. జనకుఁడు పంప మే లనుచు సాధ్వియును లక్ష్మణుఁ డింపు మీఱఁగాఁ
దనవెనువెంట రాఁ గదలి తాపసరూపముఁ దాల్చి ధీరుఁడై
వనచరసింహముఖ్యమృగపంక్తిరవాన్విత కాననాంతరం
బునకును బోయె మానికులముఖ్యుల దీనులఁ గావ నయ్యెడన్. 147

క. మంగళగాత్రుఁడు రాముఁడు, మంగళకరపార్వతీశమస్తకసంగన్
రంగత్తరంగ నఘచయ, భంగన్ ధవళాంతరంగ పావనగంగన్. 148

క. కని సంతసించి భక్తిగఁ, జని తజ్జలమందు దోఁగి సారోదకము
న్ననసారఁ గ్రోలి తీరము, నను మెలఁగుచు నుండి ముందు నవ్యప్రీతిన్. 149

క. ప్రకటితబలయుతబాహున్, సకలామరమోహకరణ సద్గుణనివహున్
జకితాత్మరక్షణోద్వహు, సకలంకమనోజ్ఞదేహు నాగుహుఁ గాంచెన్. 150

క. కాంతరోగుహాలయంబున, కెంతో ప్రీతి మెలఁగి నేగి యింపుగఁ బూజల్
సంతోషంబునఁ గైకొని, యంత భరద్వాజుఁ జేర నరిగి సభక్తిన్. 151

తే. మ్రొక్కి పూజించి వినుతించి ముని యొసంగు, నట్టిఫలముల భక్షించి హర్ష మొంది
యాజ్ఞ గైకొని విపులస్థలాంతరమున, కరుగుచుండఁగ నాలోఁ బ్రయత్నముగను.

చ. భరతుఁ డయోధ్యఁ బాసి బహుభంగులఁ దల్లిని దూరుచు న్మదిన్
గురుతరచింతచేత రఘుకుంజరుచెంగటఁ జేరి మ్రొక్కి తం
డ్రి రహితజీవుఁ డౌట భయరీతి మనంబునఁ జెప్ప దుఃఖసం
భరితుఁడునై రఘూద్వహుఁడు భావముశోకలఁ దల్లడిల్లుచున్. 153

క. గురునకు గంగాజలమునఁ, బరలోకక్రియలు సేసి పరమప్రీతిన్
గురుమాతృవందనంబుల, నిరుపమగతిఁ జేసి పనిచి నేర్పున భరతున్. 154

క. సురుచిరరాజ్యం బేలఁగఁ, గరుణన్ వీడ్కొలిపి తాను గ్రక్కున నెక్కెన్
వరచిత్రధాతుశోభిత, గురుగోత్రాచలము చిత్రకూటాచలమున్. 155

సీ. అనగమందుండి యవనిజకును గీడు కావించు కాకంబు గర్వ మణఁచి
బర్హిలావణ్యంబు ఘనసాదితరుకుంజ పుణ్యావరేణ్యంబు మంజుమాని
గణశరణ్యంబు సుగంధసాద్గుణ్యంబు నగుదండకారణ్య మపుడు చేరి
పాపరాధువిరాధుఁ జక్కాడి కుంభజుఁ గని చేరఁ జని మ్రొక్కి వినుతిఁ జేయఁ

తే. జూచి మోదించి మునిపతి సురుచిరముగ, డెందమందునఁ దన్మూర్తిఁ బొందుపఱిచి
తన్మయత్వంబులోఁ గొంతతడవు బొగడి, సంతసించుచు సద్భక్తిసహితుఁడగుచు.

క. సరసంపుమాట లాడుచు, శరచాపము లిచ్చి వాని సన్నుతవటికిన్
వరపంచవటికిఁ బొమ్మని, కర మనురాగమునఁ బనుపఁ గమనీయగతిన్. 157

మ. చని దానిం గని యిచ్చ మెచ్చుచు లసచ్చారిత్రులా వానులం
గని సద్భక్తి నమస్కరించి వినుతుల్గావించి కీర్తించి త
ద్ఘనరమ్యస్థలి నుండ నెంచి కడు వేడ్కం బర్ణశాలం దగన్
మనసొప్పారఁగఁ గట్టియుండి రచట న్స్వామీంద్రరూపంబులన్. 158

క. ఆలోనఁ గంతుకేళిని. వాలాయమ్ముగను గోరి వరరూపముతో
లీలన్వచ్చెడిశూర్పణ.ఖాలలనను జూచి కోపకలితాత్ముండై. 159

ఆ. రాము నాజ్ఞ నొంది రయమునఁ జనుదెంచి, కాముక్రీడ మదిని గాంక్ష నొందు
వానివలె నటించి భాసురకరమున, ఖడ్గమును ధరించి కదియఁబోయి. 160

తే. నలువ ని న్నెట్లు నిర్మించెఁ గులుకులాడి, బేల యీవేళ నను వలపింపనేల
బాళిమెఱయఁగ వలరాజు బాఱిఁబడితి, నేలు తడవేల చేసెద విందుఫాల. 161

ఉ. కామిని నీవహో యల్లనినఁ గాములకైనను బ్రేమగల్గదే
యేమహి నిన్ను నెన్నఁ దరమా ఘనమా వినుమా మనంబు నీ
మోమనుచందురుం గని విమోహపుసంద్రమున న్మునింగె నే
నేమని నిర్వహింతు తడవేలను రమ్మిటు కామకేళికిన్. 162

క. అనిపల్కు ముక్కు సెవులను, దనఖడ్గముచేతఁ గోసి తరుణీ నీకో
ర్కెను దీర్చినాఁడఁ బొమ్మన, గనులను గన్నీరు దొరుగఁ గాంతియుఁ జెడఁగన్. 163

క. మనమున రోషము పెనఁగొనఁ, గను వేగమె చింత నొంది కడు సిగ్గున మో
మును వంచి భంగపాటునఁ, జని ఖరదూషణులఁ జూచి చాన పెనువగన్. 164

క. తనపాటు చెప్ప వారలు, విని రోషము పెనఁగొనంగ వేగమె గుములై
ఘనశస్త్రధారు లగుచుం, జనుదెంచినఁ జూచి రామజనపతి యలుకన్. 165

ఉ. ఒక్కఁడె వారిపైఁ గవిసి యుజ్వలశస్త్రపరంపర ల్వయిన్
మిక్కుట మొప్పఁగాఁ బఱపి మేదిని వారల నొక్కపెట్టునం
జక్కఁగఁ గూల్చి వీరజయ సన్నుతలక్ష్మిని గాంచి దేవత
ల్మక్కువతోడఁ జూచి తను మన్ననచేసి నుతించుచుండఁగన్. 166

క. నిరతము రాక్షసకైతవ, మరయుచు సౌమిత్రి రాత్రి నహమం దొనరన్
వరకోదండశరాన్విత, కరుఁడై దుష్టారిభీతికరుఁడై యుండెన్. 167

సీ. ఖరదూషణాదిరాక్షసచతుర్దశసహస్రంబులు రాముచే సమయుటయును
విని రావణుండు కిన్క వీరు మారీచుని బైఁడిమృగంబుగఁ బరఁగఁ జేసి
పంపించి జడదారి బటువేషమును బూని పరువడి రఘురాము పర్ణశాల
కడ దాఁగి యుండఁగఁ గనకమృగంబును గని సీత సంతోషకలిత యగుచు
తే. బట్టి తెమ్మని తనభర్తఁ బంపఁ జూచి, సమయ మని వచ్చి రామునిచానఁ గొనుచు
నింటి తెరువునఁ బోవుచు నుంటఁ జూచి, కాలరుద్రుని కైవడిఁ గదియ వచ్చె. 168

ఆ. తరణి వంశకార్య దత్తాయు వతిగురు, పక్షివిజితవిపుల వాయు వైన
యజ్జటాయు వంత నట్టహాస మొసర్చి, కాళ్ల తొండములను గఱకుదనుజు. 169

క. నొప్పింప నలిగి రావణుఁ, డప్పక్షికులేశుమేన నమ్ములవానన్
నొప్పింపఁ గొండచాడ్పున, జప్పుడుఁ జేయుచును నేలఁ జదికిలఁ బడియెన్. 170

మ. దనుజాధీశ్వరుఁ డోలి భూమిసుత నుద్యచ్ఛక్తిమైఁ దెచ్చినం
దనసంకాశవనంబులో నునిచె నంతన్ శీఘ్రమే పర్ణశా
లను జేరం జని సీత గానమిని జాలన్ రామభద్రుండు త
ద్వనభాగంబుల నెల్ల నుద్దవడి తోఁ బల్మారు శోధించుచున్. 171

క. చింతాసాగరమందుం, గాంతను దలపోసి మునుఁగఁ గని లక్ష్మణుఁడున్
జెంతం జేరి నయోక్తుల, గొంతవడి నోర్వ చేయఁ గుతుకము దొలఁగన్. 172

తే. లేచి దిక్కులు గలయంగఁ జూచి చూచి, చపలుపైఁ బడుమానవుచంద మొప్ప
దోఁచి తోఁచక పదములు తొట్రుపడఁగ, లక్ష్మణునిగూడి యెట్టకేలకును గదల.

ఉ. మంత్రనముండి చింతఁ బలుమాఱును జేయుచు గాననంబునన్
సంతతభూత భూమిసుత సత్యసమేతయు నైనసీత న
త్యంతదురంతవేగమున నారసి కానక దిక్కుదోఁచకే
సంతస మేమి లేక గిరి సానుతలంబులఁ జూచి క్రమ్మఱన్. 174

మ. మునిలోకం బగుఋశ్యమూకమునకు న్మోదంబునం బోయి త
ద్వనభాగస్థితరమ్యవారికమలవ్రాతాండజప్రోల్లస
ద్ఘనశాసారనిలింపఁ బంపఁ గనుచుం గాండవ్రజోపేతులై
మునివేషంబుల నున్నరాజసుతులన్ బుణ్యాత్ముల న్గణ్యులన్. 175

మ. కని సుగ్రీవుఁడు 'వాలి పంపఁ గడు పేర్కాన్ శస్త్రసంపన్నులై
తనుఁ జంపన్ సమకట్టి వచ్చిరి తగం దార్కొణ'మంచాత్మ జెం
చి నగాగ్రంబున కెక్కి మారుతికడన్ జేరంగఁ దా వచ్చి వా
రిని జూపించుచుఁ బల్కె దుఃఖమున నీరీతిన్ బ్రకంపంబునన్. 176

క. మారుతి వేగమె వారిం, జేరం జని మాటలాడి చిత్తమునం దే
కోరికతో నిటు వచ్చిరొ, తూరిమి నద్దాని దెలిసికొని వచ్చి తగన్. 177

తే. మానసంబునఁ గలభీతి మాన్పుమిప్పుడె, పరమదయతోడ నని తన్నుఁ బ్రస్తుతింప
నబ్జహితపుత్త్రుఁ డానతి నంతఁ బూని, వెడలె ధీరత్వమున దేవవితతి చూడ. 178

క. హరిపుత్త్రుని హరిపురికిని, గర మనురాగమునఁ బంపఁ గమలాప్తసుతున్
వర కిష్కింధకు రాజుగ, సురుచిరముగఁ జేయుటకును జోద్యము మీఱన్. 179

తే. రమణి రావణుజయలక్ష్మి రామవిభుని, జేర్చుటకు భూసుతాధిక చింత దీరఁ
జేయుటకు రామచంద్రుని చెంతఁ జేర, వచ్చెనో యని బుధవరు లుచ్చటింప. 180

క. వినువీథినుండి భూమికి, బనివడి యేతెంచు తమ్మిపడఁతి మగనిరీ
తిని బూని బుశ్యమూకఁబున నుండియె వచ్చుచుండె భూస్థలిపైకిన్. 181

ఉ. పయ్యెరముద్దుపట్టిఁ గని భానుకులేశుఁడు వింత నొందుచున్
దయ్యమొ లేక దుష్టపటుదానవుఁడో గురుశక్తియుక్తిమై
గయ్యము జేయఁగోరి కపిగాత్రముతో నరుదెంచుచున్నవాఁ
డియ్యెడ కంచు లక్ష్మణున కింపుగఁ జూపుచుఁ బల్కె భామినీ. 182

చ. కనకపువన్నె మేను కరకంకణము ల్కమనీయహారముల్
ఘనమణిధర్మకాంతిచయ కర్ణవిరాజితకుండలంబులున్
ఒనరఁగ నొంటిజన్నిదము నుజ్జ్వలమౌంజియు గోఁచి యొప్పఁగా
వనచరరూపియై భవుఁడు వారక వచ్చెడురీతిఁ దోఁచెడిన్. 183

క. అనుచుండ వచ్చి రఘుకుల, వననిధిసోమునకు మ్రొక్కి భానుజుతెఱవున్
దనవిధిజన్మక్రమమును, వినిపించిన రాముఁ డంత విస్మయపడుచున్. 184

తే. వాయుపుత్త్రునితోఁ బల్కె భానుసూను, నకు మదీయచరిత్రంబు నయము మీఱఁ
జెప్పి నేస్తంబుఁగావించి శీఘ్రముగను, రమ్ము పవనజ యని పంప రయము మెఱయ.

క. మారుతి రవిసుతుకడకున్, జేరం జని మ్రొక్కి రామ జనపతిచరితం
బారసి వచ్చితి మర్కట, వారేశ్వర భవదదృష్టఫల మే మందున్. 186

తే. చెలిమి నీతోడఁ గావింపఁ జిత్తమందుఁ, దలఁచె శ్రీరామభద్రుఁడు తథ్య మనిన
విని ముదం బంది వారిని వేగ యిటకుఁ, దెచ్చి నాకును జూపించి దిగులు దీర్పు.

చ. అనవుడు నట్లు చేయుదు నటంచని వాయుజుఁ డేఁగి వారలన్
దనవిపులాంసభాగమునఁ దద్దయుఁ దాల్చి జవంబు మీఱఁగా
ఘనగిరిసానుమధ్యగతకాంతతలంబున నుంచి మించువే
డ్కను జని తెల్ప నాతఁ డతికౌతుక మొప్పఁగ వచ్చి భక్తితోన్. 188

శా. రామస్వామిపదారవిందములకున్ రంజిల్లుచున్ మ్రొక్కి శ్రీ
రామా దానవబాధ భీతికరసంగ్రామైకసీమా గుణో
ద్దామా మౌనిహృదబ్జధామ వరసీతారామ నన్నేలి యీ
భూమి న్బాధలఁ బెట్టె నింక దయతోఁ బోషింపు ముత్కంఠతోన్. 189

క. ఇనసుతుఁ డీవిధమునఁ ద, న్వినుతించినఁ జూచి రామవిభుఁ డావేళన్
మన మలర నతనిఁ గౌఁగిట, నునిచి సమర్యాద మిగుల నొప్పుగఁ బలికెన్. 190
క. నిగ్రహ మేలకొ శరమున, నగ్రజుఁ డగువాలిఁ జంపి యత్యుత్సవమున్
విగ్రహమున నొనఁగూర్చెద, సుగ్రీవా పాదఘాత చూర్ణగ్రావా. 191
క. అనవుడు ధైర్యము మనమున, బెనఁగొన నాహరిసుతుండు ప్రీతిన్ రామున్
వినుతించి యాజ్ఞ గొని హరి, తనయునితోఁ బోరుచుండెఁ దడఁబడ కంతన్. 192
తే. రామవిభుఁ డొక్కకోలను భూమిఁ గూల్చె, వాలిని దశాస్యగురుమానభంగకరణ
శాలిని వివేకసద్గుణ జాలవల్గు, మాలిఁ దర్పితశూలిని మహితబలిమి. 193
క. ధరఁ గిష్కింధకు రాజుగఁ, గరుణన్ సుగ్రీవు దివ్యకంబుగ్రీవున్
గర మరుదుగఁ గావించెను, దరుచరు లానంద మొందఁ దరుణేందుముఖీ. 194
క. సురయుక్తుఁ డై సుధర్మాం, తరమున వెలుఁగొందు దేవతాధిపురీతిన్
సరగున నయ్యెడఁ దరుచర, పరివృతుఁడై భానుసుతుఁడు భాసిల్లెఁ దగన్. 195
సీ. శ్రీరాము నానతి శిరమునఁ గడుఁ దాల్చి విచుచూలిపట్టి తా వితతఘోర
జలచరకల్లోలసాంద్ర మాసంద్రంబు దాఁటుచు మైనాకదత్తపూజఁ
గైకొని తన మ్రింగఁ గాంక్షించి వచ్చిన విరసయౌ సురసను వేగ తఱిమి
బలశక్తి సింహికఁబట్టి వారిధిఁ గూల్చి లంకను బరిమార్చి లంకఁ జొచ్చి
తే. నిశిని మార్జాలరూపుఁడై నెమ్మి సీతఁ, గాంచి శ్రీరాము సేమంబుఁ గ్రమ్మ ఫణితిఁ
జెప్పి ముద్రిక నొసఁగి తచ్ఛీర్షరత్న, మపుడు గైకొని రావణోద్యానవనము. 196
తే. పెఱికి రేద్రిమ్మరీడులఁ బీఁచమడఁచి, యక్షు ననిఁ జంపి బ్రహ్మమహాస్త్రశక్తి
బద్ధుఁడై రావణునిఁ జేరి బుద్ధి గఱపి, దేవతాశంక యగులంకఁ దిరిగి తిరిగి. 197
క. వాలాగ్ని దానిఁ గాల్చి వి, శాలాబ్ధిం దాఁటి ప్లవగసంఘముతోడన్
లీల న్వచ్చి రఘూద్వహు, పాల న్గడుభక్తి నిల్చి పరమప్రీతిన్. 198
ఉ. వందన మాచరించి రఘువంశజుతో జనకాత్మజాశుభం
బందముఁ జెందఁ జెప్పి దనుజాధిపుశౌర్యసమగ్రశక్తినిన్
సుందరమందిరామ్రవణ శోభనవృక్షలతాభిరామ సం
క్రందననందనాభవన రమ్యతఁ బల్కి ముదంబు మీఱఁగన్. 199
క. సీతామస్తకరత్నము, చేతికి నందియ్యఁ జూచి సీతాపతి యా
వాతాత్మజు శ్లాఘించుచు, నాతఱిఁ బ్లవగాన్వితుండు నై చని యెదుటన్. 200
శా. రారాజల్లనఁ జూచెఁ జిత్రమతియై రంగత్సుకల్లోల వి
స్తారోదారతరంగఘట్టనపటుధ్వానప్రగంభీరమున్
సారప్రాభవదివ్యరత్నవిలసచ్ఛాయోన్నతాగారమున్
పారావారము ఘోరకూర్మశకులీవారంబు దత్తీరమున్. 201

తే. చూచి లంకకుఁ ద్రోవను జూపు మనుచు, వేఁడ మార్గంబుఁ జూపక వేడ్క నబ్ధి
మింటి కెగఁబొంగుటకు గాంచి మిహిరకులుఁడు, కోపఘూర్ణితచిత్తుఁడై చాప మెత్తి.

మ. శరసంధానము చేయఁగా శరధి శశ్వద్భీతుఁడై భక్తి దా
శరథిం జేరి నమస్కరించి జగదీశా కోప మేలా ననుం
గరుణ న్గావుము సర్వలోకములు నీ కళ్యాణకుక్షి న్నిరం
తరముం బుట్టియుఁ బెంపు నొందు నడఁగుం దక్ష్యంబు సర్వాత్మకా. 203

తే. రాజసంబున వేధల రమ్యసత్త్వ, భవ్యగుణమున దేవతావ్రజముఁ దమము
చేత భూతవితానంబు చెన్ను మీఱఁ, జేయుచుందువు సర్వేశ చిత్ప్రకాశ. 204

క. వారిధి గట్టుము లంకం, జూఱఁగొనుము శరము లేసి సురరిపుతలలన్
ధారుణిఁ దునియం గూల్పుము, సారసముఖి సీతఁ గొనుము సారసనేత్రా. 205

చ. అని వినయంబునం బలుకునంబుధిమాటల కాత్మ మెచ్చి యో
వననిధి శంక లేక యికను భద్రముగా మను మంచుఁ జెప్పినన్
విని చన నంత కీశవరవీరులు సారమహీధ్రపంక్తులన్
బనిగొని తెచ్చి వారినిధిబంధురసేతువు గట్టి రయ్యెడన్. 206

శా. శర్వాణీ విను మావిభీషణుఁడు భూజాతాపహారున్ ఘనున్
శౌర్యోదారుని రావణాసురుని దుశ్చారిత్రునిం జూచి నీ
కుర్విం గాంతలు లేరు భూమిసుత నాయుర్వీశునిం జేర్చి సం
ధార్యప్రాభవకీర్తితో మనుట యుక్తం బంచు భాషించినన్. 207

క. విని రావణుండు తమ్ముని, గని నీవా నాకు నీతి గఱపెడిదొర వం
చని తన్ని పొమ్మన న్మన, మున రోసి పురంబు విడిచి మోద మ్మెడలన్. 208

ఉ. రామునిఁ జేరి మ్రొక్కి రఘురామ మనోహరనామ భక్తితో
భూమిజ నిచ్చి రమ్మనుచుఁ బొందుగఁ జెప్పిన రావణుండు నన్
భూమిని గూలఁ దన్నె వడి భూవర నీశరణంబు చొచ్చితిన్
బ్రేమను గావు భక్తజనబృందవిచక్షణ దుష్టశిక్షణా. 209

చ. అని తను వేఁడుచున్న దనుజాధిపసోదరుఁ జూచి రాముఁ డి
ట్లను నినుఁ దన్నినట్టిచపలాత్మునిఁ జంపెద లంకకు న్నినున్
ఘనముగ రాజుఁ జేసెదను గర్బురనాయక నాదుచెంగటన్
మన మలరార నుండు మని మన్నన చేసి తదన్వితుండునై. 210

క. తమతులు భీతిలుచుండఁగ, సముదాసురనాథ విగతశంకన్ లంకన్
గమలాప్తసుతాదికపి, ప్రముఖులతోఁ జుట్టుముట్టి భంగము సేయన్. 211

తే. లగ్గ పట్టింపఁ గినుకతో లాఘవమునఁ, గోటగోడల ధరఁబడఁ గూలఁద్రోసి
వప్రముల ద్రవ్వి వాకిండ్లు క్షిప్రముగను, బెఱికి తలుపులు విఱిచిరి బెడిదపుగతి.

సీ. యంత్రంబు లగలించి తంత్రంబులను మించి ఘనవిటంకంబులఁ గలఁచి విఱిచి
వలభుల నిల రాల్చి వరకేతనంబులఁ బొడిపొడి గావించి భూరితోర
ణముల భగ్నమొనర్చి నానావిధానేకపానశాలల నేలపాలు గలిపి
సోపానఖననంబు సొంపుతో వాటించి గోపురంబులఁ ద్రోచి కొమరుమిగులు
తే. నిలయముల వ్రచ్చి గృహరాజనివహములను, గ్రొచ్చి ధనముల నచ్చట రిచ్చపఱిచి
కరులు సరసులఁ గలయించుగతిని బోలి, కలఁచి రావేళ లంకను గపులు దేవి. 213

క. లంకానాశము గన్గొని, లంకాధిపుఁ డలుకఁ బూని రయమున వారిన్
బింక మడంపఁగ నెంచి వి, శంకటగతి నాజ్ఞఁ జేయ సాహస మొప్పన్. 214

సీ. ధూమ్రాక్షరుధిరాక్షదుర్ముఖకుంభనికుంభవిరూపాక్షఘోరముఖులు
త్రిశిరనరాంతకదేవారులు ప్రహస్తముఖు లగురక్కసు ల్మోహరించి
ఖడ్గగదాశూలకార్ముకతోమర భిందివాలప్రాసభీమపరశు
పట్టసాదికరాశిఁ బట్టి మాతంగాశ్వరథములపై నెక్కి రణము చేయఁ
తే. గాంచి సుగ్రీవనలనీలగజగవాక్ష, తారతారాత్మజాంజనాతనయగంధ
మాదనసుషేణముఖగురుమర్కటాధి, నాథు లందఱు తుటుములై క్రోధ మొప్ప.

క. ఒక్కమ్మడిఁ దరుగిరులం, బెక్కులు పెకలించి తెచ్చి పృథుశక్తిమెయిన్
రక్కసులముక్కు సెక్కులు, పక్కలు డొక్కలును ద్రుళ్ళిపడఁ గొట్టి రొగిన్.

ఉ. అంతటఁ బోక వాలముల నయ్యసురావళిఁ గొంతచంపి య
త్యంతబలాఢ్యు పెంపెసఁగ హస్తపదంబులఁ దన్ని స్రుక్కగన్
బంతములోడఁ ద్రోయుచును భస్మము చేసి జయాభిరామది
గ్దంతిశిరోవిహారము నుదారయశంబును బొంది రుద్ధతిన్. 217

ఉ. ఆయెడ లక్ష్మణుండు సమరావని నయ్యతికాయుఁ గూల్చె బ
ల్సాయకపంక్తిచేత నగసన్నిభకాయుం హరీంద్రదేవతా
జేయుం నిరంతరాభినుతశీలబుధేంద్రవిధేయుం ముక్తిసం
ధేయుం విశేషమాయుం మణిదీధితిగేయుం గుణాప్రమేయునిన్. 218

తే. వాఁడిశరములఁ దద్భటవర్గములను, గజరథాశ్వంబులను నేలఁ గలిపి విజయ
శాలియై యొప్పె సౌమిత్రి సమరభూమి, లేఖు లందఱు దివినుండి లీలఁ జూడ.

శా. శ్రీరాముం డటమీఁద సంగరమునన్ జిత్రాస్త్రచక్రంబునం
దా రంజిల్లినవేడ్కఁ గూల్చె గడిమిం దత్కుంభకర్ణున్నిజో
దారారావవిశేషసంకుచిత దిగ్దంతావళోత్కర్ణుగన్
పారస్ఫారఘనాస్త్రపీడితఘనక్ష్మాపాలసంకీర్ణునిన్. 220

చ. అలయక లక్ష్మణుండు మఱి యామ్యముఖాస్త్రపరంపర ల్పయిం
బలమున నేసి చంపె మునిసంఘము మెచ్చఁగ మేఘనాదునిన్

బలరిపుగర్వపర్వతవిభగ్నవినోదుని జిత్రకార్యునిన్
విలసితనిత్యయుద్ధజయవిస్తృతభావదునిన్ రణోర్వినిన్. 221

క. పతిమృతి విని తత్సతి శ్రీ, పతి యారఘురామదివ్యపాదంబులకున్
నతినుతులం జేసి దేవా, పతిభిక్ష నొసంగి నన్నుఁ బాలింపు దయన్. 222

క. సతులకుఁ బతులే గతి గద, నతజనమందార ధీర నయగుణహారా
గతిలేనివారి కెప్పుడు, గతి నీవే కావె వేఱు గలదే చూడన్. 223

మ. పతి లేకే భువి నెట్లు నే బ్రతుకుదున్ బల్మాఱు లూహించి నా
పతి జీవింపఁగఁ జేసి ప్రోవు మనఁగన్ బద్మాక్షుఁ డావేళ ద
త్సతియిష్టంబును దీర్ప బుద్ధిఁ దలఁపన్ సామీరి తద్యత్నమున్
మతిలోఁ గన్గొని రామమూర్తి కనియె న్మంజూక్తు లొప్పారఁగన్. 224

క. దేవ సులోచనయిష్టము, గావించిన జయము రాదు కావున దీనిన్
భావంబులోన ఘనముగ, భావింపు మటన్నఁ జూచి పరమప్రీతిన్. 225

తే. అతివ యింకొకజన్మమం దతిముదంబు, నెగడ నీపతితోఁ గూడి సొగసుగుల్కఁ
బెక్కుకాలంబు సుఖమును బ్రీతి నొంద, గలవటం చని పల్కెనఁ గాంత మరలి.

క. ఏవసుధను సహగమనము, జీవేశ్వరుతోడఁ గూడి చేసెదఁ గానన్
భావంబున శంకింపక, దేవా తద్గాత్ర మిపుడు తెప్పించి దయన్. 227

క. ఇప్పింపు మనఁగ నట్లనె, యిప్పించినఁ గొనుచుఁ బురికి నేఁగి సభక్తిన్
దప్పక సహగమనము నపు, డప్పడఁతి యొనర్చి దివికి నరిగె న్వేడ్కన్. 228

క. తనవా రందఱుఁ గ్రుంగుట, విని దశకంఠుండు రోషవిహ్వలమతియై
తనమూలబలముఁ బంపఁగఁ గని రాముఁడు చాప మెత్తి కడుధీరతతోన్. 229

తే. మోహనాస్త్రంబు దగ నేసి మూలబలము, నేలపాలుగఁ గావించి నేర్పు మిగులఁ
గంటువీరె నటం చని మింట సురలు, గంటుతనమున వేఁడి రో కంబుకంఠి. 230

ఉ. మూలబలానుజన్మఘనపుత్ర సుమిత్రులచావుఁ జూచి యా
భీలవిచారమగ్నుఁడయి భీషణదృష్టులచేత రావణుం
డోలి మయప్రదీప్తవిశిఖోన్నతశక్తిని బూని తమ్మునిన్
నేలను గల్వ నెంచి వడి నేర్చిన నాతనిమీఁద వైచినన్. 231

మ. కని సౌమిత్రి విభీషణుం డిపుడు నిక్కం బీమహాశక్తిచే
తను జచ్చున్ శరణార్థి నెట్లు విడుతున్ ధర్మంబె నా కంచు నా
తని దా వెన్కకుఁ దీసి తన్ముఖుఁడు నై దర్పించి నిల్వంగ నం
తనె శూన్యకుం జనుదెంచి శక్తి వెలుచం దద్వక్షముం దూఱినన్. 232

తే. భిదురహతి నేలఁ గూలెడి పృథులపర్వతమువిధంబున లక్ష్మణుఁ డమలతనుఁడు
కూలె ధరమీఁద నదిచూచి కోసలేశుఁ, డైనరాముఁడు దుఃఖాబ్ధియందు మునిఁగె.

క. అలుఁగినట్టు లఱచుచు, నేలంబడి యేడ్వఁ జూచి నెమ్మి సుషేణుం
డేలా దుఃఖము సద్గుణ, శీలా నామాట వినుము చెప్పెద నింకన్. 234

సీ. ప్రాకృతనరురీతిఁ బలవించుచున్నావు ప్రకృతిదూరుఁడ వీవు పరమపురుష
లక్ష్మణుముఖము బ్రాణించుచున్నది కెందామరలఁబోలి యంద మగుచు
నఱచేతు లున్నవి యటు గాన జీవియై మూర్ఛ మునింగెను భూరివేగ
వంతుఁ డౌ హనుమంతుఁ బరువడి ద్రోణాద్రికిని బంపి యౌషధక్రియల నిపుడె
తే. తెచ్చునట్లుగఁ జేయుము తేజ మలర, లక్ష్మణుని జీవితునిఁ జేసి లలితకీర్తిఁ
బొందెద మహాత్మ యన విని పొంగి విభుఁడు, మనసులోపలఁ జింతించి మమతమిగుల.

తే. అంత ద్రోణాద్రియందున్న యౌషధముల, దెమ్మటంచని రాముఁడు తివిరి పంపె
భూరిగుణవంతు సాహసపూర్ణకార్య, వంతు హనుమంతు సంతతపరమశాంతు. 236

క. రామాజ్ఞఁ బూని మారుతి, వ్యోమాయనగతుఁడు నగుచు యోగ్యమునీశ
స్తోమాశ్రమంబు నొక్కటి, భూమిం బొడఁగాంచి పోయి పొలుపుగ నచటన్.

తే. రావణుఁడు పంపఁ జనుదెంచి రమ్యవనము, నొకటి గల్పించి మునివేష మొప్పు యోగ
ధారియై యున్న కృత్రిమదనుజుఁ గాల, నేమి మునిఁ గాంచి తెలియక నిమ్మతోడ.

చ. వినయము దోఁప మ్రొక్కి రఘువీరుని కార్యముఁ జేయఁ బూని యీ
విను తెఱవందు భూరితరవేగము మీఱఁగ రాఁగఁ దప్పి నా
కును భయదంబుగాఁ గలిగెఁ గూరిమి నీటిని జూపి కావు మో
మునివర యంచు వేఁడఁ గను మోడ్పటు విచ్చి స దంభయుక్తితోన్. 239

తే. వత్స నీరాక సంతయు వాస్తవముగ, దెలిసికొంటిని నే యోగదృష్టిచేత
నింక ద్రోణాద్రి కెందుకు నేఁగవలయు, నిత్తు సర్వౌషధము లేచు నిపుడె కొనుము.

ఉ. ఆఁకలి దప్పులున్ సమయు నిట్టిఫలామృతము ల్గ్రహింపు సు
శ్రీకరమూర్తి నీ విచట క్షేమముగా శయనింపు మింపుగన్
వేకువగాక మున్నె నట వేగమె పోవు మటన్న మానితో
దేకువ గల్గి యి ట్లనియెఁ దెల్లముగాఁ బవనాత్మజుం డొగిన్. 241

తే. అకట లక్ష్మణుఁ డవనిపైఁ బ్రకటమూర్ఛ, నొగి యుండఁగ నిచ్చోటఁ దుష్టి గల్గి
కుడిచి నిద్రింప నే నొల్లఁ గూర్మితోడ, జలముచూపించు త్రాగి యేఁ జనెద నిపుడు

చ. అనవుడు నాతఁ డి ట్లనియె నక్కడ నొక్కసరోవరంబు జీ
వనకరజీవనంబు నయి భాసిలుచున్నది పోయి వేడ్కతోఁ
గనులను మూసి తజ్జలము గాంచుచు గ్రోలుము పొమ్మటన్న నా
వనచరనాథుఁ డంత జలపానము చేయఁగఁ బోయి యారయెడన్. 24

క. బంధూకకుసుమచందన, మందారప్రముఖవృక్ష మహితం బగుచున్
బొందిక మల్లెలమొల్లల, నందులఁ బెంపొందినట్టి జాజులచేతన్. 24

క. పొంగుచుఁ గమలావళిపై, సంగీతము చేయుచున్న షట్పదములచే
రంగత్తరంగడోలా, సంగతసంపూర్ణపక్షిశబ్దముచేతన్. 245

తే. మఱియు విమలోదకము చేత మంజులంబు, నగుచుఁ జెన్నొందు కాసార మపుడు చేరి
దానివిభవంబునకు మెచ్చి పూని నీరుఁ, ద్రాగుచుండెను దమి దీర దానియందు.

క. చిరకాలంబుగ నుండుచు, కరికపిచరణమును బట్టి కడువడి మ్రింగెన్
గురుశాపము క్రోలుకై, కరి మ్రింగినవెలగపండు గలిగా నంతన్. 247

ఆ. మకరి మ్రింగు టెఱిఁగి మారుతి మెల్లగఁ, బట్టుపడియుఁ బొట్ట నట్టె చేరి
పేగులెల్లఁ ద్రెంచి పిడికత్తి వడిఁ జించి, ప్రాణములను బాపి ప్రౌఢశక్తి. 248

క. భానుఁడు స్వర్భానునిచే, మానుగ విడువంగఁబడిన మాడ్కిన్ వేడ్కన్
భానుప్రదీప్తి నిగుడఁగఁ, గానం బడి వెలిఁగె మకరి గర్భాగతుఁడై. 249

తే. మకరి క్రమ్మఱ నమరియై ప్రకటితముగఁ, గాలనేమిచరిత్రంబుఁ గపటవృత్తిఁ
జెప్పి వీనిని వధియించి శీఘ్రగతిని, పొమ్ము ద్రోణాద్రి కిక త్రోవ పొందుగాను.

క. అని ధాన్యమాలి పలికిన, విని ప్రేమ న్గొంతతడవు విస్మయపడుచున్
ఘనముగఁ దచ్చిత్రంబును, మనమునఁ దలపోసి నిటుల మారుతి దేవీ. 251

సీ. మోముసోమునిసాము ముద్దునవ్వులువిప్పు కప్పురంబులు మబ్బు కప్పుకొప్పు
చూపువాల్మీనుల రూపుమాపుట కోపు కన్బొమ ల్మరునిసింగాణివిండ్లు
మిన్ను చెన్నును దన్ను సన్నవినడుము ను మించులపస మించి మెఱయుమేను
మానుగుడారము ల్మానినిగుబ్బలు కంబుపోయగమును గాంచుగళము

తే. వేడ్కనీలాలరుచినవ్వు వేణివాణి, వాణిచిగురాకుచెంగావి వఱలుమోవి
గడుసురంభలసొగసు జంఘలును గలుగు, కలికి యయ్యోను మకరి నేఁ గనఁగ నిపుడు.

క. ముంజేల నీతలోదరి, యందము సెడి మకరి యయ్యె నెందుకొ దీనిన్
బొందుగ నడిగి మనోగత, సందేహముఁ బాపుకొందుఁ జక్కఁగ ననుచున్. 253

తే. తలఁచి హనుమంతుఁడా నాతిఁ దలియబోణి, మకరివై యుండి నాచేత మడిసి యిపుడు
దేవభామిని వైనట్టి తెఱఁగెఱుంగఁ, జెప్పు మనఁగను దనకథఁ జెప్పఁ దొడఁగె.

సీ. కరువలిపట్టి యే గంధర్వభామను ధాన్యమాలి యనంగఁ దనరుదాన
శంకరుఁ డోకనాఁడు సభదీరి రజతాద్రి శోభిల్లుచుండఁగ సురుచిరముగ
నేపాడి యాడి యుమేశుని మెప్పించి వరవిమానము నొంది వచ్చి యిచ్చ
గరము జలక్రీడ గావించుచుండంగ శాండిల్యుఁ డనుముని[illegible]యునకు

తే. వచ్చి ననుఁ జూచి మోహించి పంచశరుని, కేళిఁ గలయంగ గ[illegible]
తపము సెడిపోవు ననుఁ గూడఁదగదసిచంద్ర, వలదు పెరనాతిఁ బొందు [illegible]

క. అని నేఁ జెప్పినఁ గాదని, ముని ననుఁ గలయంగ రాఁగఁ బుప్పవతీత్వం
బును జెందియున్నదానను, అనఘా సుస్నాత నగుచు నంగ[illegible]

చ. నినుఁ దనియంగఁ జేసెదను నిక్కము పొమ్మని మానిఁ బంపి నే
మన మలరార నానిశిని మంజుళగానముఁ జేయుచుండఁగా
విని దశకంఠుఁ డచ్చటికి వేడ్కను వచ్చి మిటారి పొందవే
యని బలవంతపెట్టి నను సంగళకయ్యములోన ముంచినన్. 257

తే. అంత పతిశాపముఁ దనుసుతుఁ డాంజనేయ, కలిగె నాబాలు నావేళఁ గర్బురేశ్వ
రునకు నర్పించి నాల్గవదినము రాఁగ, స్నాతనై వేడ్క జడదారి సన్నిధికిని. 258

ఉ. పోయిన దివ్యదృష్టి ననుఁ బొందుగఁ జూచి లతాంగి యన్యుతోఁ
గాయజకేళి సల్పితివి కావున నీజలమందు గ్రాహివై
బాయక యుండు మంతటను బావనిచేతఁ ద్వదీయశాపముం
బాయు నటంచు నమ్మునియుఁ బల్కె చనె న్నిటనుండి నిత్యమున్. 259

క. నీరాక కెదురు చూచుచు, నీరాటమనై మహాత్మ నిలిచినదానన్
బోరాటంబున నీచే, నీరాటత్వంబు మాని నెలఁతుక నైతిన్. 260

క. అని చెప్పి వానరోత్తము, ఘనముగ దీవించి దేవకాంతయుఁ జనఁగన్
వనచరుఁ డాకుటిలపుముని, తనపిడికిటఁ బొడువ నతఁడు దర్పించి వడిన్ 261

తే. పక్షియై రాఁగఁ గని దానిపక్షములను, బట్టి త్రుంచిన నారూపుఁ బాపి కీశ
పతియుఁ నై రాఁగ జలమునఁ బవనసూతి, కొంకవడి విస్మయం బంది కోప మడర.

క. కాలం దన్ని రయంబున, వాలము మెడఁ జుట్టి త్రిప్పి వార్ధిన్ వైవన్
ఆలో నసువులు వెడలఁగఁ, గాలునిపురిఁ జేరె నంతఁ గడుఁ బూన్కి మెయిన్.

తే. వాయువేగంబుతో నంత వాతసూతి, మింట జేజేలు తను గని మెచ్చుచుండ
దుష్టదానవనివహము ల్దొట్రుపడఁగఁ, జనెను గడలను నిజకాంతి చాల నిగుడ.

సీ. ద్రోణాద్రికిని బోయి తోరపుభక్తితో నోషధులను గొన నుద్యమింప
నవి చిక్కకుండిన నప్పర్వతంబును బ్రార్థింప నక్కొండ పల్కకునికిఁ
గని వాలమున దానిఁ గ్రక్కునఁ బెకలించి శిరముపై నిడి వచ్చుసిద్ధగణముఁ
గారించి యవ్వార్ధి గడకతో నమ్మాల్యవంతునిఁ బడఁ ద్రోసి వచ్చి ద్రోణ

తే. గిరిని భువిమీఁదఁ బెట్టినఁ బొ(సర)సఁగఁ జూచి, నిండుభక్తి సుషేణుఁ డాకొండ నక్కొ
యోషధులఁ దెచ్చి తగిలింప నొసర మూర్ఛ,దేరి గూర్చుండె సౌమిత్రి దీప్తిమిగుల

క. కని రామచంద్రుఁ డనుజునిఁ, దనతోడ నిడి కౌఁగిలించి కరమిడి శిరముం
బునుకుచు నానందాంబుధి, మునిఁగెన్ సత్యాత్మశీల బుద్ధివిశాలా. 266

మ. తనవారందఱు నేలపాలగుటఁ జిత్తంబందు శోకించి పూ
నికతోఁ బుష్పక మెక్కి మింట దివిజుల్ నిర్విణ్ణులై చూడఁగా
ననికిం బోయి దశాననుండు వడిగా నారామభూపాలునిన్
ఘనరౌద్రం బగుద్వంద్వయుద్ధమున బల్గారించె నత్యుద్ధతిన్. 267

శా. ఆకాలంబున దేవతాధిపునిచే నాజ్ఞాపితుండై వడిన్
జక్కన్ మాతలియొక్క దివ్యరథమున్ సద్భక్తిమైఁ దేగఁ దెం
పెక్కన్ భూపతి యెక్కె దానిపయిఁ బ్రాక్పృథ్వీధరారోహణం
బక్కంజాప్తుఁడు చేయుచందమున నుద్యత్కాంతిభూయిష్ఠుఁడై. 268

క. నిరుపమబాహాబలిమిన్, సురవైరిని గాంచి పలికె సుర లగ్గింపన్
దురమున రావణ నిలువుము, ధర శూరుఁడవైనయెడల ధైర్యస్ఫూర్తిన్. 269

క. మారీచు నీచుఁ గనకపు, సారంగము చేసి పంపి సరగున నన్నున్
దూరస్థుని గావించి కృ, పారహితుఁడ వగుచు మానివైఖరిలోడన్. 270

ఆ. వచ్చి మోసపుచ్చి వైదేహిఁ గైకొని, వనట చెందుచుండ వడిగ లంకఁ
జేర్చినట్టిపాపచిత్తుఁడవటుగాన, దగినఫలముఁ బొందు తఱియుఁ బొసఁగె. 271

క. దండింపఁదగనివానిన్, దండించిన దండ్యు విడిచి తాల్మిగ నున్నన్
దండిగ నఘ మబ్బును భూ, మండలనాథునకుఁ జూడ మహి ననిరార్యుల్. 272

చ. మన మలరార లోకముల మాటికిమాటికి గోరి నీవు చే
సినగురుపాతకంబులకు శిక్ష విధింపఁగఁ గాలుఁ డేల నే
ఘనతరకాండకాండముల గ్రక్కున నిన్నిఁ గూల్చి భూతరా
శినిఁ గడుఁ దృప్తి నొందఁగను జేసెద ఖేచరులార్వఁ జూడుమా. 273

మ. పలుమా టిట్టని రోషభాషణముల భాషించి శీఘ్రంబుగన్
బలువింట న్గుణటంకృతుల్ నిగుడఁగా బ్రహ్మాండభేద్యంబు నా
విలయోద్ధూతధనంజయప్రతిభదుర్వీర్యాశుగం బేసె నా
బలవిద్రావణు శత్రుదారబహుగర్వస్రావణున్ రావణున్. 274

క. రాముం డేసినశరమలి, భీమంబై యురముఁ జొరఁగ వివశుం డగుచున్
భూమిం బడె దశకంఠుఁడు, భూమానందంబుతోడ బుధు లుబ్బంగన్. 275

క. దివినుండి దేవదుందుభు, లవిరళముగఁ బుష్పవృష్టి నతిమోదమునన్
బ్రవిమలముగ వర్షించిరి, రవికులుఁ డగురాముపైన రమణీయముగన్. 276

తే. రావణుఁడు రాముచేత నీరసను గూల, నాలకించి తదీయజాయాకదంబ
మపుడు కొప్పులబిగిచెడి విపులపుష్ప, హారములు భుజతలంబున నమరుచుండ. 277

క. దేవుని దూఱుచు నేటికి, నీవసుధను మాకు భోగ మిఁక దీఱెఁగదా
యేవిధమున జీవింతుము, హావల్లభ యనుచు మిగుల నార్తిం బడుచున్. 278

సీ. వదనసారసములు వాడివాతెఱ లెండ గన్నీరువరదలై కాయములను
సంపూర్ణముగ ముంప సన్ననినడుములు కుచభారముల మోసికొనఁగ లేక
తల్లడిల్లుచు నుండఁ దళ్కొత్తు రతనాలదండలు మెడనుండి దండడించి
భిన్నంబులై రాల బిగిచెడి కడువడిఁ బదములు తొట్రిలఁబడుచునుండఁ

తే. బర్యోదలు జాఱ శోకంబు ప్రజ్వరిల్ల, దిక్కులెల్లను బరికించి దిగులుపడుచు
భూరిసంతాపకరఘోరభూతనికర, సదనమునకును గంభీరకదనమునకు. 279

తే. వచ్చి తమనాథుఁ గన్గొని వసుధవ్రాలి, హా యని యటంచు నేడ్చి రాలోన దుఃఖ
పడుచు మందోదరీకాంత పతిని దైత్య, పతిని బొడఁగాంచి పైఁ బడి ప్రబలచింత.

శా. హా నాథా మును బ్రహ్మచేత వరముల్ హర్షంబుమైఁ బొంది నీ
వానందాబ్ధిని దేలి భూపతుల నుద్యచ్ఛక్తి నోడింపుచున్
నానాదిక్తతి నిండఁ గీర్తి గనుచు న్నాకస్థులం దోలుచున్
దీనత్వంబునఁ గూలినాఁడ వకటా ది క్కెవ్వరో నా కికన్. 281

క. దానవనాథకృపాకర, సూనాస్త్రుని బాధఁ జిక్కి శోభనగాత్రిన్
మానవతీమణి సీతను, మానసమునఁ గోరి తెచ్చి మడిసితి వవవిన్. 282

క. హరి యెండ గాయ బెదరుచు, హరివెన్నెల గాయ వెఱచు హరిగృహములలో
నిరతము మండఁగ భీతిలు, హరిహరివంతముల పీవ నలుకుచు నుండున్. 283

చ. దురితములం దలంపకయె తొయ్యలులం గలయంగ నెంచి సుం
దరకరరూపభామలను దత్పరతం జరియింతురింపుగన్
బరధనకాంతకాంతరతపాపమనస్కుల కెట్లిహంబునన్
బరమున దివ్యమార్గపనసౌఖ్యము వచ్చునె యెన్నదేనియున్. 284

తే. అనుచు మదిలోనఁ దలపోసి హాయటంచు, మగఁడు లేకుండ నేనెట్లుమనుదు మహిని
దైవమా యని పల్మఱు దల్లడిల్లు, చుండె నావేళ దుఃఖాబ్ధి నుక్కి చిక్కి. 285

ఉ. రాముఁడు పంపఁ గా దనుజరాజసహోదరుఁ డేఁగి రాక్షసీ
స్తోమము నూరడించి శ్రుతిచోదితమౌ పరకర్మ మన్నకుం
బీమముతోడఁ జేసి తగ నీలిసురారుల కెల్లఁ జెప్పి సు
శ్రీమహితుండు వచ్చె దన శేముషిభక్తి పెనంగ నంతటన్. 286

చ. సురుచిరలీల రాఘవుఁ డశోకవనంబునఁ జూచె దానవీ
పరుషవచోవిభీత నతిబాష్పకణాంబువివృద్ధ శింశుపా
తరుతలకాంతదాంతపరితాపపరీతకృశాంగ ధూళిధూ
సరితవిభిన్నవస్త్రయుత సత్యసమేతను సీత నయ్యెడన్. 287

చ. కనుఁగొని దుఃఖ మొంది మఱి గ్రక్కున సీతను పావకాంతరం
బునఁ జనఁ జేసి లోకములఁ బొల్పుగఁ గీర్తినిఁ జెంది దేవత
ల్పనుపఁగ గ్రమ్మరం జనక పావనపుత్రిని గొంచు భక్తితో
జనములు ప్రస్తుతింప మది సంతస మొందుచు నంత సద్దయన్. 288

మ. దనుజాధీశతఁ గల్ప జీవి వగుచున్ దధ్యంబుగా లంకయం
దనయంబు న్నివసింపు మంచు నిలిపె న్నర్థిప్రజాతోషణున్

ఘనపాపౌఘవిశోషణు న్వినుతవాక్యస్ఫూర్తిసద్భూషణుఙ్
వినయాలాపణు నవ్విభీషణుఁ గృపావిఖ్యాత విద్వేషణున్. 289

క. రామామణి పుష్పకమున, భూమిసుతం గూడి కీశపుంగవయుతుఁడై
వ్యోమచరు లెల్లఁ బుష్పస్తోమాన్వితవృష్టిఁ గురియ సురుచిరలీలన్. 290

ఆ. లంక విడిచి చనుచు లలితాంగికిని దొల్లి, తాము వచ్చినట్టి దారిఁ గోరి
ముచ్చటించి కడఁగి ముందు నందిగ్రామ,మునకు వచ్చె రామ పుంగవుండు. 291

ఉ. ఆయెడ కైకయీసుతుఁడు హర్షముతో రఘురామపాదుకల్
ఆయతభక్తిమై శిరము నందొగి దాల్చి ప్రజాళి వెంబడిన్
బాయక కొల్చి రాఁగఁ జని పావనకీర్తికి రామమూర్తికిం
గాయము సోఁక మ్రొక్కి పదకంజరజంబు ఘనంబుగాఁ బయిన్. 292

ఆ. తాల్చి తనివి లేక దత్పాదముల నక్కు, లందు మోపికొనుచు హర్షబాష్ప
జలముచేతఁ గడిగి సరసయోగక్షేమ, మరయుచుండ నంత నవనివిభుఁడు. 293

క. తన కెదురుగ నరుదెంచిన, ఘనవిప్రుల కెరఁగి మనుజగణములు తనకున్
బనిగొని చేసినమర్యాదను గొని మన్నించెవారిఁ దాల్మి స్పేర్మిన్. 294

చ. జనవర పెక్కుసాళ్లకును సత్యచరిత్రుఁడవైననిన్ను మే
మును కనులారఁ గాంచి భయముక్తులమైతి మటంచు నాట్యముల్
ఘనముగఁ జేసి చేసి సుమకాండము లెల్లను వైచివైచి యా
త్మను దగఁ బొంగి పొంగి కడుధన్యత చెందిరి పౌరులందఱున్. 295

సీ. చాపహస్తుండునై శత్రుఘ్నుఁ డరుదేర సౌమిత్రి భృత్యుఁడై సరసనడువ
జలపాత్రధారియై జనకజ రాఁగను గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ
బవనాత్మజుం డాతపత్త్రంబుఁ బట్టఁగ భరతుఁడు పాదుక ల్పట్టి నడువ
నిరుప్రక్కలను వేడ్క సినసూతి సురవైరి వింజామరంబులు వీచుచుండఁ

ఆ. పసిడిగద్దె జాంబవంతుఁడు కొని రాఁగ, దివ్యపుష్పకంబు దీప్తినెక్కి
గ్రహవితానమిళిత కమనీయసంపూర్ణ, చంద్రుమాడ్కి రామచంద్రుఁ డొప్పె.

క. జను లందఱు దన్గొని, మనముల నుప్పొంగుచుండ మహితద్యుతితో
దను జేరె సంతసంబున, జననాథారాధ్యవిబుధ సాధ్య నయోధ్యన్. 297

ఉ. అంతకు మున్నె తత్పురమునందలివీథులు చక్కఁజేసి బల్
సంతస మొప్పఁ దోయములు జల్లి యనంటుల నిల్పి జంటగన్
జెంతనె తోరణంబులను జెన్నలరారఁగ గట్టి వేదిక
ల్వింత దలిర్పఁగా నలికి వేడ్కను ముగులు దీర్చి గోడలన్. 298

తే. రామగాథల వ్రాయించి రమ్యవప్ర, నిర్జరాగారగోపుర నికరములను
గనకకలశంబు లెత్తించి కౌతుకమున, జనులు కైచేసి తూర్యఘోషములు చెలఁగ.

క. ఢక్కాదివాద్యరవములు, దిక్కుల నిండార రామదేవుని జూడన్
మక్కువ నెదురుగ వచ్చిరి, చక్కనిమాస్వామి యనుచు సాంద్రప్రీతిన్. 300

క. తతవారణమదజలమున, సతతము దడుపంగఁబడిన సరణులచేతన్
బలి రాఁగని మలి గఱగెడి, నలిగలి నప్పురవరంబు చతురతఁ బరగెన్. 301

మ. జనగాథాగ్రణిరాక తూర్యములతో సద్గాననాట్యాళితో
ఘనదంతావళవీతిసైన్యతతితోఁ గళ్యాణభూయిష్ఠమై
యొనరెం బత్తన మత్తఱి న్ఘనఁగ నత్యుత్కంఠతం జంద్రరా
కను ఘూర్ణిల్లెడి సాగరంబుపగిది న్గంభీరభంగాత్తమై. 302

క. ఏతాదృశమగుపురమున, భూతలనాథుండు రామపుంగవుఁ డరుగం
జేతఃప్రీతిని జనసం, ఘాతము తలపోయఁ దొడఁగెఁ గడువిస్మయతన్. 303

క. శ్రీరాముఁ డీనృపాలుఁడు, ధారుణి నీసీతకొఱకు దశకంఠు ననిన్
ఘోరాస్త్రంబులఁ గూల్చిన, సారసబలుఁ డితఁడు సత్యసంధుం డరయన్. 304

ఉ. అల్లతఁ డంజనీసుతుఁ డహార్యబలుం డతఁ డంగదుండు భూ
వల్లభు పార్శ్వభాగమున భాసిలుచుండినవాఁడు లక్ష్మణుం
డల్లతఁ డాహరీశ్వరుఁ డటంచని మేడలమీఁద నుండి సం
ఫుల్లసరోజనేత్ర లిటు పొందుగఁ బల్కిరి మానినీమణీ. 305

తే. జనము లీమాడ్కి దనుఁ జూచి సంభ్రమింప, శచిని గూడినపాకశాసనునిరీతి
సారవీక్షణ యగుభూమిజాతఁ గూడి, రాజమార్గంబునను బోయి రమణ ముందు.

సీ. బంగారుగోడలు రంగారుమేడలు పవడపువాకిండ్లపంక్తి గలిగి
కాంతరత్నస్తంభ కలితగోపురలస త్ప్రాసాదములచేతఁ బ్రజ్వరిల్లి
బహుతరధూపదీపంబుల వాసిల్లి పుష్పదామములచేఁ బొలుపు మిగిలి
పగడలగొడుగుల బద్ధచేలంబుల గురుతోరణంబులఁ గూర్మిఁ జెలఁగి
తే. విబుధులను బోలిసంపూర్ణ విభవములను, మెరయుచుండినసెలతుక ల్మేటిపురుష
లొప్ప ధనరాసు లింతని చెప్పరాని, రాజసౌధంబునకు వచ్చె రామవిభుఁడు. 307

క. ఇక్కైకపడి వారికులజుఁడు, చక్కనితనయిల్లు చొచ్చి సంభ్రమ మొప్పన్
మక్కువతో దను దల్లుల, కక్కజముగ మ్రొక్కి తల్లి కలిభక్తిమెయిన్. 308

ఉ. ఉల్లముపల్లవింప వినయోన్నతి మ్రొక్కి నుతించి వేడ్కన
ల్లల్లన గోవిదాళికిని హర్షముతో నతు లాచరించి సం
ఫుల్లమనస్కుఁడై కవులఁ బుణ్యుల నేలి కృపారసంబు రం
జిల్లఁగ మంత్రిమిత్రులను శీఘ్రమె మన్నన చేసెఁ బ్రేమతోన్. 309

ఆ. అట్టితరుణమందు నాత్మజులును బెద్ద, కోడ లేగుదెంచి కోర్కి మ్రొక్కఁ
జూచి లేవ నెత్తి సురుచిరముగఁ జేతు, లను శరీరములను లలిని దడవి. 310

క. మోములఁ దలలన్ బోరనఁ, బ్రేమ న్మద్దాడి మందమంజులవాసో
ద్ధామతఁ దొడపై నిడికొని, భూమానందాశ్రుజలము పొంగుచు వెలయన్. 311

తే. పైన విడుచుచుఁ బోయిన ప్రాణములును, మఱల వచ్చెఁగదా యని మదిఁ దలంచి
పొంగుచుండెను తన్మాతృపుంజమంత, జిరతపోధనుఁ డైనవసిష్ఠుఁ డెలమి. 312

క. రామునిజడల న్విడువం, గా మమతం జేసి వృద్ధగణసహితుండై
నీమమున గురుఁడు జిష్ణుని, బ్రేమను సుస్నాతుఁ జేయుం రీతిం దోఁపన్. 313

తే. పుష్కరథినిమ్నగాదివ్యపుష్కరాభి, షేక మొనరించె నావేళ సీతఁ గూడి
మంగళస్నాతుఁ డై వేడ్క మంజువసన, గంధపుష్పాళిభూషణకలితుఁ డగుచు. 314

క. కనకపుసింహాసనమున, నినకులుఁ డగురామచంద్రుఁ డింపు దలిర్పన్
ఘనతం గూర్చొని రాజ్యం, బును భరతుం డొసఁగ నేలె భూపతు లెన్నన్. 315

చ. నిరతము దల్లికిం బ్రియము నేర్పునఁ జేయుచుఁ దమ్ముల న్మహీ
వరులను దీనవర్గములఁ బౌరజనంబుల మంత్రులం గళా
భరణుల మిత్రవర్గముల బంధుల నొక్కటిగాఁగఁ జూచుచున్
గరుణ దలిర్ప నీతిలెని గౌతుకమొప్పఁగ నేలె భామినీ. 316

శా. కల్లోలత్వము మానె గంధులకు నాకస్థానవాసాళికిన్
గల్లోలత్వము మానెఁ గాశ్యపికిఁ జక్కన్ మానెఁ జాంచల్యమున్
ముల్లోకంబులవారికెల్ల భయము న్ముఖ్యంబుగా మానెఁ బ
ల్సల్లాపంబులు మానె శత్రుతతికిన్ క్ష్మాపాలురాజ్యంబునన్. 317

సీ. రామాలకలయంద రమ్యవక్రత్వంబు చానలనడకల జడిమగరిమ
పూఁబోండ్లపరిరంభములయంద పీడన మతివలపాలిండ్ల యంద పెంపు
నన్నులవాల్చూపులంద చంచలతయుఁ లేమలనడుముల లేమిబలిమి
భామినీరతులంద బంధురబంధంబు మానినీమణులంద మాయ లెల్లఁ

తే. బతులు రతులకు నిజసతీ తతులపైటఁ, బట్టుటంద క్రమంబు భూపాలుఁ డైన
రామురాజ్యంబులోపలరమణ వెలయుఁ, గానిమఱి వేఱుకొఱతయుఁగానరాదు. 318

క. జనకునివలె జగదీశుఁడు, జనకుల మఱపించి ప్రజల జక్కఁగ నేలన్
జనకుల నెల్ల న్మఱచిరి, జనకుం డారాముఁ డనుచు సాంద్రపుభక్తిన్. 319

మ. మఱియున్ రామనృపాలమౌళి ప్రజల న్మర్యాదతో నిత్యమున్
వెఱవుం బాపి సమస్తదేవమునుల న్విఖ్యాతచారిత్రుల
న్నఱవున్ బాయక ప్రోచి భూవనిత కత్యుద్దామభూషాకృతిన్
వఱలెం గన్నుల కింపు సొంపు చెలఁగ న్వందారుమందారుఁ డై. 320

తే. పులులు ధేనువు లొకచోటఁ బుష్కరముల, ద్రావితిరుగుచుఁ బవళించి తాల్మిఁగూడి
పవలు రాత్రులు వైరలవంబు గాని, లేక రాజిల్లుచుండెను లీల మెఱసి. 321

క. ఎలుకలు పిల్లులు మైత్రిన్, జలపానాహారయోగ్య సంచారములన్
విలసితభావస్ఫూర్తిన్ విలసిల్లెను రాముఁ డేలు విపులం గ్రీడన్. 322

చ. సెలకును మూఁడువర్షములు సిక్కముగాఁ గురియంగ సస్యసం
కలితయునై ధరిత్రి ఘనకాంతినిఁ జెన్నలరారి సొంపుతో
లలితమహావిభూతి శుభలక్షణశోభితదిగ్వితానయై
పొలిచెను సర్వమానవులు పొంగుచునుండఁగ నెల్లభంగులన్. 323

ఉ. జారవిచారపాపకరసంగతి ఘోరభయాళి వేదనా
చారులు లేరు నిర్ధనులు చంచలచిత్తులు దుష్టవర్తుల్
పోరెడివారు లేరు మఱి బూటకము న్విరసంబు చౌర్యమున్
గోరిన గానరాదు రఘుకుంజరుఁ డేలెడిరాజ్యమం దొగిన్. 324

క. అంగవిహీనులు గాకే, శృంగారతనూవిలాస శోభితులగుచున్
అంగజుఁ బోలిజనంబులు, పొంగుచు నుందు రలరామపురిలోఁ జూడన్. 325

క. రాజర్షిచరిత్రుండును, తేజోవిలసితుఁడు సర్వ దిగ్భాసురవి
భ్రాజితకీర్తియుం విద్య, త్యాజితసత్యాదిధర్మపూర్ణుఁడు మఱియున్. 326

తే. ఏకపత్నీవ్రతుండు బుధేంద్రరతుఁడు, నిత్యనిజధర్మనిరతుండు సత్యవాది
సర్వజనసమ్మతుండు విశాలబుద్ధి, గురుఁడు నౌ రామభూపాలకుంజరుండు. 327

మ. తనరాజ్యంబున నున్నధర్మపరులం దండించి ధర్మోన్నతిం
దనరం జేయుచు భక్తలోలుఁ డగుచున్ దర్పించి శత్రున్నతిన్
మనుమాంధాతృభగీరథాదినృపుల న్మర్యాదచే మీఱుచున్
ఘనుఁడై సర్వనృపాలమౌళిమణియై కారుణ్యచిత్తంబునన్. 328

క. అగణితముగఁ గృతయుగమున, నెగడెడిధర్మంబు వేడ్క నెగడం ద్రేతా
యుగమున నడుపం జేసెను, జగధీశులు మెచ్చుచుండ జగధీశ్వరుఁడున్. 329

తే. బాలమరణాద్యరిష్టముల్ ప్రజలకెపుడు, కలుగకుండంగ రాజ్యంబు గాంచుఁ బ్రోచె
సీతసుగుణాళిచేత నిజేశుమనము, వశముఁ గావించుకొనియెను బరమసాధ్వి. 330

క. అని శంకరుండు పలికిన, విని పార్వతి ముదము చెంది విభుఁ గనిలీలన్
వినయంబుఁ దోపఁ గ్రమ్మఱ, జనపతి యైనట్టిరామచంద్రుఁడు పిదపన్. 331

తే. ఏమిగావించెనంతయుం నిద్ధచరిత, శ్రోత్రపాత్రంబుగా నాకు సురుచిరముగఁ
జెప్పుమనఁ బార్వతినిఁ జూచి శివుఁడు పల్కె, రాముమదిలోనఁ దలఁచుచు రమ్యఫణితి.

క. నిరతము పురజను లందఱుఁ, గరుణాకరదుష్టదనుజగణదూర మమున్
గరుణించి ప్రోవవే యని, కరమనురాగమున వేఁడఁ గని కౌతుకియై. 333

ఉ. చిత్తములందు నిత్యమును జేరి రమింపుచుఁ జిత్రమూర్తియై
యుత్తమమార్గసంభృతుల సొక్కుగఁ జేయుచు వారిఁగూడి మి

త్రోత్తముఁ డంగిదోఁచి వినయోజ్జ్వలశక్తినుదాత్తవిభ్రమా
యత్తసమస్తభూతచయ హర్షదుఁడై తనరారెఁ జేర్మితోన్. 334

క. మునిసోదరరాజన్యులు, తనమంత్రులుఁ గొల్వ సీతఁ దగఁ గూడి శచీ
వనితం గూడినహరివలె, నినకులుఁ డొప్పారుచుండె నిభవిభుగమనా. 335

ఉ. ఈమహిఁ జాలకాలమిటు లింపుగ రాజ్యము నేల వేడ్కతో
రాముఁడు సారసేక్షణుఁడు రావణహంత తురంగమేధమున్
దా మధుమాసవేళ నిజధర్మసతీమణిఁ గూడి చేయఁగా
భామిని నిశ్చయించె జనవర్గము లొననియొంచి చూడఁగన్. 336

## శ్రీరాములు అశ్వమేధహయమువెంట భరతుని పంపుట

క. అంతట సైంధవరాజము, సంతసమునఁ బూజ చేసి శత్రుఘ్నబలా
త్యంతగుణోత్తరయాజక, సంతతితో భరతు ననిపె సైంధవసరణిన్. 337

క. భరతుఁడు భ్రాతృయుతుండై, తురగము వెనువెంట నంటి దోర్బల మొప్పన్
భరబహుజనపదములఁ దా, దిరిగియుం భయ మేమి లేక తెంపున మఱియున్. 338

సీ. సౌరాష్ట్రకేకయ సౌవీరకాళింగ బాహ్లీకకోసల పాండ్యచోళ
మత్స్యసింధుపుళింద మాగధకొంకణ పతులు పాశ్చాత్యులు పరమకీర్తు
లుత్తరీయులు లుర్వి నుండినవా రెల్లఁ బఱతెంచి ముఖదివ్య పత్రలేఖ
మును గలదాని కాంచనమయముఖరామ సవనాశ్వమును జూచి సరసఁ జేరి
తే. పద్మనేత్రుఁడు సాకేతపాలకుండు, విపులశౌర్యుఁడు రాముఁడు వీరియాగ
మిపుడు కావించుచున్నాఁడుహితులఁగూడి, సరయువునకుత్తరంబగుధరణియందు.

మ. క్రతుదీక్షాపరవీరవర్యుఁ డగు నా రామావనీనాథుచేఁ
గ్రతుసంబంధినిపీతి నియ్యోడను వేడ్కన్ సంచరింపంగ నీ
క్షితిలోఁ బంపఁ బడె న్మహాబలులు వాజిం దీని స్వేచ్ఛానుగా
లతఁ బోవంగను బట్టఁగల్గినయెడన్ లావొప్పఁగాఁ బట్టుఁడీ. 340

మ. అని సౌవర్ణము రామణీయకము నా నాపత్రమం దీక్రియన్
ఘనతం వ్రాసినదానిఁ గాంచి నృపతు ల్కంపంబులో నయ్యెడన్
వినయం బొప్పఁగ మ్రొక్కి భక్తిపరులై విశ్వైకుదీయశ్వమం
చని దా మెచ్చుచుఁ బోయి రంత భరతుం డావేళ నుల్లాసియై. 341

క. తురగమును భూమి ద్రిప్పుచుఁ, బరిపాలించుచును భ్రాతృపరివృతుఁ డగుచున్
గురుసేనఁ గూడి దివ్య, ద్వరసింధుతటంబు గాంచెఁ బరమప్రీతిన్. 342

క. అచ్చట దివ్యవియచ్చరు, లిచ్చ మెయిం దిరుగుచోటు లింపైతనరన్
ముచ్చట లూరెడితావుల, నచ్చుపడం జేజరిల్లు నదియై మఱియున్. 343

క. మందారవకుళపాటల, సుందరపున్నాగసాల సురుచిరబదరీ
చందనముఖవృక్షంబుల, నందంబై సొంపు నొందునదియై మఱియున్. 344

ఆ. శీతలాంబువులను జెన్నొంది మనసున, కింపుసొంపు పెంపు నింపుచున్న
సంపదలను గల్గి చారులక్షణరీతి, భాసమాన మగుచుఁ బరమకాంతి. 345

సీ. మల్లెలు మొదలైనమంచిపువ్వులలోని తావులతావులఁ దమిని జొచ్చి
భావరంజనముగఁ బయ్యర వీవంగఁ జిలుకలు సొబగుగఁ బలుకుచుండఁ
జిగురుటాకులఁ దిని పొగరెక్కి పికతతు ల్కొమ్మలపై నుండి కూర్మిఁ బలుకఁ
బూఁదేనియల నాని పుష్పాస్త్రునకు విలు నారిరీతిని బూని బాఱుదీరి

తే. రొదలుచేసెడి తుమ్మెదకొదమ లొప్ప, చుండునదియును గలువలయువిదగుట్టు
బట్టబయలుగఁ జేయుచు బహుళకాంతి, గలిగి చెన్నొందు నదియుం బైక్రాలి మఱియు.

తే. కమలకల్హారహల్లకకైరవాండ, జాళికచ్ఛపరాజితమై మనోజ్ఞ
విమలపద్మాకరసంజాతవీచిపఙ్క్తి, తరళరవయుతసాగర తటముఁ జేరి. 347

క. మనమున సంతోషించుచు, నినకులుఁ డగుభరతుఁ డంతనింపుగ పీసా
జనములతో నివసించెను, వినుతగుణోపేతలోకవిశ్రుతచరితా. 348

## సూర్యాస్తమయసూర్యోదయవర్ణనము

చ. ఇనకులజాతుఁ డైనభరతప్రభుఁ డధ్వరవీతియుక్తుఁ డై
జనపదపర్వతోన్నతవిశాలమహావలయంబుఁ జుట్టి బా
ధనుఁబడె దాని నీగు నిటఁ దాల్మి నటంచని యెంచి భానుఁ డో
య్యనఁ జరమాద్రిఁ జేరఁ జనె నంచితసత్కృపమించఁ జెచ్చెఱన్. 349

తే. కోడెవాఁ డైనరేవెల్గుఁగూడి మిన్ను, సిరివసంబున మఁదుకనిఁ జేర రోసి
పాసి హరి నటు ద్రోసినభంగిఁ జదలు, మానికము పశ్చిమాంబుధిలోని కరిగె. 350

సీ. కాశ్మీరకమలావికాసంబు సిరసించి బంధూకసుమరుచిఁ బరిహసించి
సిందూరవిఖ్యాతి శిథిలంబుఁ గావించి కంకేళిసౌభాగ్యగరిమ మించి
పగడంపుకాంతిని నెగడకుండఁగఁ జేసి మాణిక్యసుందర మహిమ నడఁచి
దాడిమపూవన్నె తక్కువఁగఁ జేసి, కింశుకసుమకాంతి గేలిఁ జేసి

తే. రక్తకమలారుణచ్ఛాయరమ్యపల్ల, వాళి దమిభేద మొనరింపఁ జాలగల్గు
సంజకెంజాయమంజుళసరణి మెఱసి, యంతఁ బొడసూపె దిక్కుల వింతదోఁప.

క. ఎల్లకడలందు భూభృ, ద్వల్లభువిజయాతిశయము వాసించుటకై
చల్లినకస్తురి యనఁగాఁ, గొల్లగఁ జీఁకట్లు క్రమ్మెఁ గుంభినిపైనన్. 352

ఉ. శ్రీరఘురామపాదములు చిత్తములన్ సతతంబు శ్రద్ధతో
పారకపారకం దలఁచుసజ్జనకోటుల పాపసంఘ మా
ధీరులఁ బాసి భీతిలుచు దిక్కుల కేఁగుచున్నవో యనం
గా రహిఁ జిమ్మచీఁకటులు క్రమ్మెను శ్యామలతావిజృంభతన్. 353

క. మకరాళిమీనయుక్తమై, ప్రకటితహారికీర్తివనధిభవసీకరపే
టికల తెఱంగున మింట, న్నకళంకము గాఁగఁ జుక్క లంతటఁ బొడమెన్. 354

ఆ. వైరి మీఱుమాఱు వలరాజుమామ వే, వచ్చుఁ దమ్ములార బాలకులను
జేకొనుం డటంచుఁ జెప్పి చీఁకటిఁ దాచు, నట్లు దేంట్లు దాఁగె నబ్జతతుల. 355

క. దర్పకమాతులపరిసర, సప్రిశఘృణినిచయమిళితసర్వాశంబై
దర్పించి భూనభంబులు, కర్పూరపుఁగ్రోవిభంగిఁ గన్పడె నంతన్. 356

సీ. ప్రాగ్భామినీఫాలభాగంబునరహించు ఘనసారమయచిత్రకం బనంగఁ
గగనేందిరాబలాకమ్రహస్తన్యస్త కమనీయపుండరీకం బనంగఁ
గాలమృగయుం డంధకారమృగంబును గడతేర్పఁబూనిన కత్తి యనఁగ
మరుదంగనామణిమణిమయహారస్థ లాలితముక్తాఫలం బనంగఁ

ఆ. దొవలు సంతసిల్లఁ దోయధి రంజిల్లఁ, జోరసంఘ మేగ శోభ రాఁగఁ
బొడిచె శీతకరుఁడు పూర్ణభావానంద, కరుఁడు తిమిరహారుఁడు కాంతికరుఁడు. 357

ఆ. ఇట్లు తమ్మిదాయ హితవుగవచ్చిన, సాంద్రచంద్రకళలు సరసమగుచు
గడలి నెడములేక గడువడి వాటిల్లెఁ, గడఁక భీతినొందెఁ గామిజనము. 358

క. హారగిరివరసురతరుసుర, కరిసురభిసురాళిఫేనకాశఫణీశా
మరవాహినీసుధానిధి, పరకాంతిని బాఱెఁ దోలె వడి వెన్నెలయున్. 359

సీ. బ్రహ్మాండదివ్యకరండంబు సౌధలిప్తం బగురీతిఁగఁ బ్రజ్వరిల్లు
కాశ్యపిమౌక్తికగణరంగవల్లికల్ గైచేసినట్టుల గ్రహసమేత
గగనభాగముపాలగారఁజేసినరీతి సర్వేశుఁడౌ రామచంద్రు కీర్తి
చంద్రికయై భువిచనుదెంచె ననురీతిఁ గౌముది దిశలెల్లఁ గ్రమ్మిచెలఁగి

తే. కమలపంక్తులఁ గారించి కరుణమించి, కోకనదముల రంజించి కూర్మి నొంచి
విరహిజనములఁగారించి వేడ్కఁబొంచి, వెల్లివిరిసెను జగములఁగొల్లగొనుచు. 360

తే. అట్టియెడఁ గైకతనుజాతుఁ డామనోజ్ఞ, సాంద్రచంద్రిక నొకచోటసౌఖ్యశయన
మున వసించి మనంబున ముదమునొంది,నిద్దురను జెందె స్మృతిబాధనీఁగఁదలఁచి. 361

క. మునులారా వినుఁ డయ్యెడ, ఘనబలుఁడు సహస్రశిరుఁడు కశ్యపసూనుం
డనుదనుజాధిపుఁ డవనిన్, మనమలరఁగఁ దిరుగనొంచి మహితోత్సుకుఁడై. 362

చ. వినయవివేకశీలనయవిద్దలఁ బెద్దయు నైనలోహితా
శ్వుని దనమంత్రిఁగూడుకొని క్షోణితలంబున సంచరించుచున్
జని వరసింధుతీరమున క్ష్మాతలనాథునియజ్ఞవాజినిన్
గని వెసదానిఁజేరి ముఖకాంచనపట్టమునుం బఠించుచున్. 363

తే. పూర్వవృత్తాంతమంతయుం బుద్ధి నెఱిఁగి,దాయ నై వైరముం బూని దశరథేశు
పట్టిలోఁ బోరి దురమున నట్టె త్రుళ్లి, పరమసుఖ మేను జెందెదఁ బరఁగుపదవి. 364

క. అని మనమునఁ దలపోయుచుఁ, దనభృత్యుని లోహితాక్షుఁ దద్దయుఁ గని వే
చని యలరామాశ్వంబును,గొని రా నీనేర్పుఁజూపి గొబ్బునఁ బురికిన్. 365

చ. అని దృఢచిత్తుఁడై పలికి యయ్యసురేంద్రుఁడు పోవ నంతటన్
దనుజుఁడు పోయి రాఘవునితమ్మునివాహము దద్బలౌఘముల్
గని నిశి మాయ నందరిని గప్పి తురంగపృష్ఠభాగమం
దును దిలకంబు పెట్టి కడుతోరపుయుక్తిచెలంగ నంతటన్. 366

తే. మత్తచూర్ణంబుఁబైఁ జల్లి మనసులోనఁ, గార్యమంతయు నెరవేరె గద యటంచుఁ
దలఁచి పవనాశ్వముఁ గొని ధైర్యమొప్పఁ, జిత్రవతి కేగె దనుజుఁడు శీఘ్రగతిని.

క. చని దశశతకంధరునకు, వినయంబున మ్రొక్కి రామవిభుపవనాశ్వం
బును భక్తితోడ నిచ్చెను, దనుమన్ననచేయుచుండఁ దరుణేందుముఖీ. 368

క. తురగమును వెదుకఁబోయెడి, భరతునికిం దెలివుఁజూపవలె నని దివిజుల్
కరుణన్ సురదిశనిల్పిన, సురదీపం బనఁగ వేగుఁజుక్క జనించెన్. 369

ఆ. నిగ్గువెన్నెల మాసెను నిఖిలదిశలఁ, జెఱకువిల్కానిబాధయుఁ జెడెనుగొంత
గాములన్నియుఁమాసెను గళదొరంగి,రాత్రి యేగెడి వేళయుఁ రాఁగఁజూచి. 370

తే. చరమవృద్ధాంగనారతిఁ జాలరోసి, ప్రాక్సతిం గూడ నెస నెంచి ప్రబలరాగ
మొదవఁజనె నన నస్తాద్రి కొనర నేగెఁ,గమ్మవిలుకానిమామ సత్కాంతిసీమ. 371

మ. వినతాపుత్త్రమృగేంద్రతీక్ష్ణనఖసంభిన్నాంధకారోజ్వల
ద్ఘనదంతావళకుంభకూటగళితోద్యద్రక్తముక్తాఫలీ
వనరాజిక్రియఁ దూర్పుదిక్కున పెస న్భాసిల్లెఁ గెంజాయతో
వినువీథిస్థితతారకాగణములు న్వేగంబె నావేకువన్. 372

చ. తెలతెలవాఱె దీపతతిదీప్తితొలంగె మరుత్కిశోరము
ల్మెలమెలవీచె నింపుగను మింటను దారలకాంతిమాసె ప
క్షులరవ మింపుగాఁ జెలఁగెఁ 'గొక్కొరొకో' యని కూయుకుక్కుటం
బులరొద నిండెఁ దమ్ములు ప్రమోదముతో వికసించె నాయెడన్. 373

క. చరమాశాంగన వేడుకఁ,గరమనురాగమునఁ దాను గైసేయుచు ముం
దర నిడికొను ముకురంబను,కరణిన్ రవిమండలంబు గానం బడియెన్. 374

తే. విలసదుదయాద్రిపంకజవిహితరమ్య,కిరణగణరాగసంపూర్ణభరిత మగుచు
వనజగర్భాండమంతయుం బశ్నకెక్కె,కుంకుమోదకముం గల్గు క్రోవిభంగి. 375

క. జన్నపుజక్కిని దనుజుఁడు,తిన్నగఁ గొని దాచ వానిఁ దెగటార్పుట కై
పన్నినదచ్ఛరశిఖి యన,వెన్నునివలకన్ను పొడిచె వేగమెకాంతన్. 376

క. కరుణావరుణాలయుఁ డో,భరతుఁడు విమలప్రభాత్రభాసురవేళన్
పొలిది స్మేల్కొని దగ్గరఁ,దురగము గానకయె చింత దొడరఁగ నంతన్. 377

## భరతుఁడు తురగము వెదకి గానక నింద్రుసన్నిధికి సలేఖ్యబాణము నేయుట.

క. పోరిఁబోరిఁబొక్కుచు దిక్కులఁ, బరికింపుచు 'హా' యటంచు భ్రాంతియుతుం డై
గురుసేనఁగూడి ఘోటకవరము వెదుకంగఁ గోరి వారనిధిలెన్. 378

సీ. మాగధపాంచాలమత్స్యసౌరటలాట బాహ్లీకకొంకణబర్బరాంగ
వంగకళింగాదిబహుదేశముల నెల్ల హరిదంతరంబుల నరసి వింధ్య
మందరనిషధహిమాలయపారియాత్రామలహేమకూటాద్రు లెల్ల
వెదకి వాజిని గాన కెదలోనఁ జింతించి వడి నొక్కలిఖితంబు వ్రాసి శస్త్ర

ఆ. మందు బంధించి మనమున నాగ్రహించి, వింట నద్దాని సంధించి విపులశక్తిఁ
జూపి దేవత లందఱు చోద్యపడఁగ, నింద్రుసన్నిధిఁ జేరఁగ నేసె నంత. 379

తే. హరి సలేఖ్యంబుదీప్తంబునైనశరము,నపుడు పొడఁగాంచి భయయుతుఁడగుచుగురుని
చేత నద్దాని జదివించి చిత్రమొంది, గొంతవడి నిట్లు చింతించె మంతనమున. 380

క. హరి సజ్జనపోషణకై, ధర నరుఁడై పుట్టి దుష్టదనుజుల నెల్లన్
దురమునఁ గూల్చి జనాళికి, నిరతము సుఖమొసగుచుండ నే నాహరికిన్. 381

ఉ. ఎందుకు గీడొనర్తుఁ బ్రతిపక్షునివాజిని దస్కరించి యే
నెందుకుఁ దెత్తు నిచ్చటికి నీపని నెందుకు చేయఁ జూచెదన్
సందియ మింకఁ దోఁచె బుధసంఘము లేమనియెంతురో కదా
కొందలపాటు నాకొదవెఁ గుంభినిలోపల నెంచిచూడఁగన్. 382

చ. దనుజులు పెక్కుమాయుల నుదగ్రతనైకొని మాపురంబులన్
ఘనవిశఁ జొచ్చి లేమలను గ్రక్కున బల్మిగ్రహించి తెచ్చి వా
రిని నలయించి మానుల నరేశుల మమ్మునుగాసి పెట్టగాఁ
గని కృపతోడ నారిపులఁ గాశ్యపిఁ గూల్పఁగ వచ్చె నీక్రియన్. 383

క. తురగాపహారి హరి యని, ధరణీశునికాత్మఁ దోఁచెఁ దథ్యముగాఁగన్
హరిహరి నే నీసంగతి, నెఱుగను సర్వేశుతోడె నిపుడె జవమునన్. 384

క. తురగము పోయిన తెఱఁగును, భరతునకుం జెప్ప పురికి వచ్చెద ననుచున్
గురుసురనికరయుతుండై, పురుహూతుఁడు సింధుతీరభూమికి వచ్చెన్. 385

ఆ. వచ్చి సింధుతీరవాసుని సాదరా, భరతుఁ జేరి వినయభరితచిత్తుఁ
డగుచు నతనితోడ నందఱు వినుచుండ, గురుని గూడి పలికెఁ గూర్మిమిగుల. 386

క. భాసురరవికులతిలకా, నీసవనాశ్వంబు నెఱుఁగ నిక్కము నాపై
రోసమున మేటికోలన్, వ్రేసితి వీ వెందు కొఱకొ వెట్టిసె చెపుమా. 387

ఉ. నాపురి లేదు నీహయము నమ్ము నిజమ్ముగమాటసుమ్మికన్
పాపిసె యాగకార్య మిటుభంగము చేయఁగ నిచ్ఛగింతునే

కోపముచేయ నేల యడికూడదు నాయెడ మిత్రభావముం
జూపుము సత్కృపారసము శోభిలఁ జేయుము కీర్తిచేకురన్. 388

### బృహస్పతి భరతునకు సవనాశ్వము తెఱఁ గెరిగించుట

క. అని శత్రుఁ డాడుచుండఁగ, ఘనుఁ డాంగీరసుఁడు ముందుగను నిల్చి ముదం
బున రాఘవాశ్వగతి నే, వినిపించెద వినుము దాని విశదముగాఁగన్. 389

క. మానుగఁ గశ్యపదితులకు, సూనుం డై పుట్టితొల్లి శ్రుతయశుఁ డనుచుం
దానవుఁడు సహస్రకంఠుఁడు, భానునిభా లోకములను బ్రస్తుతి కెక్కెన్. 390

క. అనరభోజనుఁ డుడుగక, మానవసురకోటిబెదర మహితోగ్రముగం
గాననసీమ దపంబును, బూనికతోఁ జేసి బ్రహ్మముదితుని జేసెన్.

తే. పిదప దుగినునిచేతను బెక్కువరము, లక్కజంబుగఁ బొంది పెంపెక్కుసకల
జగములెల్లను బెగడొంద సంతసమున, వచ్చె నిజరాష్ట్రమునకును వారిజాక్ష. 392

సీ. శుద్ధాబ్ధిపరిఘసంశోభితం బగుదాని కైత్యకూటాగ్రవిశాలరశ్మ
భాసురాట్టాళిందభర్మగోపురసప్తవప్రసంతతులచేఁ బ్రబలుదాని
వరుసముప్పదిరెండు వాకిండ్లు గలదాని హస్త్యశ్వరథపూర్ణ మైనదాని
దుర్గత్రయంబుచే దుస్సాధ్య మగుదాని విబుధదుర్గమము నై వెలయుదాని
తే. పుష్కరద్వీపమం దొగిఁ బొరలుదాని, దైత్యగణసేవితంబు నై తనరుచిత్ర
వలియనెడి దివ్యపురి నేలువైభవమున, నాదిలిసుతుండు శౌర్యసాహసయుతుండు.

క. దేవత లెల్లను దనుగని, భావంబునఁ దల్లడిల్ల బాహాబలిమిం
భూవల్లభాదిప్రజలను, గావరమున బాధపెట్టి కౌతుకమొప్పన్. 394

శా. సారోదారవిశారదా విను మహాసత్వుండు దైత్యేశుఁ డా
ధీరుం డియ్యెడ భూమిగ్రమ్మరుచు నీతీరస్థమా వాజినిం
గారుణ్యంబును లేక తెమ్మనుచు వీకం దూతతోఁ జెప్పి వే
క్రూరుం డేగె నిజాభిరామపురికిం గోప్యార్థసంవేది యై. 395

తే. భృత్యుఁ డటుమీరు నిద్రింప నెసఁగుశక్తి, మత్తచూర్ణంబుఁ బైఁ జల్లి మాయచేసి
సవనతురగంబుఁ గైకొని చనియెఁ బురికి, నచట నున్నది నిజముగ నశ్వ మిపుడు.

క. అనవిని రాఘవుఁ డేసెటు, చనగలనో యతనిఁ జంపి జక్కఁగ హయముం
గొని యే తెఱఁగునరాఁ గల, ననిపలుకఁగ నతనిమాట నాలించి తగన్. 397

క. సురగురుఁడు భ్రాతృవత్సలు, సరిభీకరు భరతుఁ జూచి యంతటఁ బలికెన్.
ధరణీశ మంచిహితవును, సరగునఁ జెప్పెదను వినుము జగతి స్తుతున్. 398

తే. సాధ్యమనుగానిపనిలేదు సాంప్రతంబు, పుష్కరద్వీపమున కిప్డు పోవుటకును
దుర్గమంబదికావునఁ దోడు లేక, పోవవల దచ్చటికి నీవు పొందుగాను. 399

క. లీలన్ సోదరసేనా, జాలముతోఁ గలిసి రామజనపతికడకున్
గాలము జరుపకచని యా, కాలస్థితి నొడివి జన్యగమనేచ్ఛ వడిన్. 400

ఉ. వారణవాజిసైన్యరథవాసరదానవనాథరాక్షస
శ్రీరఘురాములం గలసి చిత్రవతీపురి కేగి శౌర్యవి
స్తారుసహస్రకంధరుని జంపి జయంబును బొంది వాజినిన్
ధీరతఁ గొంచు నీపురికిఁ దెప్పున రానగునయ్య పెంపునన్. 401

క. అని చెప్పి భరతుచేతను, ఘనముగఁ బూజింపఁ బడి సకౌతుకమొప్పన్
దనుజారిగురుఁడు సురగురు లను గూడి స్వర్గమునకు రయమునఁ జనియెన్. 402

## భరతుఁడు శ్రీరాములకు యాగాశ్వముగతి నెఱిఁగించుట

శా. శర్వాణీమణిహారిణీ వినుము వాచస్పత్యవాక్యంబులన్
నిర్వాదంబని కైకయీసుతుఁడు నిచ్చ న్మెచ్చియాలించి తా
సర్వోన్నతబలున్ సహస్రవదనున్ సంగ్రామపారీణుని
న్నుర్విం గూల్పఁగ నెంచి మించినజవంబొప్పారఁగా నంతటన్. 403

తే. సైన్యసోదరయుతుఁడు నైహైన్యచిత్త, మమరసాకేతపురిఁ జేరి రామచంద్ర
పాదవనజంబులకు మ్రొక్కి భానువంశ, దీప నీయాజ్ఞ గొని సర్వదేశములను. 404

క. తురగముతోడను నేనీ, ధర గ్రుమ్మరి వచ్చి సింధుతటమం దుండన్
గురుబలుఁడు సహస్రకంఠుఁడు, కరమఱుదుగ వచ్చి వాజిఁ గాంచి కినుకమై. 405

క. తనదూతలోహితాత్మునిఁ, గని రామాశ్వంబుఁ గొనుచుఁ గడువడిరా నేఁ
జనుచున్నాఁడ నటం చని, దనుజేశుఁడు చెప్పిపోవఁ దనుజుఁడు యుక్తిన్. 406

తే. వచ్చి నిద్రించు మాపైన మచ్చుచల్లి, వాజిఁ గైకొని దశశతవదనుపురిని
నిల్పె నేప్రొద్దుననను లేచి నిఖిలదిశల, వెదకి హయమును గానక విబుధపతికి. 407

క. శరమునఁ బత్రికఁ బంపిన, సురపతి కని భయముఁ జెంది సురగురుయుతుఁడై
అరుదెంచి భీతిచే నీ, హరి నాపురి దాచలేదు హరికులతిలకా. 408

చ. అని వచియించె నాంగిరసుఁ డంతట నగ్గని నేఁటిరాత్రి వా
జినిఁగొని రక్కసుం డొకఁడు చిత్రవతీపురిఁ దాచెఁ గాన వే
చని రఘురామమూర్తికినిఁ జక్కఁగఁ నీకథఁ జెప్పుమంచు నా
కునుఁ దగఁ జెప్పి దేవతతిఁ గూడి దివంబున కేగి వేడ్కతోన్. 409

క. ఏ నీ కీకథఁ దెలుపఁగ, మానుగ నరుదెంచినాఁడ మాన్యులు మెచ్చన్
దానవనాథునిఁ జంపఁగ, మానసమునఁ దలఁపవలయు మహితోద్ధతితోన్. 410

క. భరతునిమాటలు చెవిఁ బడఁ, బరమాద్భుతకలితచిత్తధరితుం డగుచున్
దురమున సహస్రవదనునిఁ, బరిమార్పఁగఁ దలచి రామభద్రుం డెలమిన్. 411

ఆ. శాతకుంభరత్న సహితసభామంటపమును జేరి భ్రాతృవరయుతుండు
నగుచుఁ గొల్వుదీరె నాశచీపతి దేవ, సభను గొల్వుదీరుసరణి గల్గ. 412

ఉ. ఆత్తఱి విస్మయాన్వితము నైనమనంబున రామభూవరుం
డుత్తమమంత్రి దానవగుణోత్తరవానరసోదరాహవా
యుత్తరథాదిసైన్యనివహంబులఁ గూడి సహస్రకంఠుఁ ద
త్పత్తనరాజముం గెలువ భావములోపల నెంచె నెంతయున్. 413

క. దశశతవదనహరంబై, శశిముఖివృద్ధాంగనాది సేవ్యం బగుచున్
దిశలందు వెలయుచుండిన, దశరథసుతుచరిత మిపుడు తగ భాషింతున్. 414

## శ్రీరాములు పిలుపింప మును లరుదెంచుట

తే. దివ్యభావుఁడు రాముఁడు దీప్యమాన, హాటకాంచితరత్నసింహాసనమున
నుండి పిలిపించె భక్తినఖండతత్త్వ, భోగరతుల నగస్త్యాది యోగివరుల. 415

క. దూతాహూతులు నై మఱి, భూతలవాసులను దమ్ముఁ బొగడుచునుండన్
సీతాపతి నెన్నుచు మది, నాతతభయభక్తు లొప్ప నధికప్రీతిన్. 416

క. ఎందుకు రఘుకులుఁ డియ్యెడ, బొందికఁ బిలిపించె నింకఁ బోనగు ననుచున్
అందఱు గుములై కార్యము, ముందుగ యోచించుకొనుచు మోదంబలరన్. 417

సీ. వామదేవవసిష్ఠ వాల్మీకి నారద కండుశౌనకరైభ్య కణ్వసూత
ఘటజన్మరోమశపటుశక్తిశాంఖిక గౌతమాంగీరస గాధిసూను
గార్గ్యమార్కండేయ కశ్యపజాబాలి జమదగ్నిమిత్రాది సకలమునులు
వరతెంచి జ్వలనార్కప్రతిభులై నిజగృహ ప్రాంగణభూమిని బ్రజ్వరిల్లు
తే. చుండఁ గనుఁగొని మనసు నుప్పొంగుచుండ, ననుజులను గూడి రాముఁ డావేళ లేచి
వారి కెదురేగి యాసనవందనాదు, లర్పణము సేసె వేర్వేఱ నతులభక్తి. 418

తే. మణిసుభూషణకాంచన మయమునైన, పీఠమున దాను గూర్చుండి పెద్దప్రొద్దు
మనసులోపలఁ జింతించి మాన్యవరుల, ఋషులఁ గన్గొని పల్కెను హితవుగదుర.

ఉ. తాపసులార నాపలుకుఁ దాలిమితో విననాను ప్రేమచే
భూపతు లెల్ల మెచ్చఁగను భూరితురంగమయజ్ఞ మీపురిన్
శ్రీపతితుష్టికై సలుపఁ జిత్తములోపల నెంచి ఘోటకం
జేపునఁ బూజచేసి భువి నింపుగఁ గ్రుమ్మరిరాఁగఁ బంపితిన్. 420

క. రాక్షసుఁ డొకఁ డాయశ్వము, దీక్షం గ్రతువందు మాయ దిగిచియుఁ దాచెన్
క్షితితలమున నాచే, నీక్షణమున జేయఁదగిన దెద్దియొ దానిన్. 421

క. ఘనతరకరుణామతులై, మనసుల యోచించి నాకు మాన్యులు మెచ్చన్
బనిఫూని యిపుడు చెప్పిన, వినియెదఁ గర్ణేంద్రియముల వేడుకలూరన్. 422

క. నాయెడ దోసంబుండినఁ, బాయుటకై వేదశాస్త్ర పద్ధతిగల్గన్
ప్రాయశ్చిత్తవిధానం, బీయెడఁ జెప్పిన నొనర్తు నింపుకలర్వన్. 423

తే. ఇటులభాషించు రఘురామ నృపునిపలుకు, సంశ్రితవ్రతులైనయానంయమీంద్రు
లాలకించి మనంబులఁ జాలనరసి, మాఱుచెప్పక యుండిరో మధురవాణి. 424

క. ఆవేళ నాయగస్త్యుఁడు, భావంబున నశ్వగతిని బరికించి తగం
బావనచరితునిదశరథ, భూవల్లభుఁ డైనరామపుంగవు నమలున్. 425

ఉ. సంతతభక్తిజిత్తవర సారసకర్ణికఁ జేర్చి తత్త్వముం
జింతనచేసి తన్మయవిశేషమహార్ణవమగ్నుఁడై తగన్
అంతనివాతదీపగతి నందుచు గ్రమ్మరసంస్మరింపుచున్
సంతస మొప్పఁగాఁ బలికె క్ష్మాపతివర్యుని తోడ నయ్యెడన్. 426

అగస్త్యుఁడు రాములను నుతించుట

ఉ. శ్రీరమణీమనోజ్ఞతర చిత్తసుధాకర భక్తబృందమం
దార సుపుష్పహార భవదారుణపాతకహార శ్రీకరా
ఘోరవికారదూర వరకోవిదసంఘమనోవిహార దు
ర్వారనిజప్రభానికర వారణరక్షణ నిత్యతత్పరా. 427

ఉ. రామ విశేషవిక్రమ పరాజితభార్గవరామ వారిద
శ్యామ సురారిభీమ జనసంఘమునీశ్వర సర్వలోకసు
త్రామ హిరణ్యగర్భబుధరాశిమనోంబుజధామ భీమసం
గ్రామ ననుం దయారసము గ్రాలఁగ నేలవె జానకీపతీ. 428

క. కుజనుల శిక్షించుటకును, సుజనుల రక్షించుటకును క్షోణీస్థలిలో
నిజముగ నరరూపంబున, జగదీశ్వరపుట్టితీవు జగములు పొగడన్. 429

క. లోకంబులన్నిచెడి పెం, జీఁకటిగానుండుతఱిని స్థిరముగ నీవే
ఏకాకృతితో నుందువు, ప్రాకటసత్కీర్తిధామ రఘుకులసోమా. 430

క. కలఁడందురు జలమందున, గలఁడందురు దేవలోకగణములయందున్
గలఁడందు రార్యులందును, గల వంతట నీకు వేఱుఁ గలదే చూడన్. 431

ఉ. శ్రీరఘురామ దివ్యతులసీమయదామ వివేకతుల్యశృం
గారగుణాభిరామ మునికామచరాచరజీవఘాతదు
ర్వారకబంధదానవవిరాజివిరామ విశేషకల్మషో
త్తారకనామ రామ భవదారుణకారణభీమ రాఘవా. 432

క. కరుణారసభరితాంతః, కరణా రిపుహరణ సుగుణ కమ్రాభరణా
సురకిన్నరగణపూజిత, చరణా నానాప్రపంచచాలననిపుణా. 433

సీ. అఖిలభూతేంద్రియాహంకృతిప్రాణంబు లను నీవుఁడవు నీవె లలితరూప
ప్రకృతిదత్త్వాకృతిసంభవమహత్తును నీవ భావింపనీవికి భర్త నీవ
ప్రకృతివికారంబుఁ బాసిననిను సెన్నఁ బ్రాకృతుం డోపునే ప్రకృతిహీన
నీయందుకలిగిన నిఖిలగుణంబుల చేఁ గప్పఁబడి నీవు చిత్రముగను
తే. సర్వరూపంబులెప్పుడు చాలఁ దాల్చి,యుండి తద్రూపవైకృతి నుండ కనల
విద్యుదింద్వర్కశతకోటివివిధకాంతి, చేత వెలుఁగొందునినుఁగొల్తుఁ జిత్తమందు. 434

ఉపేంద్రవజ్రము. యతు ల్బుధు ల్ధీరులు హర్ష మొప్పన్
మతి న్మహాభక్తిని మాన్య నిన్నున్
స్తుతించి మోక్షంబును జూరఁగొంచుం
గృతార్థులైయుందురు కీర్తిమీఱన్. 435

శా. నీపద్యోఘము లాలకించెడి చెవుల్ నింజూచు నేత్రంబులున్
నీపాదంబులమీఁద సోఁకు శిరము న్నిన్వేఁడువాక్యంబులున్
నీపే రెప్పుడు వ్రాయుహస్తయుగము న్నీసేవపై భావమున్
నీపై గొప్పతలంపు నాకొసఁగవే నీరేజపత్రేక్షణా. 436

ఉ. నిత్యము సర్వలోకముల నేర్పునఁ గప్పెడి మాయచే నినున్
సత్యచరిత్రుఁ గప్పఁగనుజాలదు కావున నట్టినిన్ను నేఁ
బ్రత్యహము న్మదిం దలఁతు భక్తినమస్కృతు లుల్లసిల్లఁగా
సత్యచరిత్ర సూరిజనసన్నుతిపాత్రచరిత్ర రాఘవా. 437

సీ. పరమేశ యోగీశ భవనాశ సర్వేశ సీతామనోహర చిత్రహార
కాష్ఠాంతరానలుకైవడి సర్వభూతంబులనొకఁడ వైతనరు దీవు
సద్గోప్యుఁడవు గుహాశయనుండ వఖిలేశ నీయంతవాఁడ వై నిత్యమెల్లఁ
జిత్రకర్మంబులు చెలువొందఁ జేయుచు సృష్టించి పోషించి నష్టపఱచి
తే. సర్వభూతహృదంతరసరసిజముల, నేర్పుతోనుండి భాసిల్లు నిన్ను నెవఁడు
బుద్ధి నెఱుఁగునువాఁడుసంపూర్ణ సౌఖ్య, పదముఁ జెందును నిక్కంబుఁ బదిలముగను.

తే. పరమసుజ్ఞానసుఖబలైశ్వర్యయుక్తి, భోగగుణములఁ దనరారు పుణ్యచరిత
నిన్నువర్ణింపనేర్తునే నిత్యమేను, లీలమై సచ్చిదానందశాలివగుట. 439

క. అవ్యయనిత్యనిరంజన, భవ్యాత్మషడూర్మిరహితపరమప్రీతా
సువ్యక్తయోగమాయా, భివ్యక్తతనూవిలాస ప్రియకరవాసా. 440

తే. ఆదిమధ్యాంతశూన్యుండ వచ్యుతుండ, వఖిలధృతివి నికాముఁడ వనఘయెపుడు
సొగదు నీయందె సర్వంబు నెమ్మిచెలఁగ, నఖిలమున నీవు వర్తింతు వధికశక్తిన్. 441

క. దేవా నీపదయుగళము, భావంబున నిలిపికొనుచు భయనముభక్తిన్
సేవించెదఁ దగవేఁడెద, పావనసత్కీర్తిధామ భవహరనామా. 442

క. యజ్ఞక్రియ యజ్ఞప్రియ, యజ్ఞేశ్వర యజ్ఞరూప యజ్ఞవిధానా
యజ్ఞఫలప్రద సుఖకర, యజ్ఞస్థితవస్తునిచయ యజ్ఞాత్మా.

చ. మధుగతమత్కరంబుగతి మాయనుజిక్కి భవద్విభూతి...
ప్రథితముగా నెఱుంగఁగను బ్రహ్మహరాదులు వాల్ల...
పృథులభవాబ్ధి మగ్నుఁడను బుద్ధి విహీనుఁడ దేవదేవ నీ
కధికసుఖంబొనర్పనగు నంబుజనేత్ర నృపాలశేఖరా. 444



క. నీకుం దెలియని కథ యీ, లోకంబునఁ గలదె రామ లోకాధీశా
నా కెట్టు దెలియం నైనను, నీకరుణం జెపుదు నేను నిజముగ వినుమా. 445

## అగస్త్యుఁడు శ్రీరామునకు సహస్రకంఠుని వృత్తాంతంబుం జెప్పుట

తే. పుష్కరద్వీపమునఁ బూర్ణభోగములను, నమరపురిసౌరు గేలిసేయంగఁజాలు
చిత్రవత్యాఖ్యగలపురి చెలఁగుచుండు, నవనిగుణధామ భానువంశాబ్ధిసోమ. 446

క. ఆనగరమందుఁ గశ్యప, సూనుఁడు మాయాబలుండు శూరుఁడు భావా
ధీనుఁడు సహస్రశిరుఁడను, దానవనాథుండు కలఁడు దర్పోద్ధతి మై. 447

ఉ. ఆదనుజేశ్వరుండు బహుహాయనము ల్దపమాచరించి యీ
మేదిని లోకనాథసురమిత్రులఁ దృప్తులఁ జేసి వారిచే
సాదరమొప్పగా వరము చాలఁగనొంది జయావిశేషసం
పాదనతత్పరుం డగుచు వాసిబలంబులఁ గూడి పెంపునన్. 448

క. వేదండకరసమానభు, జాదండ స్వర్ణరత్నసద్ధ్రీచివిలస
త్కోదండ మండితాశుగ, కాండుఁడు నై మింట సురలు కడుభీతిల్లన్. 449

తే. పటహకాహళభేరీరవంబు మిగుల, జెలఁగుచుండంగ రథ మెక్కి శ్రేష్ఠులైన
దనుజులను గూడి శూరులఁదఱిమిచంపి, యశముగైకొనఁబోయెనాయసురవిభుఁడు.

ఉ. అంతట వానిరాకఁ గని యద్భుతమొందుచు జీవసంఘముల్
స్వాంతమునందు నిత్యమును సారెకుఁ దద్బలమెన్నుచు న్వడిన్
సంతస మేమిలేక తమచానలఁ గానలదాఁచి వేచి బ
ల్చింతలఁ గుంది యెచ్చటికో చేరిరి లజ్జలమాని ఖిన్నులై. 451

క. ఆలోనఁ గార్యమదరఁగ, శూలాయుధహస్తుఁడగుచు సురతతి బెదరన్
నేలం బగులఁగఁగదలుచు, కీలాభీలంబునొంద గిరు లద్రువంగన్. 452

శా. ముల్లోకంబుల కెల్ల నేగి జనులన్ బోనీక గాఱించి వా
రిల్లాండ్రం జెఱబెట్టి దిక్పతులభూమిశాదులం జీరి లోఁ
గల్లోలాత్ములఁ జేసి దిగ్విజయము న్గావించి మిత్రాళితో
నల్లాపంబులొనర్చుచు న్మఱియుం నిచ్ఛాస్వేచ్ఛఁగా నత్తఱిన్. 453

మ. సకలక్ష్మాపతు లిచ్చురత్నధనము ల్సంప్రీతిమైఁ గొంచు భీ
కరుఁడై చిత్రవతీపురంబునకు వేడ్కన్వచ్చి విన్నాణియై
యకలంకస్థితినుండి బాహుబలనిత్యానందదైత్యాధిప
ప్రకరంబు ల్దనుగొల్వ నుద్దవడితో భాసిల్లుచుం గ్రమ్మఱన్. 454

ఉ. పిమ్మటవేల్పుసూదు వఁపించెడి కొమ్మ లపిండుఁగూడి బ
ల్కమ్మనితావులెల్లఁ దమిఁ గైకొని పూపొదరిండ్లదూరి వే
కొమ్మలనుండు పువ్వులను గొన్నిటి రాల్చెడు తెమ్మెరల్ వయిం
గ్రమ్మెడి మేటితావులను గంతునికయ్యమునందుఁ గ్రమ్మరన్. 455

క. సరసిజకల్హారోత్పల, సరసీజలమందుఁ గ్రీడ సల్పె న్వేడ్కన్
గరిణీయుతకరిపతిగతి, విరిబోణులఁ గూడి దనుజవిభుఁ డావేళన్. 456

ఆ. పెక్కుభోగములనుఁ బెద్దకాలం బిటు, లనుభవించి భవము నరసి నీటి
బుగ్గ యిదియటంచు బుద్ధిలో నూహించి, తగులమంతఁ బాసి మిగుల రోసి. 457

సహస్రకంఠుఁడు హరింగూర్చి తపంబు సేయుట

ఉ. ఇమ్మహి ముక్తిఁ గోరి హరి నీశ్వరు నవ్యయు మాపతిం బరున్
సమ్మతి సారెసారెకును జాలఁగ భక్తిని బ్రస్తుతించుచున్
ఇమ్మహి వేయువత్సరము లిక్రియ దివ్యతపంబుచేసె ఘో
రమ్ముగ వేల్పులెల్లఁ గని రాయిడిఁ జెంది భయంబుఁ జెందఁగన్. 458

చ. స్థిరముగఁ బ్రాణవాయువును జేర్చి మనఃకమలంబులోపలన్
బరగున నీప్రపంచమును సత్యముగాదని యెంచి పూన్కితో
నిరుపమయోగసాధనవినిర్గతపాపవితానుఁడై జగ
ద్భరపరమేశ యీశ యని పాయక చింతనచేసి వెండియున్. 459

తే. వాతభక్షకుఁడై పంచవహ్నిమధ్య, వర్తియగుచును గనలు నివాతదీప
విధముతో నపు డుండెను వేఱుపడక, నిర్మలంబగు మనముతో నియతిమిగుల. 460

మ. పృథివీనాయక తత్తపోగ్ని వెలుచం బృథ్వీనభం బంతటన్
బ్రథితంబై వడిఁగాల్పఁ జూచి గుములై పాకారియున్ దేవతల్
వ్యథచే ధాతృమునీంద్రసంయుతులునై వైకుంఠముం జేరి యా
విధునిం గాంచి నమస్కరించి వినుతు ల్వేమాఱుఁ గావించుచున్. 461

ఉ. పాపలతాలవిత్ర భవబంధనకాననవీతిహోత్ర ని
ష్పాపకళావిచిత్ర బుధపాలనసూత్ర సురారిజైత్ర స
ద్భావపవిత్ర సర్వజనమోదమహాత్వచరిత్ర ప్రోల్లస
చ్ఛ్రీపతిదివ్యపాత్ర గుణశేఖర సత్యచరిత్ర కేశవా. 462

క. శ్రీమత్సద్గుణనికరా, భూమానంద ప్రచార పూర్ణశరీరా
భీమాసురవిదళనకర, దామోదర నిర్వికార తత్త్వవిహారా. 463

క. పాలింపుము మముఁ గరుణన్, లాలింపుము సుఖము నిచ్చి లలిమీఱంగాఁ
గాలముజరపక వేగమె, శ్రీలోలా కనకచేల శ్రితజనపాలా. 464

చ. అని కడుభక్తి వేడుకొను నబ్జభవాదులఁ జూచి విష్ణుఁ డి
ట్లనియె సహస్రకంఠతప మారడిఁ బెట్టెను మిమ్ముఁ గాన నేఁ
జని వరమిచ్చి వానిమనసారఁగఁ దృప్తునిఁజేసి వచ్చెదన్
జనుఁడని వారిఁ బోఁబనిచి శౌరి దయారసమగ్నచిత్తతన్. 465

సీ. మస్తకంబునరత్నమయకిరీటము గుల్క ముఖమందుఁ గస్తురిముద్దునామ
మమర నురంబున నతులకౌస్తుభమణి రాణింప మెడఁ గొన రమ్యమగుచు
వనమాలభాసిల్ల బాహుమూలంబుల నంగదకాంతు లుప్పొంగుచుండఁ
గరముల శంఖచక్రంబులు శోభిల్లఁ బక్షినాథుని నెక్కి పైడిపటము
తే. పైన సొంపారఁ జిగిఁబాఱ సర్వదిశల, మేఘసన్నిభఁ దెలువొందు మెఱుపుభంగి
వేడ్కఁ దనవెంటసిరి రాఁగ వెన్నుఁడంత, వచ్చి నిలిచెను దశశతవదను మ్రోల. 466

క. ఆసమయంబున యోగా, భ్యాసముచేఁ దనువుమఱచి హరినామోప
న్యాసము చేయుచు నుండెను, భాసురముగ నసురవరుఁడు భయరహితుఁడునై. 467

ఉ. వారిజనాభుఁ డంత సురవైరిని గన్గొని పల్కె నెంతకీ
ఘోరతపంబు సేసెదవు కోరినకోర్కెలఁ దీర్తు నియ్యెడన్
ధీరత లేచి పల్కు మికఁ దృప్తుఁడనైతి భవత్తపంబున
న్నారడిఁ జెందెఁ జూడు జగమంతయుఁ దానవనాథ భీతిచేన్. 468

తే. విష్ణుఁ డీలాగునాడిన విని యతండు, తపముఁ జాలించి తనమ్రోలఁ దనరుచున్న
జిష్ణు రోచిష్ణు గని మహాచిత్రమొదవఁ, గొంతవడినుండి వేడుకల్గ్రాలనలుసాగ. 469

తే. హస్తములు మోడ్చి తత్పదన్యస్తశిరుఁడై, జోహారును గావించి యంత లేచి
కనుల నానందబాష్పము ల్గ్రమ్ముకొనఁగ, వినుతిఁ జేసెను విశ్వేశు విపులభక్తి. 470

సహస్రకంఠుఁడు హరిని నుతించుట

ఉ. శ్రీరమణీమనోవిమల చిత్తసరోజసుమిత్ర దీప్తపం
కేరుహపత్రనేత్ర వరకీర్తి పవిత్రచరిత్ర ఘోరసం
సారలతాలవిత్ర భవసారసమిత్ర సురారిజైత్ర భూ
భారధురంధరాభినుతిపాత్ర ననుం దయనేలు కేశవా. 471

శా. శ్రీవత్సాంకితచిహ్న భవ్యవిలసచ్ఛ్రీసంయుతాకార స
ద్భావా నిత్యనిరంజనా నిరుపమా పద్మాక్షనిత్యోదయా

భావజ్ఞా భవరోగచక్రహరణా భక్తాళిసంరక్షణా
దేవాధీశ్వర నామనోరథము నుద్దీప్తంబుగాఁ జేయవే. 472

ఉ. భావవిదూర నిం గొలుచుభక్తులు ముక్తులునై ధరిత్రి మే
ల్త్రోవలఁ బోదు రట్టిబుధలోలక నీవిపు డేగుదెంచుటన్
భావము తుష్టినొందెఁ బరభాగ్యము సొంపెసలారసాగె నీ
సేవఁ బవిత్రగౌరవముఁ జెంద శరీరము నేడు కేశవా. 473

మ. ఇలలో స్వప్నసమంబుగాఁ దనయమిత్రేశాది సంబంధముల్
లలినాపోరలి యెండమావులకుఁ బల్గాంక్షించు చందాన నేఁ
దలఁతుం గ్రమములంచు మూర్ఖుఁడ మహాదర్పాంధకారంబులో
పల నేఁ జిక్కితి స్రుక్కితిం గరుణతోఁ బాలింపు లక్ష్మీపతీ. 474

క. మురహర భవహర శుభకర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వమునీ
శ్వరముఖసురసేవితవర, చరిత గుణోత్తరవిహార సత్యవిచారా. 475

క. నగరాజతుల్యధైర్యా, నిగమాంతవిచారధుర్య నిపుణస్థైర్యా
జగతీపాలనకార్యా, సుగుణాకరధీరవర్య సుస్థిరశౌర్యా. 476

సీ. సర్వేశ నీదయ సంసారికెప్పుడు సంఘటించునో ఘోర సకలబంధ
ములు తెగిపోవును ముమ్ముట్టగా నంత బాధమోక్షంబునఁ బ్రాప్తమగును
బుధరాజిసంగంబు బొలుపొందు దానిచే భక్తిసిద్ధించు నాభక్తివలన
మోక్షంబుచేకూరు మదచున నరులకు ముక్తికారణధీర మోదకరణ

తే. చిన్మయాకార మానతీచిత్తచోర, భక్తమందార నతజనపాపహర
సూరిజనవారసంచార సుగుణహార, కరుణతోడుతనన్నేలు కనకచేల. 477

శా. దేవా పెక్కుభవంబులొంది తుది నుద్దీప్తప్రపుణ్యంబునన్
ఈవిశ్వంభరఁ బుట్టి కామరతినై యింపారితి న్నేమముల్
భావంబందుఁ దృణామృతాభిరతియై కల్లాఱు లోభంబునన్
దావాంధం జని నూతిలోఁబడిన చందంబయ్యె వీక్షింపఁగన్. 478

క. దారాత్మజమిత్రాదులఁ, గోరి ముదంబొప్ప వానిఁ గూడి మహోద్య
త్క్రూరాశఁ జెంది చెడితిన్, ఆరయ బహుకాలమిటుల నారడివోయెన్. 479
ఘటభిత్తితుల్యచంచల, చటులశరీరంబుఁ జొచ్చి జడమతినగుచున్
నటులను భటులను గూడియుఁ, నిటునటు విహరించినాఁడ నెఱుఁగమి నీశా. 480

తే. సకలదిక్కుల నోడించి సంతసించి, చారుసింహాసనం బెక్కి సార్వభౌముఁ
డగుచు జవరాండ్రతోఁ గూడిసొగసుగాను, నిన్నుఁగనలేదుమనుజుఁడు నిర్మలాత్మ.

క. మందుఁడు మానసచంచల, సుందరభోగాదులడఁచి సురుచిరతపముం
బొందుగ నొనర్చి హరి తను, నొందగఁ గాంక్షించఁగోరఁ దుఃఖాలు నిన్నున్. 482

తే. కూర్మము నిజాంగముల నిచ్చఁ గోరి వేడ్కఁ, జాచి యాడించి మఱలించి దాచినట్లు
సర్వజగముల సృష్టించి సమతఁ బెంచి, లయము నొందింపుచుందువు లలితగతిని. 483

ఉ. కర్మములం దకర్మమును గన్గొని నిత్యము వీతరాగుఁడై
కర్మలఁ జూచుచున్ స్వగతకాముకుఁడై తనరారి దీక్షచే
నిర్మలమానసాబ్జమున నే ననుగర్వము మాని శాంతతన్
ధర్మసుచేల నిన్నుఁ గను భక్తుఁడు సౌఖ్యమునొందుచుండెడున్. 484

మ. సకలప్రాణులకుక్షిభాగమున సూక్ష్మజ్యోతిరూపంబుచే
నకలంకస్థితినుండి భక్షితపదార్థాన్నాదుల న్నిత్యమున్
బ్రకటోత్కర్షత నాల్గుభాగములుగా భాగించి ప్రాణానిలున్
బ్రకటాపానునిఁ గూడి సంపచనతన్ భాసిల్లుదీ వీశ్వరా. 485

తే. క్షరుఁడవై సర్వభూతాళి సహితజీవ, రూపి వగుదువు మఱిభావరూఢిమిగుల
నక్షరత్వంబులోఁ గూటసాక్షివగుచు, నంతటను వెల్గుచున్నాఁడ వతులశక్తి. 486

ఉ. దారమునందుఁ గూర్పఁబడి తద్దయు శోభిలుచుండు రత్నసం
వారము రీతి లోకములు వారకనీయుదరాంతరంబునన్
జేరి వెలుంగుచుండు నినుఁ జిత్తములో భజియించువాఁడ సం
సారఘనాబ్ధినీఁదఁగను జాలను నీకడఁ జేర్పు మాధవా. 487

క. ఘనతరమగునీమాయం, గనిదాఁటఁగఁ జాల రెవరు గహనం బగుటన్
వనజాక్ష నీదయారస, మును గలవారికిఁ గలరు మోదంబొప్పన్. 488

ఆ. పరమపదవిహార వందారుమందార, పాపఘనసమీర భావదూర
చారుకాంతినికర సంశోభితాకార, సకలలోకవీర చతురధీర. 489

క. దారాత్మజరత్నాదులఁ, గోరక నీపాదసేవఁగోరి ధరిత్రిన్
సారెకుసారెకుఁదలఁచెడి,వారల భవవారములను వారింతు వొగిన్. 490

తే. నిత్యసంతుష్టుఁడును యోగనియతచిత్తుఁ డగుచు నెవ్వాఁడు నిను భక్తి నాశ్రయించు
వానివెనువెంటనుందువు పూనిగోవు, వెంటనంటెడు వృషభంబు విధముతోఁప. 491

క. సాధుచిత్తము నీయది,సాధులచిత్తంబు నీవ సారసనేత్రా
సాధుల నెఱుఁగుదు వీ వొగి,సాధు లెరుంగుదురు నిన్నుఁ జంచద్భక్తిన్. 492

పంచచామరము. మురారి పాపకారిహారి మోక్షసద్విహారి స
చ్చరాచరప్రపంచజాల సాక్షి వౌచు నిత్యమున్
విరాజమానతత్వకాంతి వెల్గుచుండునిన్ను నే
పరాత్పరా నుతింపఁ జాలఁ బాలిశుండ నాటచేన్. 493

చ. అని తను వేఁడఁ దుష్టుఁడయి యచ్యుతుఁ డాయసురేశుతో నన్
దనుజవరేణ్య నీస్తుతికిఁ దద్దయు మెచ్చితి నీప్సితంబులన్

ఘనముగఁ గోరు మిచ్చెదను గౌతుకమొప్ప నటంచుఁ బల్కి నన్
విని నయభక్తులొప్పఁగను వేడుచు నిట్లనిపల్కె భామినీ. 494

ఆ. తపము దొల్లిభక్తతత్పర కావించి, సరసిజాసనాదిసర్వదేవ
వరులచే నమోఘవరములు గైకొని, సర్వలోకవిజయశాలి నగుచు. 495

క. ధరలోఁ బెక్కుసుఖంబులు, గురుతరముగ ననుభవించి కుంభినివానిన్
నిరసించితి వ్యర్థములని, కరిరక్షణదక్ష దివ్యకౌస్తుభవక్షా. 496

ఆ. నీకుఁ బాన్పునగుచు నే నుండవలె నను, గోర్కె కలదు గానఁ గూర్మితోడ
నీవరంబొసంగి పృథుదయరక్షింపు, మితరవరము నొల్ల నిందిరేశ. 497

క. నారదసనకసనందన, పారాశర్యాదిమౌనివరహృద్వాసా
భూరితరచిద్విలాసా, సూరాయుతకోటిభాస సురుచిరహాసా. 498

## హరి సహస్రకంఠునికి గోరినవరంబు లిచ్చుట

సీ. అని తను వేడెడిదనుజునిఁ బొడఁగాంచి హరిపల్కెఁ గ్రమ్మఱ నవనిలోన
దశరథునకు నేను దనయుండనై పుట్టి, దురమున నినుఁ బట్టి ద్రుళ్ళఁ గొట్టి
శేషత్వమొసఁగెదఁ జెలువార నీవంత ముజ్జగంబులు మెచ్చ సెజ్జవగుచు
సురమునీంద్రుల కైనచొరరాని నాపదమును బొందఁగల వీవు ముదము మీఱ
తే. సమయ మిదికాదు నీకోర్కె సఫలమగుట, కసురవర నీపురంబున కరుగు మనుచుఁ
బల్కి వైకుంఠపురిఁ జేరె వారిజాక్షుఁ, డతులపూర్ణేందుఫాల కృపాలవాల. 499

క. వనమాలి వైననీచే, తను వాఁ డిటుపలుకఁబడియుఁ దద్దయుంభక్తి
న్మనమున నినుఁ దలపోయుచుఁ, జనె దానవుఁ డాత్మపురికి సంతసమొప్పన్. 500

క. దురమున రాక్షసనాశము, ధరలోఁ జేయంగఁ దలఁచి దశరథభూభృ
ద్వరసూనుఁడవై పుట్టితి, వరయఁగ నరరూపమున మహర్షులు మెచ్చన్. 501

తే. బాలచంద్రునికైవడిఁ బ్రత్యహంబుఁ, బెరిగి సీతావధూటిని బెండ్లియాడి
జనకువానతి భార్యానుజప్రయుక్తముగను గాననమున కేగి మునులకెల్ల. 502

చ. కోరినకోర్కెదీర్చి రఘుకుంజర కీశగణంబుఁగూడి దే
వారుల రావణాదిపిశితాశనవీరులఁ గిట్టి పోర న
వ్వారిఁగఁ గూల్చి సర్వజనవారము సంతస మందుచుండ భూ
భారముఁ బాపి భూసుతను బాగుగఁగూడి విలాసమొప్పఁగన్. 503

క. సాకేతరాజధానికిఁ, దేకువ మీఱంగవచ్చి స్థిరవైభవను
శ్రీకరముగ రాజ్యంబును, బ్రాకటముగఁ జేయుచున్నవాఁడవు పేర్మిన్. 504

క. రామా నృపకృత్యంబుల, నేమరకను సర్వయోగవృత్తులఁ బూన్కిం
గామించి మెలఁగుచుండెడి, ధీమంతుల నునిచినావె దృఢతరబుద్ధిన్. 505

తే. అనఘవంశక్రమంబుగా నవనిఁ జెలఁగు, విప్రులను మంత్రులను జేసి వేడ్కమించి
మెలఁగుచున్నావె రక్షించె మేదినీశ, వరుల నరులను శాంతస్వభావమునను. 506

ఆ. దీనజనులకెల్ల దివ్యసౌఖ్యంబుల, నిత్తె సంతతంబు హితవుమిగుల
భూపకులపవిత్ర బుధజనులె పాత్ర, తడవు సేయ కిపుడు ధైర్యశక్తి. 507

శా. తారాధర్తయుఁ దద్బలంబు దనుజాల్తన్నాథుఁడుం దమ్ములున్
సారస్ఫారశరాసనాన్వితులు సౌ క్ష్మాపాలసంఘమ్ములున్
ధీరత్వంబున వెంటరాఁ గదలి భూదిక్చక్రమల్లాడఁగా
భూరిప్రాభవవైభవోన్నతుఁడ నై భూనాథు లుప్పొంగఁగన్. 508

సీ. బహుయోజనోన్నతప్రసరంబుగలదియుఁ దాలహింతాలరసాలసకల
తరుశోభితము పక్షితతివృకమాతంగ శార్దూలభల్లూకశల్యసింహ
కక్కుటమార్జారఘూకాదిబహుజంతుసన్నాదితయుం సరోజాతకుముద
సంకీర్ణకాసారసహితము పర్వతనిర్ఝరకల్లోలనిబిడబింద

తే. సిక్తదిఙ్ముఖసమహితయుక్తకుంజ, పుంజమంజుళ మగుదివ్యపుష్కరాఖ్య
ద్వీపమును జేరు మామేటిదీవియందుఁ, జిత్రపలియను పురముండు సృష్టినదియుం. 509

తే. దేవతాభేద్యమై మణిదీధితులను, బట్టపగలుగ సతతంబు ప్రజ్వరిల్లు
దానివిభవంబు సెన్న నాతరమె చూడ, నైనఁజెప్పెదవినుము మనఘాత్మ తమిని. 510

సీ. ప్రాకారసప్తకప్రాసాదగోపురాట్టాళింద శృంగభర్మాఢ్యచిత్ర
రమ్యగేహారామరాజితధ్వజపతాకాదులచేత విహారయోగ్య
పుష్పితామ్రమహీధ్రపుంజలతాలసద్ద్వాత్రింశదుత్తర ద్వారభూరి
పరిశుద్ధపాథోధిపరిఖులచే దివ్య సౌధాళి మాతంగసైన్యవాజి

ఆ. రథసమూహయంత్రరాక్షసశాకినీ, కామినీసహస్రగణముచేత
నొప్పుచుండుదాని నుజ్జ్వలదశశత, వదనుఁ డేలుచుండు వైఖరిగను. 511

క. అవిశితాశనవీరుఁడు, శ్రీపతి నగునీవు తొల్లిచెప్పినమాటం
జేపటుఁ దేపటుఁ దలఁచుచు, నీపాదస్మరణకరణనిపుణుం డగుచున్. 512

క. మనమలరఁగ మహిఁ దిరుగం, జని నీతురగంబు సింధుశైవలినికడం
గని తన్ముఖపటలిఖితము, నొనరఁగఁ దాఁ జదివి కోప మొప్పఁగ నంతన్. 513

ఆ. శౌరి మున్ను నాకు సాదరంబుగ నిచ్చి, నట్టివరము దీర్పనవనిలోన
దశరథునకుఁ బుట్టెఁ దనయుండై నాకోర్కె, సఫలమగుటకిప్డు సమయ మబ్బె. 514

క. ఊరకపోయిన నాకుం, బోరాటం బెట్టుగల్గు పురుషోత్తముఁతో
నేరము చేసితి నేనియుఁ, బోరాడఁగవచ్చుఁ గ్రౌర్యమున సాహాసియున్. 515

తే. సురలుమునివర్గములు చూచి చోద్యపడఁగ, నంతదురమున నతనిచే హతుఁడనగుచు
వేగశమత్వమును బొంది విశ్వనాథు, పాన్పునైయుందు నక్షయపదముఁగొంది. 516

చ. అని రఘురాము వాఁడు మనసందున నీక్రియఁ జింతచేసి 'వా
జినిగొని రమ్మటంచు నిజభృత్యుని కయ్యెడఁ జెప్పిపోయె నా
తనివరభృత్యుఁ డశ్వమును దక్షిణలవర్తినిఁ గొంచు ధీరతం
జని పురిఁ దాఁచె దానినిజశక్తివిశేషము పిచ్చలింపఁగన్. 517

తే. ఇపుడు నీరాకఁగని పెట్టి పృథుయశుండు, చిత్రవత్యాఖ్యగలపురిఁ జెలఁగుచుండుఁ
గాన నీవేళఁదడవేలఁ గదనమునకుఁ, బోవఁ గౌబేరపుష్పకమును దలంపు. 518

క. దశదిక్కుల మణికాంతులు, విశదంబుగ వెలుఁగుచుండఁ బృథువేగమునన్
భృశత న్వచ్చు మటెవ్వరి, వశముం గా కదియుఁ గానవారని కినుకన్. 519

ఉ. వానరసోదరాదుల నవార్యబలాఢ్యులఁ గూడి చెచ్చెరన్
ఘూనతపుష్పకాఖ్యఁ బొలుపొంది వెలిఁగెడి దీవిఁ జేరి యా
దానవనాథు నాలమున దర్పముతోడుతఁ గూల్చు మిమ్ములన్
దీనజనాళి దేవతలు దివ్యముదాత్ములు నాదు రంతటన్. 520

ఉ. భూతలనాథ పీతిఁ గొని పూర్ణజయోదితకాంతితోడ సా
కేతపురంబుఁ జేరి నిజకీర్తులు దిక్కులు పిక్కటిల్లగా
పీతిముఖంబొనర్పు రణవీక్షలిగూలినతత్సుపర్వకా
రాతియుఁ సెజ్జనీకగుచు రమ్యసహస్రఫణాదిశేషుఁ డై. 521

ఆ. వానికలతెఱంగు వసుధేశ చెప్పితిఁ, గాన నానతిచ్చి కరుణఁబుపు
మాశ్రమముల కేమ పార్షంబుతో నేగు, చున్నవార మిపుడు సురుచిరముగ. 522

క. మానిగణంబులు పుణ్యులు, మానవనాథులును వినఁగ మాన్యులు మెచ్చన్
మానిప్రవరుఁ డగస్త్యుఁడు, మానవపతి కిట్లు సెప్పె మాన్యచరిత్రా. 523

క. కుంభజుపలుకులు విని రఘు, సంభవుఁ డనిపె న్మునీంద్రసంఘము నంతన్
శుంభద్ధైర్యుల త్మాథ్ళ, ద్గంభీరుల సోదరులను గలసికొని తగన్. 524

క. ఆర్యాదానవసంగర, కార్యార్థియయి నగుచు దనుజకపివర్యుల స
ద్ధైర్యుల శౌర్యాదిగుణా, దార్యులఁబిలిపించు భటులఁ దద్దయుఁ బనిచెన్. 525

క. జక్కులదొరపువ్వకమును, మక్కువతోఁ దలఁప నంత మహితద్యుతులన్
దిక్కులు పిక్కటిలంగా, జక్కఁగ నది వచ్చినిలిచె జనపతిమ్రోలన్. 526

ఆ. చెంతనిలిచి మెఱయుంచిత్రకౌబేరవి,మాన మపుడు గాంచి మహితరీతి
రామచంద్రుఁ డంత రయమున వచ్చెడి, మర్కటాళిఁ జూచి మదినిఁబొంగె. 527

క. అని పార్వతికిని శంభుఁడు, వినిపించెను రామజయము వేడ్కఁ జెలంగన్
ఘనభక్తిఁ జదువువారికి, వినువారికి రాముఁ డిచ్చు వివిధసుఖంబుల్. 528

తే. సూర్యచంద్రాదు లెందాఁక సురుచిరముగ, నుందు రందాఁక నీకథ నుర్వి నెపుడు

వెలయుచుండును రఘురామవిభునిదయను, సర్వజనభావ్యమై శుభశ్రావ్య మగుచు.

ఉ. రంగదభంగశౌర్యయుత రాక్షససంగవిపత్పరంపరో
త్తుంగతమఃపతంగ భవశోషణకారణరంగ నిత్యస
త్సంగ దయాంతరంగ కలుషప్రకరోత్తమఘోరరూపమా
తంగ ధరాత్మజాహృదయతామరసోజ్జ్వలభృంగ రాఘవా. 530

క. నీరదచయరుచివారా, వారణబాధాపహారణ వర్జితధీరా
ధీరాఘవినుతసారా, సారసపురుషప్రసారసారవిచారా. 531

కలహంసోత్సాహము. పరమశీలకనకచేల భక్తసంఘవత్సలా
వరదసుకరభోగజాల భవవిదూరసంకులా
సురమునీశసకలదేవశోభసాలవాల శ్రీ
కరవిశేష భువనపాల కమ్ర కాంతినిస్తులా. 532

మాలిని. అనుపమహితవిద్యా వ్యక్తభావానవద్యా
వినయసుగుణహృద్యా వేదవేదాంతవేద్యా
సకలసుకవికామా సత్యవాక్యాభిరామా
దనుజనిచయభీమా తత్వవిజ్ఞానసీమా. 533

క. శ్రీసీతాహృత్సారస, వాసాగాంగేయవాస భాసురహాసా
వాసవభోగవిలాసా, దాసావనతీవ్ర కామ దశరథరామా. 534

సీ. శ్రీరామసేవాప్తసిద్ధగీర్వాణాంధ్రకవితావినిర్మాణఘనపవిత్ర
రామపక్షులవంశరమ్యపారావారచంద్ర దయారససాంద్ర విమల
హారితసగోత్ర సురార్చనాపస్తంబసూత్ర సంతతసపాత్ర సుగుణమిత్ర
కొండయతనయవిఖంతితభవచయ బ్రహ్మవిద్యాహృద్యభవ్యవినయ
తే. నయజనవిధేయ కొండయనామధేయ, విరచితం బగు శ్రీరామ విజయకృతిని
ప్రథమభాగంబు పూర్ణమై పరఁగభువిని, సంతతానందదాయకశ్రావ్యమగుచు. 535

శ్రీరస్తు

# సహస్రకంఠరామాయణము

## ఉత్తరభాగము



రమణీమణిమానస
సారసవరహంస సూరిసన్నుత ధీరా
ధీరజనాళివిచారా
చారగుణా రామ రామచంద్రనరేంద్రా. 1

క. అవధారు పిదపఁ బార్వతి, భవుఁ గాంచి నుతించి రామభద్రు జయంబుల్
భువనాధీశ్వర సర్వము, ప్రవిమలముగఁ జెప్పుమనుచుఁ బ్రార్థింపంగన్. 2

క. విని మోదమందుచుఁ గరుణ, న్మనసిజహరుఁ డంత సతికి మమతదలిర్ప
న్వినిపించె ననుచుసూతుఁడు, మునితతికిం జెప్పెఁ దొడఁగె మోదము మీఱన్. 3

### వానరరాక్షసులు శ్రీరాములకడ కరుదెంచుట

తే. అంత రఘురాము నానతి నాత్మశిరము, లందు మోపి ముదంబున నఖిలనృపతి
చక్రములు చిత్తములలోనఁ జాలభక్తిఁ, జెలఁగుచుండంగ వచ్చిరి శీఘ్రముగను. 4

సీ. వాయుపుత్త్రుఁడు మఱి వాలినందనుఁడును తారుఁడు నీలుఁడు దధిముఖుండు
శరభసుగ్రీవులు శతబలిగజులును మహితబలుఁడు గంధమాదనుండు
నలజాంబవంతులు నానాకపీశ్వరు లరుదెంచి రంతట వారిఁ బిలచి
రామావనీశుని రమ్యచరిత్త్రుని మఱిమఱిఁ దలఁచుచు మమతలూర

తే. సగదశతకోటిసంఖ్యరాక్షసులు గొలువఁ, బంక్తికంఠునితమ్ముఁడు పరమయశుఁడు
విపులతరశక్తియుతుఁడు విభీషణుండు, వచ్చె సాకేతపురిఁ జేర వారిజాక్షి. 5

క. నానాద్వీపనివాసులు, నానాదేశస్థవిభులు నానామాతా
వ్యానితులై శ్రీరామునిఁ, గానఁగ నేతెంచి రంతఁ గడుభక్తిమెయిన్. 6

తే. రాముఁ డేలకో మనలను రమ్మటంచుఁ, బిల్వఁబంపె నటం చని ప్రీతిగుల్క
సాత్మలను మోదమొప్పార నతులభక్తి, మీఱ నందఱు తుటుములై మించిచేరి. 7

ఉ. శ్రీకరధామపాదసరసీరుహయుగ్మముపైఁ గిరీటముల్
సోకఁగ మ్రొక్కి సూర్యకులసోమ బుధార్చితనామ సుస్థిర

శ్లోక చరిత్ర సర్వకవిలోలమనోహరధామ రాఘవా
ప్రాకటపుణ్యజాలములు బాగుగఁ గూర్పవె జానకీపతీ. 8

క. దేవా మమ్ముల రమ్మని, భావంబునఁ దలఁచి పిల్వఁ బంపితి రిటకున్
భావించి దానిఁ బలుకుము, కావింతు మటన్న వారిఁ గని యతఁ డనియెన్. 9

ఆ. వేయితలలుఁ గలిగి వెలిఁగెడి రక్కసుఁ, డొక్కరుండు జగతి నుక్కుమిగిలి
పుష్కరస్థ మగుచుఁ బొల్పారు చిత్రవ, త్యాఖ్యపురిని గలఁడు సౌఖ్యమొదవ. 10

క. సకలప్రపంచవాసులఁ, జికితాత్ములఁ జేసి వారిసిరులం జెలులం
బ్రకటితశక్తిం గైకొని, యకళంకస్థితిని దనరునట వాఁ డెలమిన్. 11

మ. హయమేధార్థము వాజి నేఁ బనుపఁ గా నద్దానిఁ గ్రౌర్యంబుతో
భయ మొక్కించుక లేక పట్టుకొని శుంభద్ధీరతం బోయె నా
నయహీనాత్మునిఁ బోరిలోఁ దునిమి తన్నానార్థము ల్వాజినిన్
జయమొప్పారఁగఁ గొంచురాఁగ మది నుత్సాహంబు వాటిల్లినన్. 12

తే. పిలువఁబంపితి మిమ్ములఁ బ్రియముతోడఁ, జని సురారిని వధియించి సకలలోక
సముదయార్తిని బోఁగొట్టి సవహయమ్ముఁ, గొని ముదంబునవత్తము కోర్కెలూర. 13

క. అనిచెప్పి రాముఁ డందఱి, మనముల నుప్పొంగఁజేసి మహితోద్ధతితో
దను రణభేరియుం బ్రోయఁగ, దనుజులు భీతిల్లుచుండ దర్పము మీఱన్. 14

ఉ. తమ్ముల వానరాదుల నుదగ్రబలాఢ్యులఁగూడి పుష్పకం
బిమ్ముల నెక్కి ఘోరశరబృందశరాసనపాణి యై చనన్
సమ్మతి దీపహారతులు చానలు కొందఱు పట్టుచుండఁ గాఁ
గమ్మనితావితెమ్మెరలు గౌతుక మొప్పఁగ వీవనంతటన్. 15

ఉ. తమ్ములఁబోలు మోముల ముదమ్మున నెత్తి కరమ్ములందుఁ బు
ష్పమ్ములు దాల్చి కొమ్మ లిరువంకల మేడలమీఁద నుండి యం
దమ్ముగఁ గంకణధ్వనులు దండడిచేయుచునుండ వేడ్కతో
నెమ్మిఁ జెలంగ సేసలును నేర్పునఁ జల్లిరి రామచంద్రు పై. 16

ఉ. ఇంపుగ వాద్యనిస్వనము లేర్పడ వీథుల మ్రోయ భక్తితో
గుంపులుగుంపు లై ప్రజలు గూడి విమానమునందుఁ గాంతితోఁ
బెంపుగ నున్నరాఘవుని వీరవరేణ్యుని దివ్యవేషునిన్
సొంపుగఁ జూచి చూచి మదిఁ జోద్యమునొందిరి కోర్కె లూరఁగన్. 17

క. ఇక్కైవడిఁ దను జనములు, మక్కువతోఁ గలిసి చూడ మంజులకాంతిం
జొక్కులనడుమదనర్చెడి, జక్కవకవవిప్వ మాఁడ్కి జాల వెలింగెన్. 18

తే. దేవి రాఘవుఁ డీరీతిఁ దెఱువుఁబట్టి, యుప్పుసంద్రంబు నిక్షు సురోదధులను
సాజ్యదధిసింధువులను క్షీరార్ణవమును, గ్రమమునను దాఁటి వానిచిత్రంబు గనుచు.

క. పదపడి జంబూద్వీపము, మొదలుగ షడ్ద్వీపములను బుష్కరపదవిం
బదిదిక్కులు రాజిల్లఁగఁ, బదిలంబుగఁ గడచి శుద్ధ పాథోదధిచేన్. 20

తే. వేష్టితంబగు పుష్కర ద్వీపమందు, దశశతగ్రీవపాలితదనుజయంత్రము
దివ్యహర్మ్యమణిప్రభాదీపితంబు, నైనచిత్రవతీపుర మపుడు చేరి. 21

క. ఘనబలసైన్యయుతుం డై, మనుజేశుఁడు ముట్టడించి మాత్సర్యముతో
దను దత్పురిచెంగట వే, తనవగు వేనలను నిలిపి తా విస్మితుఁ డై. 22

శా. శ్రీరామామణికాటపట్టగుచు దుశ్శీలాసురాభీష్టమై
సారోదారమణిప్రభాపటలదిక్చక్రాంతరాళంబు నై
భూరిప్రాభవవైభవోన్నతులచేఁ బొల్పారె నీదీవిలో
నారా యీపురి సౌరు వెన్నఁదరమా యాబ్రహ్మకైనం దగన్. 23

తే. దీనివిభవంబు వెన్న నాస్థాణుశక్రు, లైన శక్తులుగారు మహావిభూతి
దనరి సురరాజధాని సుందరముగేలి, చేయుచున్న దటం చని చిత్రముదగ. 24

క. శ్రీమంతుఁ డైనరాముఁడు, ప్రేమను జెంగటకు బిలిచెఁ బ్రియగుణవంతున్
ధీమంతున్ హనుమంతున్, భీమాసురనిచయహరణపృథుబలవంతున్. 25

చ. అసితరశక్తివాయుసుతుఁ డంతట భక్తిచెలంగవచ్చి వే
డ్కను నతిచేసి రామ జనకామ మునీశమనోభిరామ పా
వనతరనామ దుష్టజనవైరివిరామ సుదామ రాఘవా
నను నిపు డేలపిల్చితి పన న్విని రాముఁడు పల్కె వానితోన్. 26

క. మారుతి సహస్రకంఠునిఁ, జేరం జని నీతిఁ జెప్పి శీఘ్రమె హాయమున్
శ్రీరామమూర్తి కొసఁగి య,పారసుఖం బనుభవింపు పాడియె నునుమీ. 27

మ. వినక న్వాడు తిరస్కరించిన యెడన్ వేగంబె నీశీర్షముల్
ఘనరామాస్త్రహతంబు లై విపులరక్తస్నిగ్ధతంగూలు భూ
మిని యుద్ధంబున నిక్క మిద్ది కనుమా మిథ్యోక్తియుంగా దటం
చని యాదైత్యునితోడఁ జెప్పి కడుధైర్యంబొప్పగా రమ్మటన్. 28

## హనుమద్రాయబారము

క. అని యానతిచ్చి పంచిన, మనమున నారాము దలఁచి మారుతి వెడలెన్
గనకమణిద్యుతవతికిని, జనుతికిం జిత్రవతికి సారసవతికిన్. 29

తే. వాయువేగంబుతోడను వాయుసుతుఁడు, నింగి కెగసి వియచ్చరు ల్నెరుపుమిగులఁ
దన్నుఁజూచి ముదంబునఁ దనరుచున్న, చిత్రవతిఁ జేరనరిగెను జిత్రమొదవ. 30

చ. చటులమణిప్రభాపటలశబ్దగణోన్నతహర్మ్యసౌధ దు
ర్ఘటపటుదైత్యరాజ్యగురుకల్పితయంత్రవితానగాఢవి

స్నటభటమాంత్రికప్రవర సాత్యకదంబ నికుంజపుంజసం
ఘటితవిహారయోగ్యతరు కమ్రమహీధ్రఘనంబు నై తగన్. 31

తే. శుద్ధపాథోధిపరిఘసుశోభితంబు, సప్తవరణాన్వితంబు ప్రశస్తకాంతిఁ
బరగిద్వాత్రింశదుత్తర ద్వారసంభృ, తంబు నిజభాగ్యజితసురతతిపురంబు. 32

క. అగుచిత్రపతిని వాయుఁజుఁ, డగణితబలుఁ డచటఁ జూచి యద్భుతపడుచున్
సుగమంబుగఁ దద్ద్వారము, దిగులొందక చేరి ధైర్యధీయుక్తిమెయిన్. 33

తే. చిత్రవర్ణఘుకాంగుఁడై చిత్రవర్ణ, రత్నగాంగేయమయశుక రమ్యతనువు
గల్గువానివిధంబునఁ గానఁబడియె, శ్వసనపుత్రుండు దుర్భర కార్యపరుఁడు. 34

క. వినువీధి తెలివునను సుర, ఘనసాలము లెల్ల వేగ గడచి ప్రమోదం
బున వానిముందు నిలిచియుఁ, జనిసౌధముమీఁదఁ జేరి చతురత్వమునన్. 35

చ. తనతనుకాంతులన్ దనుజుఁ దద్దయు మోహితచిత్తుఁ జేయుచున్
మన మలరార తెక్కలను మాటికిఁజూచునదువ్వి పల్కుచున్
జను మఱిపచ్చు బక్కనును సారెకుఁజూచుచు వేడ్క నీక్రియం
గనఁబడగీరరూపమున గంధవహాత్మజుఁ డందు గ్రుమ్మరెన్. 36

ఉ. మంత్రులఁ గూడి దైత్యపతి మానుగ నత్తఱిఁ గొల్వు దీరి యా
తంత్రపుఁ జిల్కరూపుని పతంగవరేణ్యుని సారెసారెకుం
జంత్రపుబొమ్మకైవడిని జక్కఁగఁ జూచి బలేయటంచు నా
తంత్రవిధిజ్ఞు తంత్రమును దాఁ గనఁజాలక లోహితాక్షునిన్. 37

క. కని యీశుక మెక్కడిదో, తన నెవ్వం డనుప నిట్లు తడయక నిటకుం
బనియేమి కలిగి వచ్చెనొ, చనికొని వృత్తాంత మరసి చయ్యన రమ్మా. 38

క. అనుటయు వాఁ డాదనుజుని, గని మ్రొక్కి తదాజ్ఞఁబూని కపటశుకంబున్
గని సంభాషణ చేయఁగఁ, జని మింట న్నిర్జరాళి జడియుచునుండన్. 39

క. మనమున రోషము బెనఁగొనఁ, గను ఘనకోపంబు నిగుడ గర్జించి వెసన్
మానుమత్సంజ్ఞికశుకముం, గనుఁగొని యిట్లనుచుఁ బలికెఁ గంజదళాక్షీ. 40

క. ఖగమా చిత్రపుశుకమా, సుగమంబుగ నీపురంబుఁజొచ్చితివి బళీ
పోగరా వేగమె పోరా, పగవా రిటుపంప రాఁగఁ బాడియె చోరా. 41

ఉ. ఎవ్వఁడు నీకుఁ దండ్రి కుల మెయ్యది వర్తితదేశ మెద్ది నీ
కెవ్వఁడు యంత్రిఁ జెప్పి యిట కెందులకంపెనొ భావ మెద్దియో
నివ్వెఱపాటుచెందక మె నిశ్చయ మంతయుఁ జెప్పు మియ్యెడం
గ్రొవ్వఁదగింతుఁ బల్కకయ క్రుమ్మరుచుండిన దుష్టకీరమా. 42

క. హరిపహ్నికాలనైఋతి, వరుణానిలయక్షరాజ ధవులం దెవఁడీ
పుఱిఁ జూచిరమ్మటంచని, పురణింపగ వచ్చి రావొ పోఁజాలవికన్. 43

క. హరికైన హరునికైనం, బరమేష్ఠికి నైనగాని బవరము నాతో
సరిపడి చేయఁగ వచ్చునె, సరివారలు నాకు లేరు జగతిం జూడన్. 44

తే. తివిరి దానవుఁ డీరీతిఁ దెంపుతోడఁ, బల్కి విని గంధవాహుని పట్టి పలికె
దొందమందునఁ గిన్క పెంపొంద నభ్ర, ఘోషనిభభాషణంబుల భీషణముగ. 45

క. భవదుక్తదిక్పతులయం, దెవఁ డనుపఁగ లేదు తమిని నే నీపురి పై
భవముం జూడఁగ వచ్చితి, దివిజారి యటంచుబల్కి దితిసుతుకడకున్. 46

క. చని నిజకాంతులు తద్దను,జునికొలువు నలంకరింప సొంపువలిర్పన్
దనుజులు దనుఁ గని బెదరఁగ, దనుజాధిపుఁ జూచి పల్కె ధైర్యస్ఫూర్తిన్. 47

క. మనుజాశన నారాకను, వినిపించెద విశదముగను వేడుకలూరన్
వినుము సుఖం బొనగూడును, ఘనతర మగుకీర్తిఁ గల్గుఁ గౌతుకమనురున్. 48

సీ. దశశతవదనాఖ్య దనుజేశ దశకంఠదానవసంహారి ధర్మకారి
దీనోపకారి ప్రదీపితగుణమణిహారి తురంగమయాగకారి
దంభినాటకసూత్రధారి యాదశరథరాజేంద్రసూనుండు రాఘవుండు
నీమీఁదఁ గృపగల్గి నీతిబోధింపంగ నను బంప వచ్చితి నయవిదూర

తే. వసుధ హనుమంతుఁడనువాఁడ వాయుసుతుఁడ, భానుపుత్రునిసచివుఁడ భానుకులుని
మఖహయంబును దూతచే మాయచేసి, వేగ తెప్పించి దానివిధ మెఱింగి. 49

క. గురుకోప మగ్గలింపఁగఁ, దురగాధ్వరఘాతి వైనదుశ్శీలు నినున్
ధరదూరిన దివికేగిన, సురలడ్డం బైనఁబట్టి స్రుక్కింపంగన్. 50

క. కరివరకరగురుతరకర,శరచాపధరుండు నగుచు సమర మొనర్పన్
భరతాదిసోదరులతోఁ, బరివృతుఁ డై వచ్చినాఁడు పరికింపు విభున్. 51

తరువోజ. నిరుపమతేజులు నిత్యాభ్యుదయులు నిపుణబలాఢ్యు లజేయులు నా
తరుచరనాథులు తరులం గిరులం దాల్చి కరమ్ముల దర్పముతో
దుర మొనరింపఁగఁ దోడ్పడిరాఁగను దోర్బలయుక్తుఁడు వీరుఁడు నా
తరుచరనాథుఁడు తరమిడి నీపురి దగ్గరనున్నాఁడదె కనుమా. 52

క. చలమునఁ బటుతరదానవ,బల మిరుగడలందు మిగుల బలసియుఁ గొల్వన్
జ్వలనార్కు మాడ్కి వచ్చెను,బలుఁడు విభీషణుఁడు బాహుబలసంయుతుఁ డై. 53

శా. వీరాగ్రేసర సైన్యసంయుతులు నై వీరందరీవేళ దు
ర్వారాయోధనకాంక్ష నీపురసమీపంబందు శోభిల్లుచు
న్నా రారాముఁడు నీకు నీతిగఱప న్నన్నంపఁగా వచ్చితిన్
వీరు న్మెచ్చుచునుండ మాటవినరా విజ్ఞానమున్ బూనరా. 54

## హనుమంతుఁడు సహస్రకంఠునికి శ్రీరామమహిమఁ జెప్పుట

తే. లోకనాథుఁడు నిజభక్తలోలుఁ డైన,రామచంద్రుని కీవు తురంగమంబు
నిచ్చి బ్రతుకుము కాదంటివేని బాణ,తతుల నీశీర్షముల నెల్ల ధాత్రిఁ గూల్చు.

మ. విమలాచారుఁడు రామచంద్రుఁడు మహావిఖ్యాతగాథుండు భూ
రమణుం డాతఁడు కాన భక్తిగను మిత్రత్వంబు పాటింపుమా
కమలిస్తోమముఁ గూల్పఁగా దశరథక్షోణీశుగర్భంబునన్
సుమనఃప్రార్థితుఁడై జనించె దనుజుల్ సుక్కంగ దాఁ బుత్రుఁడై. 56

క. వేదాంతవేద్యుఁ డక్షరుఁ, డాదిమపురుషుండు వాలియాగపరుండున్
శ్రీదయితుఁడు రఘురాముఁడు, సాదరమతితోడఁ బోచు శరణన్న నినున్. 57

ఉ. నీకు హితంబుఁ జెప్పితిని నిర్మలభావముఁ బూని సుస్థిర
శ్లోకుని బుణ్యమానసుని సుందరగాత్రుని రామచంద్రునిం
బ్రాకటభక్తిమీఱఁగను బ్రస్తుతిఁ జేయుము పాపకర్మముల్
లేకువతో నశించు నిఁక దివ్యసుఖాత్ముఁడ వౌదు వంతటన్. 58

క. అని మారుతిపల్కిన విని,మనమున రోషంబు మిగుల మల్లడిగొనఁగన్
దనుజాధినాథుఁ డయ్యెడఁ, గను లెఱ్ఱగఁ జేసి పలికెఁ గపివర్యునితోన్. 59

క. ఏరా వానర చాలుర,శూరాగ్రేసరుఁడ ననుచుఁ జూపెద మటివి
స్త్రీరావహము భవన్త,మారా భయ మేమిలేక యసురుల మ్రోలన్. 60

తే. హితము బోధింపవచ్చితి వింతెచాలుఁ, బొమ్ము తుయ్యెడకను నీవు సమ్మతిగను
నప్తి నే నియ్యనని రామచంద్రుతోడఁ,బల్కరా వానరాధమ పల్కు లేల. 61

క. తెలియక వచ్చిన నియ్యెడఁ,గలచిత్రము లెల్లఁజూచి కదువడిఁ బొమ్మా
బలు లగుదనుజులు చూచిన;నిలఁ గూల్చెద రకట నిన్నుఁ బ్రభుకోపమునన్. 62

సీ. మరుదాత్మజా రామమహిమ నామఃందఱఁ బలుమాఱు పొగడంగఁ బాడియగునె
నరుఁ డేడ నేనేడ నాశక్తియొక్కడ సరసిజాసనుచేతఁ జాలవరము
లను బొందినాఁడను ఘనబాహుబలుఁడను సమరంబులోపల సకలదేవ
గణముల నోడించి ఘనతకెక్కినవాఁడ భూపాలకులఁ బట్టిపుడమిఁ ద్రొక్కి
తే. జయమునొందితి నాకన్న శౌర్యధైర్య, సాహసంబులు కలవాఁడు జగతి లేఁడు
పొమ్ము శ్రీరాముకడ కీవు పోకమసలి, నిలిచియుండిన జంపింతు నిజము నిజము. 63

క. అనికఠినోక్తుల నాడిన,దనుజాధిపుఁ జూచి శ్వసనతనయుండు పలికెన్
మనుజాశన రఘురాముని, ఘనమహిమ నెఱుంగ కీవు గర్వముతోడన్. 64

తే. విఱ్ఱవీగుచునున్నావు వెఱ్ఱివాని, బోలి దుష్టాత్మ రాముని బుణ్యశీలు
నెఱుఁగవా యోరి దశకంఠ నిలను గూల్చినట్టి దేవుఁడు జగదీశుఁ డక్షరుండు. 65

క. రామాగ్నిని పడిఁగట్టితి,వీమహి శలభంబురీతి నీల్గుదు వకటా
యేమందు విధికృతంబని, నామదికిం దోఁచె నిపుడు నాకేశారీ. 66

ఉ. రాముని దూలనాడగను రాక్షసనాయక ధర్మశాలి యా
స్వామి పరాత్పరుండు మునివంద్యుఁడు చిన్మయరూపకుండు న

ద్ధాముఁడు సత్యపాలకుఁ డుదారపరాక్రమశౌర్యసాహస
స్తోముఁడు కాని మానవుఁడె చూడఁగ నీ కతఁ డిట్లు దోఁచెడిన్. 67

క. మనుజాశనుఁడవు ద్రోహివి,మునిజనహంతకుఁడ వీవు మూర్ఖుఁడ వటుగా
వున హితవచనంబులు నీ,కనుకూలము కావు వికటమగుగా కెలమిన్. 68

తే. బ్రహ్మవ్రాసినవ్రాతను జిమ్మివేయ, నేర రెవ్వరు నీ వెట్లునేర్తు విపుడు
కుడువు తత్కర్మఫలమును గొదువలేక, కీడుమూడెడి తఱి నీకు దోడుకూడె. 69

ఉ. లోకములన్ని గెల్చి జయలోలమనస్కుఁడవైతి వింద్రియా
నీకమనంబులం గెలువనేరకయుండినవాఁడ వక్కటా
భీకరతద్విరోధులను భేదిలఁ జేయఁము జీవరాశిలో
నీ కిఁక వైరిలే డొకఁడు నిక్కము భూతలమందుఁ జూడఁగన్. 70

క. పాలింపుము చిత్తము ను,న్మాలింపుము దుష్టకర్మముల నీవేళన్
జాలింపుము భవకామము,గీలింపుము రాము మదిని గేశవరూపున్. 71

మ. హరి శ్రీరాముఁడు గాని వేఱగునె దైత్యాధీశ సర్వేశుఁ డా
ధరణీపాలునిఁ జేరి వేఁడుకొనుమా దైత్యారి నిన్గాచు దు
ర్నరకప్రాప్తుఁడు వైనఁదన్నుఁ దలఁప న్నానాశ్రమల్బాపుచు
న్నిరతానందము వారి కిచ్చి దయతో నిత్యంబు రక్షించెడిన్. 72

ఆ. కర్మ మిట్లు నిన్ను గారింపుచుండఁగ, దైవభక్తి యెట్లు దాల్పనగునె
పోర నిన్నుఁ జూడఁ బుణ్యంబు చెడిపోవు,నఘమువచ్చు నరకమబ్బు నిజము. 73

సీ. సుతుల వాల్గంటులఁ జుట్టాలఁ దమ్ములఁ జూడుమా యిఁకమీఁదఁ జూడలేవు
కొమ్మలరెమ్మలఁగొమరొప్పు పువ్వులు గలిగినతావుల గలసి వీచు
పయ్యెరగల పూలవనములఁ బూఁబోండ్లతోఁడఁ గ్రీడింపుము తుష్టిమిగుల
మేడలనీడల మిగులసౌఖ్యంబులఁ దేలుము దమిదీర బాళిమెఱసి

తే. హరిహరులు నీకుఁ దోడైన నని శరాళి, జాలిఁబెట్టుచు నినుఁగూల్చు జగదధీశుఁ
డైన శ్రీరామభద్రుఁ డో యసురనాథ, నీకుఁ జెడిపోవుకాలంబు నేఁడు వచ్చె. 74

క. రామాక్షరయుగళము నీ,భూమిని చెవ్వాఁడు తలఁచు బుద్ధి న్వానిన్
ఏమరక కాచు రాముఁడు, కామితఫలముల నొసంగి కరుణామతి యై. 75

శా. కంఠోపాధిగ నీతిఁ జెప్పి తసురా గర్వంబుఁబోనాడి వై
కుంఠాధీశు జగేశుఁ గొల్వు మిఁకఁ జేకూరున్ శుభం బంత వై
కుంఠుం డారఘురాముఁ డీశ్వరుఁడు నీకుం దోడు వై కాచెడున్
కుంఠీభూతమనంబు లేకిపుడు నీ గోప్యార్థమూహింపుమా, 76

క. వీరా రాముని వేఁడఁగఁ,బోరా యని నేనుఁ జెప్పఁ బో నను టరయన్
శ్రీరా మోకాలొడ్డిన, వారికి సరి నీవు కావె వసుధాస్థలిలోన్. 77

క. భక్తాధీనమనోంబుజు, భక్తార్తివిదూరు ధీరుఁ బరహితకారున్
నక్తంచర సేవింపుము, ముక్తి కరామలక మగుచు ముదమొనరించున్. 78

సీ. దనుజ హిరణ్యాక్షదానవుఁ డిల్లఁడే హరివైరమునఁ దొల్లి యవనిలోనఁ
జెనటి హిరణ్యకశిపుఁ డనిఁ జావఁడే హరివైరమునఁ దొల్లి యవనిలోనఁ
బెక్కురక్కసులెల్ల జక్కుఁగా మడియరె హరివైరమునఁ దొల్లి యవనిలోనఁ
బరమాత్ముఁ డగురామభద్రుచే మ్రగ్గరె రావణముఖదైత్యరాజు లిపుడు

తే. కానఁ బంతంబుతోఁ బగఁ బూనవలదు, వైరమూనినవా రంత పడినపాట్లు
నీకుఁ దెలియక యారీతినిష్ఫలంబు, సైనకార్యంబు దలఁచితి వదియుఁ దగదు. 79

తే. సర్వజగములు తనకుక్షి సంభ్రమింప, సకలభూతాంతరస్థుఁడై చాలవెలుఁగు
చిన్మయాకారు సజ్జనచిత్తచోరు, భక్తమందారు నతజనపాపదూరు. 80

క. పావనరూపుని దశరథ, భూవల్లభసుతుని భవ్యపుణ్యుని ఘనునిన్
భావంబున నూహింపుము, కావరమును మాని యింకఁ గదలనిభక్తిన్. 81

ఆ. అతనిపాదధూళి యాతాయి సోఁకిన, నాతి యగుచు వెలిఁగె భూతలమున
దీనజనులపాలి దేవుఁడు భూపుఁడు, రమ్యచరితుఁ డతఁడు రాక్షసేశ. 82

క. మును రావణు బిగబట్టుచు, ఘనవార్ధుల ముంచిముంచి గారించిన భా
నునిపట్టిపగతు నొకకో, లను గూల్చిన మేటిమగఁడు లలిమీఱంగన్. 83

క. పలుమఱుఁ జెప్పితి రాముని, విలసితమహిమాతిశయము విన వెందుకురా
చలపాదితనము వలదుర, కులనాశన మేల చేయఁ గోరుట మేలా 84

క. అని నీతిఁగఱపు మారుతి, వినయసుధాభాషణములు వీనులఁ జొర వాఁ
డనలుని మాడ్కి న్వెలుఁగుచు, వనజాయతపత్రనేత్ర వారనికిటుకన్. 85

చ. పటపటఁబండ్లు గీటుచును బాహులఁదట్టుచు హుంకరింపుచున్
నిటలతటంబునం జెమట నిండఁగఁ గన్నులనుండి నిప్పుకల్
చిటచిటరాల గోత్రనిభశీర్షసహస్రము నూచియూచి ది
క్తటములు మ్రోయ నిట్టనియె గంధవహాత్మజుఁ జూచి క్రమ్మఱన్. 86

తే. రామశబ్దంబు కొమ్మకు రమణఁ జెలఁగు, నాతఁడతిశయుఁ డెట్లగు వాతపుత్ర
నరుఁడు నాకంటె బలుఁడని నాదు మ్రోల, బట్టువిధమునఁబొగడంగఁ బాడియగునె.

శా. నాకంటెన్ ఘనుఁ డొక్కఁ డీపుడమి నున్నాఁడొక్కొ దిక్పాలకా
నీకం బెప్పుడు నాప్రతాపమునకు న్నిల్వంగ లేకుర్విపై
జీకాకుంబడి కుందుచుండ నరుఁ డౌ శ్రీరాముఁడా పోరిలో
నాకుం గీడొనఁగూర్పఁ జాలునె బళీ నాకీడె వాఁ డున్నతిన్. 88

శా. నీకేలాభమువచ్చు దౌత్యమున నో నీచాత్మ చాల్చాలు నీ
రాకం జూడఁగఁ జోద్యమయ్యె నిపుడున్ రక్షోవరుల్ ధైర్యను

సహస్రకంఠ—పే

ళ్లోకు ల్లేరె ధరిత్రిఁ గొల్వఁగను నీచుం రాముని స్వానవా
నీకాధీశునిఁ గొల్వనీకుఁ దగునే నిష్ఠారతిన్నిత్యమున్. 89

తే. దుర్జయులు నైన ఖరారులు దురములోన, నన్నుఁబోఁడఁగాంచి భీతిచే నాల్గుకడల
తేగుచున్నారు నాశక్తి నెఱుఁగ వీవు, పల్కితివి బుద్ధిలేమినిఁ బారిపోరా. 90

క. నను గొల్చియుండు వానర, ఘనతరసౌఖ్యం బొసంగి కాచెద నిన్నున్
విను నాశక్తిని జెప్పెద, జనపాలురకన్న మిగుల సాహసపరుఁడన్. 91

తే. తరణి నాయాజ్ఞచే నొండ ధరణిఁ గాచు, నిశల రేవెల్గు వెన్నెల నెగడఁజేయుఁ
గాని తమశక్తిచేతఁ బ్రకాశమొంది, మెలఁగఁ జాలరు వారలు మిగిలి నన్ను. 92

శా. ఏరావానర మానవాధములిలో నే సంధిగావించినన్
శూరుల్ నన్గని సీయటంచనరె యీక్షోణీస్థలి న్నవ్వుచున్
ఘోరారణ్యముదూరినం జలధిలో గోప్యంబుగా దాగినన్
ధీరత్వంబునఁ బట్టి రాఘవుని నే దంపొప్ప సాధించెదన్. 93

చ. అని కఠినోక్తులాడి మఱి యంతవివేకము బుద్ధిఁబూని వాఁ
డనితరసాధ్యభక్తియుత మైనమనంబున వాయుపుత్రుతో
వినయముఁ దోఁప నిట్లనియె విశ్రుతతేజుని రామచంద్రుని
న్మనమున నే నెఱుంగుదును మారుతి చెప్పఁగనేల బల్మియున్. 94

క. జగదన్వయరూపుఁడును, జగదేకశరణ్యుఁ డమితసద్గుణగణ్యుం
డగణితతత్త్వాతీతుఁడు, నిగమాంతవిచారపరుఁడు నిష్కాముఁ డొగిన్. 95

తే. మూఁడుమూర్తుల కవ్వలిపురుషుఁ డతఁడు, గోప్యభావుండు వాచామగోచరుండు
భువనవందితతేజుఁడు భూరిబలుఁడు, చిత్ప్రకాశుఁడు బుధవర్గసేవితుండు. 96

క. నిరుపాధికుఁడు నిరీశ్వరుఁ, డరిమర్దనపరుఁడు ప్రత్యగాత్ముఁడు మాయా
కరుఁడు నిరంజనుఁ డతులుఁడు, కరుణాకరుఁ డినకులుండు కరువలిపట్టీ. 97

ఆ. తాతయగుచు లోకతతిని బుట్టించును, వెన్నుఁడగుచు వాని వేడ్కనేలు
మిత్తిగొంగ యగుచు మ్రింగు నన్నింటిని, ద్రిగుణమూర్తి యిట్లు దేజరిల్లు. 98

క. ప్రళయంబున వటవృక్షపు, దళమున సూక్ష్మస్వరూపధారియు నగుచున్
గళలిరులు గొనఁగనుండును, గళదొరుగక గమలమందు గమనీయగతిన్. 99

చ. ప్రతియుగమందుఁ గోవిదుల బాగుగ నేలను దుష్టవారమున్
క్షితితలభారముం దొలఁగఁజేయను శ్రీధరుఁడోజదీక్షమై
బ్రతినవహించి మానవుని భంగి జనించెను రామచంద్రుఁడై
హితమతి నే నెఱుంగుదు మహేశ్వరుచిత్రము గొంతబుద్ధిలోన్. 100

క. బూటకముగాదు మునుహరి, మాటయొకటి నాకుఁ జెప్పె మదినద్దానిన్
నాటం గొలె దలఁపగ, నేటికి నది ప్రాప్తమగుచు నెగడుటచేతన్. 101

క. కని తద్వాలిం గైకొని, ఘనవైరము బూనినాఁడ గదనములోనన్
ఇనకులుఁడు నన్నుఁ జంపును, జననములే దింక నాకు జగతీస్థలిపై. 102

ఉ. పావని వెఱ్ఱిమాట లని భావన చేయకు కార్యభాగమున్
భావములోఁ దలంచు నగుఁ బల్కుటఁ జెప్పఁగ నేల మర్మమున్
గావర మొప్పఁగా నిపుడు కాఱులు చెప్పినవాఁడఁ గాను నీ
గావర మొప్పఁగా నిపుడు కాఱులు చెప్పినవాఁడఁ గాను నీ
త్రోవను బొమ్ము మేలగును దొందఱ గానని పల్కె వెండియున్. 103

తే. తనవివేకపుమాటలఁ దాచి కినుక, గొట్టుపట్టిని బోఁడఁగాంచి కూర్మి విడిచి
కాలభానునికైవడి గనుల నిప్పు, కణములును రాల భాషించెఁ గమలనేత్ర. 104

క. ఎవ్వఁడు రాముం డెవ్వఁడ, వివ్విధమున నీవు నాకు హితమెఱిఁగింపం
గ్రొవ్వడగించెదఁ బోరిపోరి, నివ్వగతోఁ బలుక కింక నేగుము త్వరగన్. 105

ఉ. వానర మాటలేమిటికి వారిజనేత్రుఁడు నైనరామునిం
గానఁగ రాను యాగతురగంబును జంపను బోరిలోన నా
మానవనేశతో నెదిరి మాన్యులు మెచ్చఁగఁ బోరొనర్పఁగాఁ
బూనినవాఁడ నీవిధముఁ బొందుగ నాతని కీవు తెల్పుమా. 106

### { సహస్రకంఠుఁడు తనభటులచే నాంజనేయునిబట్టి కొట్టుఁడని యాజ్ఞాపించుట }

మ. అని గంభీరముగాఁగఁ బల్కి నిజదైత్యానీకముం జూచి యీ
చెనటి న్మీరలఁ పట్టి కొట్టుఁడనుచుం జెప్పంగ వారంతటన్
దనుజాధీశ్వరు నాజ్ఞఁ బూని గుములై దర్పించి ఘోరాకృతుల్
దనరం జుట్టునుముట్టఁ గన్గొనుచు నుద్యత్క్రోధ మొప్పారఁగన్. 107

తే. కాలరుద్రునికైవడి గాలిముద్దు, పట్టె దితికశ్యపులకును బుట్టినట్టి
వాని దశశతవదను నవార్యబలునిఁ, జూచి తలయూచి రౌద్రంపుఁజూడ్కులలర.

క. శుకరూపు వదలి మింటికిఁ, బ్రకటితగతి నెగిరిపోయి రయమునఁ దన్మ
స్తకముల సకిరీటంబుల, వికలంబులుగాఁగఁ దన్ని పృథివిం ద్రోచెన్. 109

ఉ. అంతటఁ బోక వాని సకలాంగవిరాజిత భూషణంబులన్
వింతగఁ బిండిచేసి భువి వేగమె త్రోసి కడంగి స్తంభమున్
బంతమెలర్పఁగాఁ బెఱికి బాహుల మూఁపుల జానుజంఘలన్
సంతస మొప్పఁగాఁ జదిమి శౌర్యము ధైర్యము మీఱనుండఁగన్. 110

క. కని లోహితాక్షుఁడాదిగ, ఘనరాత్రించరులు కోప కలితాత్ములునై
యనిలజు నీక్షకు నోర్వక, మనముల రోషంబు మిగుల మల్లడిగొనఁగన్. 111

తే. పరిఘముద్గరతోమర బహుళకుంత, ములను మారుతి నొప్పించి మోహరించి

భీషణంబుగ బాణము ల్వేసి పేర్చి, యార్చిరి కడంగి యురవడి నని౯ జెలంగి. 1

ఉ. తెమ్మెరముద్దుపట్టి కడుధీరతఁ గాలుని మాడ్కి రేఁగి శీ
ఘ్రమ్ముగ వాల మెత్తి రిపుకంధరసంధులఁ జుట్టి త్రిప్పి యొ
క్కుమ్మడి నబ్ధివై వగను గొందలమందుచు వారు లేచి సం
ఘమ్ముగఁ దాఁకి మూఁగి శరకాండము లేసి యదల్చి ధీరతన్. 11

క. బిట్టల్క వాయుపట్టిని, బట్టి వడిం ద్రిప్పి పైకిఁ బటుగతి నేయన్
దిట్టరియై వినుతెఱువున, నట్టె రఘుప్రవరుఁ జేర నరిగి సభక్తిన్. 11

ఉ. శ్రీకరరామపాదసరసీరుహయుగ్మము సోఁక శీర్షముం
గోరికఁ జేర్చి మ్రొక్కి రఘుకుంజర నీవనుపంగఁ బోయి యా
భీకరరూపదానవునిఁ బ్రీతిగఁ జేరి నయోక్తుల న్వెసన్
బ్రాకటయుక్తి జెప్పితిని బద్మవిలోచన లోకపాలనా. 11

తే. పంపిపన్నిరుమెచ్చనిపగిది వాఁడు, పల్కులను జెవిఁ బెట్టక పంతమూని
పీతి నీయను శ్రీరామ విభునితోడ, నాల మొనరింప వచ్చెద ననుచుఁ బలికె. 11

క. నను బట్టి కొట్టుఁడని ఘన, దనుజుల వడిఁబంపఁ జూచి ధైర్యముతో వా
రినిఁ జంపి వాని బొమిడికె, లను ధరపైఁ గూలఁదన్ని లావొప్పంగన్. 11

ఆ. వానిమేను నలియఁగాను వేగమె తన్ని, దనుజులార్వ మింటిదారిఁ బట్టి
వచ్చినాఁడ దేవ వానిగర్వముఁ జెప్పఁ, నలవిగాదు నాకుఁ బలుకులేల. 11

క. గట్టిగఁ జావుం గోరియుఁ,జుట్టింగట్టుకొని యూఁగుచున్నాఁ డనిలోఁ
గట్టల్కతోడ వానిం,బట్టివధింపుము మహోగ్రబాణావళిచేన్. 11

గీ. తెలివిగలవానివలె నిన్ను దివ్యభక్తి,చేత నొక్కింతవడి నుతిఁ జేసి చేసి
మఱిడి క్రోధంబు రెట్టించుమనసుఁగలిగి, నిందఁ గావించె నెందుకో నృపలలామ. 120

శా. గర్వగ్రంథుని పాపసంఘునిలయుం గాపట్యచారిత్రునిన్
యుర్విం గూల్చి సమస్తదేవతల నత్యుత్సాహసంపన్నగాం
భీర్యల్గాఁగను జేసి ప్రోవు జగము ల్వేడ్కం బ్రవర్తింపఁగా
నుర్వీనాయక చేయుము ద్దవడితో నుర్వీశ్వరు ల్మెచ్చఁగన్. 121

క. హితవాక్యసమితి జడమతి, కతివిప్రియకరములగుచు నవనిఁ జెలంగున్
మతిమంతుఁ డతిముదమ్మున, సతతము నద్దానిఁ జూడఁజాలు హితముగన్. 122

క. అనిపల్కిన విని రాముఁడు, ఘనతరకోపంబు నిగుడఁ గ్రవ్యాదగణే
శునిఁ దద్బలముం గూల్పఁగఁ, వనచరులం బంప నెంచి వారనికినుకన్. 123

చ వినయవివేకధుర్యులును విశ్రుతశౌర్యులు నై చెలంగు నా
ఘనసుతముఖ్యవానరుల నేర్పడఁ గాంచి కపీంద్రులార యా

దనుజుల నెల్ల మీ రిపుడు దారుణయుద్ధమునందుఁ గూల్పఁగాఁ
జనుఁ డని యాజ్ఞ చేయఁగను సాహస మొప్పఁగ వారలంతటన్. 124

మ. మనుజాధీశునియాజ్ఞఁ బూని వివిధత్వాభాగముల్ వ్యగ్ర నా
దనుజాధీశుపురంబుఁ జేరి పటిమన్ దర్పించి కూటంబులన్
గని పైకెక్కి యుదారసాలతతుల న్గంభీరతం దాఁటుచున్
ఘనసింహధ్వను లెల్లదిక్కు లదరంగాఁ జేసి రత్యుద్ధతిన్. 125

చ. వనచరసింహనాదము నవార్యముగా విని కోపఘూర్ణితా
ననుఁడయి రాక్షసాధిపుఁడు నాగనభశ్చరు లెల్ల భీతిలం
గని శిఖరాగ్రసంస్థితులఁ గౌతుకయుక్తుల వానరేంద్రులం
గనుఁగొని లోహితాక్షుఁడయి గర్వముమీఱఁగఁ జాల నుగ్రుఁడై. 126

క. చిల్లప్రాయులఁ గాఁగవి, వల్లభదానవులఁ దలఁచి వడిఁ గరములచేఁ
దల్లడిలఁ బట్టి వారల, నల్లారం ద్రిప్పి వైచె నటునిటు పడఁగన్. 127

తే. వానికరములు దగిలినవారిలోనఁ, జిక్కికొందఱు నలిగిరిచేష్టదక్కి
కొంద ఱబ్ధి మునింగిరి కొంద ఱభ్ర, వీథిఁ దిరిగిరి పార్వతీ విపులభీతి. 128

క. కొందఱు కొందలపాటునఁ, గుందుచు నద్రిశల కేగి గురుతరదుఃఖం
బందుచు నుండిరి కొందఱు, సందియపడుడెందములను జడిసిరి వ్రేల్మిన్. 129

ఉ. ఆదనుజాధినాథుని వరానుచరాసురవార మయ్యెడన్
మేదిని దల్లడిల్లఁగను మించి పురంబును నిర్గమించి దు
ర్వాదముతోడఁ జేర్చి గజవాజిరథంబుల నెక్కి విస్ఫుర
న్నాదము లొప్ప నేగిరి ఘనంబుగ నాలముచేయ నయ్యెడన్. 130

ఆ. కదలి రాఁగఁ జూచి కరువలిపుత్రుండు, భానుసుతుఁడు వాలిపట్టి తార
గవయనీలశరభ గజగవాక్షాదులు, పర్వతద్రుమములఁ బట్టి వెలుచ. 131

చ. కరముల నప్ఫళింపుచును గంతులువైచుచు హుంకరింపుచున్
జురచురఁ జూచుచున్ సకలసుందరహర్మ్యము లెల్లఁ గూల్చుచున్
గరితలిమీఁది కేగు హరికాండముల ట్లసురాళిపైకి భూ
వరపతి యాజ్ఞ నీయఁ గని వానరవీరులు వచ్చి రుగ్రతన్. 132

## వానరవీరులు రాక్షసులతోఁ బోరుట

క. జ్వాలాముఖుతో నినసుతుఁ, డాలము చేయంగఁ బూని నాలోఁ బెలుచన్
ఆలోహితాక్షుపైఁ బడి, వాలిసుతుం డదరెఁ బోర వఱలెడికినుకన్. 133

క. గురువిఖ్యాతబలోన్నత, వరశౌరుషశాలి యైన వాయుజుఁ డలుకన్
సొరిదిగ రక్తాక్షునితో, దుర మొనరింపంగఁ జొచ్చి దోర్బల మొప్పన్. 134

తే. వాల మంకించి శత్రుదుర్వారశక్తిఁ, గాలుకైవడి భాసిల్లి కదనమందుఁ
దీక్ష్ణదంష్ట్రుని సమయింపఁ దివిరి వేగ, నీలుఁ డరిగెను బార్వతీ నేర్పుమెఱయ. 135

ఉ. ఒండొరు లాత్మలోన జయమొందఁగఁ గోరి దురంతచింతతోఁ
ఖండన మట్లు చేయుతఱి వానరవీరులు వృక్షజాలముల్
గొండలు దెచ్చి రక్కసులగుండెలు డొల్లఁగ వ్రేయ రక్కసుల్
చండశరాస్త్రజాలములఁ జయ్యనఁ గప్పిరి వారి నుద్ధతిన్. 13

క. ఆయెడ జ్వాలాముఖుఁ డా, తోయజహితపుత్రుమీఁదఁ దూపులు వెలుచం
బాయక వైచెను నేర్పున, నాయెడఁ దమవారు చూచి యానందింపన్. 13

తే. వానినారాచముల భానుపట్టి నడుమఁ, బాదపంబులచే నేలపాలుచేసి
వెండియును బాదనఖముల విపులరక్త, ధార లొల్కఁగఁ గావించె దనుజు మేన. 13

తే. ఉగ్రబాణాళి రక్తాక్షుఁ డురవడించి, గంధవాహాత్మజుని నేసి గాసిచెంద
నతులబలశాలి లోహితాస్యాసురుండు, వానిపుత్రుని గాఱించె బాణతతుల. 13

క. లీలమెయి వజ్రదంష్ట్రుఁడు, కాలానలతుల్యకాండగణములచేత
న్నీలుం గప్పెను జలధర, జాలము పర్వతముఁ గప్పుచాడ్పున నంతన్. 14

క. తారానాథుఁడు నీలుఁడు, మారుతి తారాసుతుండు మహితోద్ధతులై
ఘోరాద్రుల వేర్వేఱుగ, వారించిరి దనుజశస్త్రవారముల వడిన్. 14

సీ. అంత జ్వాలాముఖు నని లోన సుగ్రీవుఁ డడుగులఁ గడువడి నవనిఁ బడఁగ
దన్నినఁ దత్పాదతాడితుఁడై వాఁడు వజ్రహతాద్రికైవడిగఁ బడియె
నాఖండలుని పౌత్రుఁ డద్భుతశౌర్యుని లోహితాక్షునిఁ గూల్చె సాహసమున
గడఁక రక్తాక్షుని కంధరమును వాలమునఁ జుట్టి పవమానపుత్రుఁ డలుకఁ

ఆ. త్రిప్పి మిన్నుదాఁకఁ జెంపుతో వైచిన, నభ్రవీథినుండి యవనిదాఁకి
చూర్ణ మయ్యె వాఁడు సురమును లార్వంగ, దనుజగణము చూచి తల్లడిల్ల. 14

క. గరుత్మంతుఁడు సర్పముఁ, జరణంబులఁ దన్ని పట్టుచాడ్పున నీలుం
డరిదైన వజ్రదంష్ట్రునిఁ, జరణకరంబులను బట్టి శౌర్యస్ఫూర్తిన్. 1

ఆ. గొప్పతాళ్ల వెనుకగుదియించి మొత్తిన, నెత్తిపగిలి గ్రుడ్డు వత్తినట్లు
వెడలి నేలఁ బడఁగ వేగంబె రక్తంబు, వాతదొరఁగ మ్రగ్గె బాధపడుచు. 1

ఉ. వీరులు వానరర్షభులు వీఁకను రోషపరీతచిత్తులై
యారుధిరాశనానుగతులైన సురారులమీఁదికి న్వి
స్తారమహీధ్రవృక్షములఁ జయ్యన వైచి నిరస్తజీవులం
గా రణమం దొనర్చిరి నికామజయోత్కటవృత్తి నంతటన్. 1

క. హతశేషులైన రాక్షసు, లతిభయమునఁ బాఱి రాక్షసాధీశ్వరు పా
దతలమున కరిగి శోకా, యతచిత్తులు నగుచుఁ బల్కి రతిభీతిమెయిన్. 1

మ. దనుజేశా భవదాజ్ఞఁ బూని దనుజు ల్దర్పించి కీశాళితోఁ
బెనఁగ న్వారలు రౌద్రమూర్తులగుచుం బిట్టల్కఁ బోరాడి మే
దిని యుష్మద్బలనాశనంబు గడిమిన్ దీపింపఁ గావించి వా
రనిశోషంబున దుర్జయాత్ములగుచున్ రాజిల్లుచున్నారొగిన్. 147

క. కనిభీతి నేము సంగరమును విడిచి భవత్ప్రకాశమునకుం ద్వరగాఁ
జనుదెంచినాము నేటికి, వనచరులకు జయము మిగులవాటిల్లె విభూ. 148

తే. కన్నవారము గా మిట్టి కదనసరణి, విన్నవారము గామయ్య వింత దొల్లి
యెన్నఁ జాలము కీశగణేశుబలిమి, నేమి కష్టంబు మనవారి కిప్డు పుట్టె. 149

క. హరి సర్వదేవతలు నీ, పురిఁ జూడఁగ రారు భీతి పొదలుచునుండన్
దురమొనరింపఁగ నురవడిఁ, దరుచరసంఘంబు వచ్చెఁ దరుగని శక్తిన్. 150

క. కలనైన నిట్టిసంగతి, గలుగుట లేదయ్యెఁ జూడఁగా విధిచేతల్
బలవత్తరము లటంచని, దలపోయుచు వచ్చినాము దానవనాథా. 151

ఉ. వానరరూపులై దివిజవర్గము లెల్లఁ గడంగి కోపమున్
బూని భవద్బలంబు చెడిపోవఁగఁ జేయఁగ వచ్చినట్లుగాఁ
గానఁగ నయ్యె నేమగునొ కార్యము ముం దికనైన వీరల
న్నానుగఁ బట్టి చంపు మనుమానములేక జయంబుచేకురున్. 152

## సహస్రకంఠుఁడు యుద్ధమునకు వెడలుట

చ. అనుటయుఁ దానవుండు ప్రళయార్కతనూభవుఁబోలి యుగ్రుఁడై
కనుగవ నిప్పుక ల్గురియఁగాఁ గపివర్గపుఁజేఁత లెల్లఁ దా
విని పురిపాటు చూచి కడువేగమె కుందుచు వేడ్కలేక తీ
రనివ్యథతోడనుండి మదిఁ గ్రమ్మఱఁ జింతిలసాగె భామినీ. 153

ఉ. అంగద కీశపుంగవులు హర్షముమీఱఁగ వచ్చి యుత్తరిన్
సింగము లెట్లు గారడవిఁ జిక్కిన నాగబలంబుఁ గూల్చున
బ్భంగి నభంగబాహుబలబంధురదానవపుంగవావళిన్
సంగరమందుఁ బొంగడఁపసాగిరి కర్మము రిత్తపోవునే. 154

తే. ఐనఁగానిమ్ము నాశక్తిననిఁ దెలంగఁ, జూపి సురలెల్ల దివినుండి చోద్యపడఁగ
రాజరాజులు జనములు రాక్షసులును, బ్రస్తుతింపంగ నీవేళబలము మెఱయ. 155

ఉ. శ్రీరఘురామభూవిభునిఁ జేరి దురం బొనరింతు నంచు దు
ర్వారరణాభిలాషు లగురాత్రిచరు ల్పదికోట్లు వెంబడిన్
గోరి సమున్నతి న్నడువఁ గుంభిని సర్వము సంచలింప భూ
భారము ప్రోయఁ దిగ్ద్విరదవారము బెగ్గడిలంగఁ బెల్లునన్. 156

ఉ. వేకువ లేచి నిత్యమును వేడ్క నలించెడి భృత్యవర్గముల్
భీకరవిక్రమాదులను బెంపుగ వర్ణనచేయువందులున్
లేకువ వంశనాథులను దేవరఁ దేవతు వేదుమాగధుల్
శ్రీకరమంగళాచరణశీలురు వేఁడుచు రాఁగ నంతటన్. 157

క. భేరీమృదంగకాహళ, చారుచతుర్వాద్యరవము సరసం బెలఁగన్
భూరివిభూషణదీప్తులు, సారెకుదిశలందుఁ గుల్కసంరంభముతోన్. 158

తే. మిసమిసల ప్రొవ్వులఁ జెల్లు మెలతలంత, సౌధపంక్తుల పైనుండి సాతసమున
విరులు గరములఁ గైకొని వేడ్క మిగులఁ, బైన సేసలు చల్లుచు బాళి మెఱసి. 159

క. కర్పూరహారతులియ్యఁగఁ, గొప్పగుకొండలనుబోలు కుంజరరథము
ల్తెప్పగువాజిరథంబులు, చప్పుడుచేయుచువురాగ సంతోషమునన్. 160

తే. ఛత్రచామరమార్తికసంఘములను, బట్టి కొందఱు వెనువెంటబలసినడువ
వేత్రహస్తులుకొందఱు వేగముందుఁ, బ్రజలఁ దోలఁగించుచును బరాబరులుసేయ. 161

క. అకలంకధర్మకరమణి, నికరపతాకాభిరామనిర్మలగురుఘో
టకయుక్త మైనరథమును, బ్రకటితగతి నెక్కి సైన్యపరివృతుఁ డగుచున్. 162

క. పురి నిర్గమించి పోవుచు, దురమున రఘురాముచేతఁ ద్రుళ్లి భవంబున్
ధరఁ దొరఁగి మోక్షపదమున, నిరవద్యసుఖంబుఁ గాంతు నే ననుచు వడిన్. 163

తే. క్రోశమాత్రసముచ్ఛ్రితఘోరసప్త, సాలముల దాఁటి వెలుపల లీల మెఱయు
రామసైన్యంబుఁ బొడఁగాంచి రాక్షసేంద్రుఁ, డలిగి కాలాగ్నిరుద్రుని ననుకరించి.

చ. ఇరువదినూర్ల చేతులను నెంతయుఁ గోఁతుల నొక్కపెట్టునన్
అరుదుగఁ బట్టి పర్వతగుహాభనిజాస్యములందుఁ ద్రోయుచున్
మిఱిమిఱి మ్రింగుచుండఁగను బెట్టుగ వానరవీరు లంత నా
సురరిపుకర్ణరంధ్రములఁ జోద్యముగాఁ జను దెంచి పూన్కిమై. 165

క. ధీరులు సంగరశూరులు, వీరులు నా దనుజు లడర వినువీథి దెసన్
శ్రీరామచంద్రుసన్నిధిఁ, జేరిరి సంతోషకలితచిత్తము లొప్పన్. 166

సీ. ఆలోన దేవవిద్యాధరయక్షులు సాధ్యగుహ్యకసిద్ధసంతతులును
గింపురుషులు వసుకిన్నరగణములు నయగుణభావులౌ సాగరతులు
యమనియమాసనాద్యష్టాంగయోగాభినిష్ఠాగరిష్ఠవసిష్ఠముఖ్య
బ్రహ్మర్షులును మఱి రాక్షసప్రవరులు భూతపిశాచసమూహములును
తే. బిందులై మిన్నుపై నుండి వండిమగలు నైన సాహస్రవదనభూపాభిరామ
రామచంద్రుల యుద్ధంబుఁ బ్రకటముగను, జూడఁగాంక్షించియుండిరి సురుచిరముగ.

క. భరతుఁడు శత్రుఘ్నుండును, గురుబలుఁ డగులక్ష్మణుండు ఘోరాహవను
స్థిరకర్మకోవిదుని ఘన, శరచాపుని దనుజకులవి సాహసయుతునిన్. 168

క. కని నొప్పింపఁగ వారిన్, ఘనశరముల నాటఁజేసి కపులను మ్రింగన్
మనుజాధినాథుఁ డది కని, తనతమ్మునితోడఁ గూడి తహతహపడుచున్. 169

ఉ. రమ్మని వాలిసోదరుని రాక్షసనాథుని వాలిపుత్రునిం
సమ్మతి వాయునందనుని సర్వబలంబులఁ బిల్చి సత్కృపన్
ఇమ్ములఁ బుష్పకంబుపయి నేర్పడ నుండఁగఁ జేసి వారితో
నెమ్మిదలిర్పఁగా నచట నేర్పుననుండి జయంబుఁ గోరుచున్. 170

తే. కామగమనంబుగలదియు గగనవర్తి, యైన పుష్పకమందున నధివసించి
ఒనర సమరంబుగావింప నుత్సహించి, సత్వరంబుగ నవ్విభీషణునిఁ జూచి. 171

క. పలికె విభీషణ దానవ, కులనాథుని వీనిఁ జూడు గురుతరమాయా
బలశాలి యగుచు యుద్ధ, స్థలమున నున్నాఁడు విపులధైర్యస్ఫూర్తిన్. 172

చ. దురమున మున్ను రావణుని దోర్బలయుక్తుని గుంభకర్ణునిన్
అరసితి వీని బోలుదనుజాధిపుఁ గాన ధరిత్రిపై నిరం
తరఘనసత్వ మేర్పడఁగ దర్పితుఁడై కపిరాక్షసాదులన్
సరగునఁ బట్టి మ్రింగి వడిఁ జంపఁగలండు కడిందివీరుఁడై. 173

క. ధీరుని సహస్రకంఠుని, సారద్విసహస్రహస్తసహితుని ననిలోఁ
బోరి జయించుట దుర్లభ, మేరికినైనను దలంపఁ బృఘుబలుఁ డగుటన్. 174

తే. అంగదుం డాదియౌ కపిపుంగవులును, సోదరులు దైత్యనాథులు సురుచిరముగ
ధర్మనవరత్నరుచిగణకామగమన, మగువిమానంబుపై నుండనగుఁ గడంగి. 175

చ. అని రఘువీరుఁ డాడ విని యల్లవిభీషణుఁ డార్యపోషణుం
డనితరసాధ్యశక్తిమెయి నందఱు చూడఁగఁ గార్ముకంబు కే
లను ధరియించి సజ్యమును లక్ష్యముతో బిగియించి రాముచే
ననుమతుఁడై శరంబుల శరాసనమం దరిఁబోసి ప్రేల్మిడిన్. 176

క. ఘనభుజబలయుతవరనిజ, దనుజబలంబులను గూడి ధైర్యస్ఫూర్తి
న్వినువీథిఁ జేరి పెలుచన్, దనుజాలు వెఱగందుచుండఁ దద్దయుఁ బలికెన్. 177

ఉ. ఓరిసహస్రకంఠ వినరోరి దురాత్మ పరాత్పరుండు నా
శ్రీరఘురాముఁ డాజ్ఞనిడి నీరికిఁ బొమ్మన వచ్చినాఁడ నా
పేరు విభీషణుండు సురబృందవరేణ్యుఁడ రమ్ము పోరికిన్
ఘోరతరాస్త్రజాలములఁ గూల్చెద దైత్యులు తల్లడిల్లఁగన్. 178

క. అని చెప్పి తీవ్రవిశిఖము, లను గోట్లకొలంది గురియ లాఘవ మొనరన్
దనబాణతతులఁ బిండిగ, నొనరించె న్దితిసుతుండు నుద్ధతితోడన్. 179

క. ఆత్తఱి శత్రుఘ్నుఁడు గుణ, వత్తరుఁ డగులక్ష్మణుండు భరతుఁడు కోపా
యత్తులు నయి రోషంబులు, చిత్తంబులఁ గ్రమ్ముచుండఁ జిడిముడిపడుచున్. 180

తే. చేతులను శింగిణులఁబట్టి శీఘ్రముగను, కోపులకు వంచి నారులఁ గూర్చి కోల
లను రయంబున సంధించి లక్ష్యముంచి, వాన గురిసినమాడ్కి నవ్వారిగాఁగ. 181

## సహస్రకంఠవిభీషణాదులయుద్ధము

ఉ. వ్రేసినఁ జూచి యద్దనుజవీరుఁడు వారి లకోరిపిండులన్
ఈసున శక్తితోమరములేసి ధరాశ్రమమునఁ బిండిగాఁ
జేసి సమస్తజీవతతిచిత్తములన్ వ్యథపెట్టు రూపుతో
భాసిలెఁ గాలభానుగతి బంధురవిక్రమశక్తియుక్తులన్. 182

తే. మఱియుఁ దీరులఁబరగించి మచ్చరించి, గమరులకు జింపచెండాడి కండుమిగిలి
మేనులను దూలఁగా నేసి మేటిమగఁడు, నగువిభీషణు పైకి నత్యధికగతిని. 183

చ. చని గురుబాహుదండములఁ జయ్యన నాతనిఁ బట్టి కౌఁగిటన్
ఉనిచి బిగించి బల్విసరి నుర్విని ద్రోచి తదీయపక్షమున్
ఘనముగఁ బాదయుగ్మమునఁ గ్రుక్కినఁ దన్నిన మూర్ఛపోయె నా
దనుజవరేణ్యుఁ డంతటను ధైర్యము శౌర్యము పిచ్చలింపఁగన్. 184

పంచచామరము. కనన్నరారికిన్ సమంబుగాఁగ నెవ్వఁడోపు ని
కనన్నిజంబుగాఁగ నీజగంబులోనఁ జూచికా
కనన్బలంబు బాహుశక్తి హర్షధైర్యశౌర్యముల్
కనన్విచిత్రమయ్యె నంచుఁ గ్గె భూతసంఘముల్. 185

చ. పరఁగ సహస్రహస్తముల భాసురకార్ముకముల్ధరించి భీ
కరముగ వేయిహస్తముల గాఢమహాగ్నిశిఖాశుగంబులం
దరుచరసేనపైఁ బఱపి దంష్ట్రలగీటుచుఁ దారణంబునన్
ధరఁ బడఁ గూల్చెఁ బ్రాణములు దల్లడమందుచునుండ నుగ్రతన్. 186

ఉ. వెండియుఁ వాయుసూనుని వివేకబలాఢ్యుని వాలిపుత్రుసిన్
ఖండనభీములన్ రుచిరభానుసుతాదికపిప్రవీరులం
జండతరాస్త్రకాండములఁ జయ్యన వేఱుగఁ గప్పి చెప్పి భూ
మండలిమీఁదఁ ద్రోసి సురమండలిచూచుచు భ్రాంతి నొందఁగన్. 187

తే. భరత లక్ష్మణ శత్రుఘ్న వసుమతీశ, వరుల వడిఁ దూపుకడలిలోఁబడఁగఁ జేసి
పుడమి నుప్పరవీథుల నెడములేక, యుండునటు లమ్ములను గప్పి యుగ్రశక్తి. 188

క. ఒకటియుఁ బదియును వేయియుఁ, బ్రకటితముగ లక్ష కోటిపద్మ శరంబుల్
ఒకసారి గూర్చి వానర, నికరాంగము లెల్లఁ బగుల నేర్పున నేసెన్. 189

ఆ. వానిబాణతతుల మేనులు దెగి రక్త, ధార లొల్కుచుండఁ దవిలి పూచు
నట్టికింశుకముల ననుకరింపుచుఁ గీశ, గణము గ్లాని నొందెఁ గంబుకంఠి. 190

భుజంగప్రయాతము. ఘనం బైనశస్త్రాళి గారించె శత్రు
ఘ్నునిన్ లక్ష్మణుం స్థిరుగోపాలుని న్వీ
రునిం గైకయీపుత్రు రూఢిం గనంగ
న్ఘనచ్ఛౌర్యముం జూపి కాలాగ్నిరీతిన్. 191

తే. రక్తనదు లెల్లఁ బెలుచ ధరణినిఁ బాఱె, భూతసంఘాతములు చుట్టుముట్టి నల్ల
ద్రాఁగఁ జొచ్చెనుదద్బాణతతులనొరయఁ, ధూళిచేఁ గప్పఁబడెనంతద్యుమణి రమణి.

ఉ. ఆయెడ వానరోత్తము లహార్యమహీరుహగండశైలముల్
పాయనిరోషతాపములఁ బట్టి ఘనంబుగఁ దెచ్చి పోరనన్
గోయని యార్చుచున్ దెసలు ఘూర్ణిలుచుండ నమేయశక్తితోఁ
గాయము నొవ్వ గాయములు గాఁగను మొత్తిరి వాని నుగ్రులై. 193

క. తామంతంపరగాఁగన్, భీమాస్త్రము లెక్కపెట్టి భీషణదనుజ
స్తోమాధిపు నొప్పించిరి, రాముననుజు లధికకోపరయముచెలంగన్. 194

క. కొలఁదికి మించిన యంగము, లలరఁగ నొకలక్షయోజనాయతవిపులం
బులు గల్గి రాక్షసాగమ, కలితుండై మేరునగము కైవడి వెలిఁగెన్. 195

తే. తద్దానవాంగసంశ్లిష్ట తరుచరాళి, రక్తసానుచమూజుష్ట రమ్యలోక
తతి తెఱంగున రణరంగధరణిమీఁదఁ, జెలువుమీఱఁగ రాజిల్లెఁ జిత్రమగుచు. 196

ఉ. సంగరశూరుఁడు న్వితత శౌర్యలలాముఁడు సైనదేవతా
పుంగవవైరి వానరసమూహముల న్నిజపాదఘట్టనం
బొం గడగించి పట్టి తమిఁ బొంగుచు మ్రింగె భుజాగసంఘముల్
మ్రింగుపతంగరాజువలె మించినశక్తిఁ జెలంగ సయ్యెడన్. 197

క. దారుణగురుశరతతులన్, సారెకు నిగుడించి సర్వశత్రుల మేను
ల్గారించి రావణానుజు, ధారణిఁ గూల్పంగ నెంచి దర్పించి వడిన్. 198

తే. వేయికోలల సంధించి వెడదరొమ్ము, గాడిపోవంగ నేసి భీకరము లైన
మూఁడునూరుల నారాచముల నుదార, పరమగుణశీలు భరతభూపాలుఁ బాల. 199

క. నొప్పించి పృషత్కంబుల, నప్పుడె రక్తైకధార లాతనిమేనం
గుప్పలుగఁ ధరణి దొరుగం, దప్పక గావించె దనుజతతి మోదింపన్. 200

ఉ. వానిశరాగ్నిఁ గ్రాఁగి కలధంబులమాడ్కి ధరిత్రిఁ దూలి రా
వానరరాక్షసాపటులు పార్థివముఖ్యులు లక్ష్మణాదులున్
మానుగ దానవుం డిటుల మార్కొని యందఱ నొక్కపెట్టునన్
దీనులఁజేసి త్రోసి కడుధీరుఁడు సైతనరారు నుద్ధతిన్. 201

తే. పిదప శ్రీరామభద్రుండు భీషణాంగు, సమరకర్కశదైత్యేశ సంగు ఘోర
దళితతాఖ్యోత్తమాంగు నుదాత్తవిజయు, తుష్టసఫలాంతరంగుని దోషసంఘు. 202

క. కనుఁగొని దండములోపల, ఘనముగఁ జింతించి కార్ముకము హస్తమునన్
దనుజవ్రాతము భీతిలఁ, గను దాల్చి రణోర్వి నిలిచె ఘను లెన్నంగన్. 20

క. ధీరుని రణకోవిదవర, వీరునిఁ, గోదండబాణవృతకరుని మహా
శూరుని దశరథభూపకు, మారుని గని నిర్జరారి మహితోద్ధతితోన్. 20

చ. పటపట దంతము ల్గొఱికి బాహులఁదట్టుచు హుంకరింపుచున్
నిటలతటంబునం జెమటనిండుగ నుండఁగ మీఁదఁజూచుచున్
అటునిటు పోవుచున్ భటుల నందఱఁ జీరుచుఁ గోపవిస్ఫుర
న్నటనముచేయుచు న్గనుల నగ్నికణంబులు రాల నుగ్రుఁడై. 20

చ. జనపతియైనరామునికిఁ జాలఁగ వింతజనించు చుండఁగా
ఘనముగ నట్టహాసమును గ్రక్కునఁ జేయుచుఁ గాలమేఘగ
ర్జననిభశబ్దయుక్తుఁడయి సారశిలీముఖయుక్తపాణియై
వనచరులెల్ల భీతిలఁగ వచ్చె నమోఘబలాతిరేకతన్. 20

తే. ఇటుల జగదేకవీరుని కెదురు నడిచి, చెంత ధైర్యంబుతో నిల్చి పంత మొప్పఁ
బరుషవర్ణసమన్వితభాషణములఁ, బలికెఁ గాంభీర్యంబుతో వాఁడు పరమసాధ్వి. 20

సహస్రకంఠుఁడు శ్రీరాముల నిందించుట

ఆ. రామ నీవు మున్ను రాజ్యంబు విడనాడి, మౌనిరూపమునను మహిని వెలయం
దండకావనంబు దరియంగఁజొచ్చి వి,రాధు సాపరాధుఁ బ్రథితముగను. 20

క. దురమున శరముల ధరఁబడఁ, బరిమార్చి మునీశ్వరులకుఁ బరమప్రీతిన్
గరమర్థి నొసఁగి దీనులఁ, గరుణ న్గాపాడి మరలఁగతినులఁబెలుచన్. 20

ఆ. చంపి పాపకర్మచయసింధుసాహస, భావసంధు నాకబంధుఁ దునిమి
దురితభావణులను ఖరదూషణులఁ బట్టి, నేలపాలుచేసి నెలఁతఁ బాసి. 21

క. ధీరుని వాయుకుమారుని, గారవమున నాదరించి కంబుగ్రీవున్
ధీరుని సుగ్రీవునిఁ గపి, వారమునకు రాజుఁజేసి వారనికినుకన్. 211

చ. పరగుణ శీలునిన్ సుగుణవర్తనశాలిని వాలిని న్వెసన్
ధర నొకకోలఁ గూల్చి భుజదర్పితు లైనకపీంద్రసంహతు
ల్గరమురక్తిఁ గొల్వఁగను గ్రక్కున లంకకు నాంజనేయునిన్
సరగునఁబంపి భూమిసుత సచ్ఛుభ మారసి వేగ నీరధిన్. 212

ఉ. చేరి సురారిపట్టణముఁ జేరఁగ దారినిఁ జూపు మంచు సా
వారిధి వేఁడి వారధిని బాగుగఁ గట్టి సురౌఘశంకరున్
వారక లంక కేగి సురవైరుల శూరులఁ బావకారులన్
ఘోరరణోర్విఁ గూల్చి రణకోవిదభూషణు రావణు న్వెసన్. 213

తే. సమరమునఁ ద్రుంచిభూజాత సకలలోక, మాత యగు సీతఁగొనివచ్చిమహితసాధ్వి

యగిజనాసాధ్య యగునయోధ్యాపురంబుఁ, జేరి రాజ్యంబుఁ జేయుచుఁ జిత్రముగను.

మ. పరసద్వీపవిశాలసాగరములన్ సర్వంసహాభాగభీ
కరదేశంబుల దాఁటి మర్కటులతోఁ గౌతూహలం బొప్ప నా
సరసం జేరఁగ రాఁబనేమి చెపుమా క్ష్మాపాలసర్వోత్తమా
సురదిక్పాలురగెల్చినాఁడ ననిలో శోభిల్లు సత్కీర్తితోన్. 215

శా. నానాభోగనివాసమై విబుధగణ్యంబై మహారత్నసం
ఘానేకోన్నతహర్మ్యకోటియుతమై యాశ్చర్య భూయిష్ఠమై
శ్రీనారీమణికాటపట్టగుచు సంశ్లిష్టాసురానీకమై
నానాటన్వెలుగొందుచిత్రవతి నుస్నాఁడన్ జయోత్కర్ష చేన్. 216

క. దారుణశూరునిమాయా, కారుని సాహస్రవదన కాలుని ఘనునిన్
ధీరుని బాహుబలోన్నత, వీరుని నను దెలియలేవు పృథ్వీనాథా. 217

తే. రామ తడవింక సేయక రయముతోడ, నీబలంబులు వెనువెంట నేర్పుమిగుల
గొలిచి రాఁగను బోపొమ్ము లలితసుఖముఁ, బూర్ణముగ నిచ్చు సాకేతపురికి నిపుడె.

క. మును దశకంధరుఁడాదిగ, దనుజుల దుర్బలులఁబట్టి తడయకయాయో
ధనమునఁ గూల్చినవాఁడవు, మనుజేశులు మానుటెల్ల మదివుప్పొంగన్. 219

క. ఘనతరశక్తియశోబల, వినుతగుణాలయుని నన్నుఁ బృథ్వీస్థలిలో
జనవర వారికి నీడని, మనమున నూహింప నగునె మఱిమఱిచూడన్. 220

తే. అధ్వరార్హంబు భవదీయమైన వాజి, నీయ నీముందు వెలుఁగొందు వృషచరులఁ
బట్టిమ్రింగెద ఖగపతి పౌరుషమున, నహిసమూహము మ్రింగిన ట్లధిప నేఁడు.

మ. నిను నీతమ్ముల నైన లెక్కగొనకే నేర్పొప్పఁగాఁ బట్టి మే
దిని రంభాఫలభక్షణంబుపగిది స్వీపింపఁగాఁ జేసెదన్
గనుశాళక్తి సమస్తజీవచయము ల్గన్నంతనే దీనతం
గనుచున్నారు తొలంగిపోక నిలు నీ శౌర్యంబు నేఁజూచెదన్. 222

క. అని పల్కుచుఁ బగచే నగు, ఘనభక్తి న్మక్తిగల్గు గద కదనమునన్
జననాథుచేత నని తన, మనమునఁ దలపోసి చూచి మహితస్ఫూర్తిన్. 223

చ. అలుగని తెంపుతో నసురుఁ డారఘురాముని జూచి సవ్యచుం
బలికెను రామ ధైర్యపటు బాహుబలంబుల నాకు సంగర
స్థలమునఁ జూపు మెప్పటికిఁ జక్కఁగ నీబలపౌరుషాదులం
దెలిసినవారు కారు జగతింగలవారలు స్వల్పబుద్ధిచేన్. 224

క. అమరేంద్రాదిసురేశుల, గమిలో నొక్కఁడవు కావు కయ్యముఁ జేయన్
సమరసమర్థుని ధర మ, త్సముఁ జూచినఁ దొడరఁ జూఁచు సంతోషమునన్. 225

క. నీమగటిమి చేటెఱుఁగుదు, భూమి స్వాస్థాభిమానములు నీకెపుడు
స్వామీ యిఁక చూచి కానను, గామితఫలసిద్ధి కాంక్షగలుగదు మదిలోన్. 226

సీ. కడిమి శూరుని నన్నుఁ గనుఁగొనఁజాలవు గుణహీనుఁడవు సత్వగుణమునీకు
బొందుఁజూచినఁగాన సందియమెందుకు ఘనముగ నేజాతి గలుగువాఁడ
వేమిచెప్పఁగ నేర నీవు భూపతికులాచారరతుండవె చతురమతివె
ధర్మంబుఁ బోఁద్రోచి తరుమూలమున దాఁగి వాలి నొక్కమ్మున వసుధఁ గూల్చి

ఆ. నట్టితవశి కాఁడ వసఘమానస మాన, సాటవులను దూరుమనిఁ జెలంగ
జేల నీటుగుల్కునిచ్చోటనుండి నా, తోడఁ బోరలేవు తొలఁగిపొమ్ము. 227

క. వేదాద్రిగుహాలలోపల, నేదిగులును లేకయుండ నేగుము నాతో
శ్రీదయిత పోరఁ జాలవు, మేదిని నాకీవుగాపు మేటిమగఁడవే. 228

చ. సనకసనందనప్రముఖసన్మునియోగనిశాంతమాదలి
న్మన మలరార నుండఁగను మంజులబుద్ధినిఁ బొమ్ము శీఘ్రమే
వినుతజయాభిరామ నను వేంద్రపుఁగోలల నేలఁగూల్చఁగాఁ
జనునె సురాసురప్రముఖసాహసవంతులు తోడువచ్చినన్. 229

తే. కావిగుడ్డలు పైగప్పి కాననములఁ, జేరి ఫలశాకములఁ దిని జీవనంబుఁ
జేయువారలకడ కీవుచేరి యుండు, మనిఁ బ్రవర్తించుశక్తి నీ కనఘ లేదు. 230

క. ఒక్కఁడవై భువిఁ దిరుగక, దిక్కయ్యెం గీశగణము దేశములేకే
దిక్కులఁదిరుగనయోధ్యయు, దిక్కయ్యెను నీచరిత్ర తెలియదె నాకున్. 231

ఆ. తోడులేక తిరుగ ద్యుమణిపుత్త్రుఁడు కాఁడె, గాధిసుతుఁడొకండు కలిగె గురుఁడు
విఱ్ఱవీగి నేఁడువిభుమాడ్కి నాకడ, నిలిచినావు జోడు నీవు కావు. 232

ఉ. మీనతనూవిలాసమున మేలుగ సాగరమందుఁ గ్రుంకినన్
దీనతఁ గూర్మరూపమున దృశ్యముగాకయె దాఁగియుండినన్
మానుగ ఘృష్టిరూపమున మాయలఁ బన్నినఁ జిత్రరూపకన్
దానవనాథుఁ జంపినను ధైర్యము శౌర్యముఁ దిక్కటిల్లఁగన్. 233

తే. గుజ్జురూపంబునను బలిఁ గువలయమునఁ, ద్రొక్కి బలిమిని నృపతులఁ ద్రుళ్ళఁగొట్టఁ
గాఁగుతారిత్వమొందినఁగాని నిన్ను, వెదకి పట్టెదఁ బోనీక విదితముగను. 234

క. మాయావి నను చు మదిలో, నీయెడఁ దలపోయవలదు పృథ్వీరమణా
పాయక నీపైఁజిత్తము, నేయెడలం బోదు పట్టివిడుతునె నిన్నున్. 235

క. అరు దరు దని నీతమ్ములు, గుబులులగు కీశవరులు కోయనియూర్వన్
ధర శరవైశ్వానరుచే, సురలగ్గింపంగ నిన్ను స్రుక్కింతు వెసన్. 236

ఆ. అనిసహస్రవదనుఁ డాడిన ధీరుండు, రమ్యచరితుఁ డైనరామవిభుఁడు
విని మనంబులోన విస్మయంపడి నవ్వి, పలికె వానిఁజూచి బలిమిమెఱసి. 237

క. దనుజేశ్వర వ్యర్థంబుగ, నిను నీవే పొగడుకొనుట నేర్పరితనమా
ఘనమా విక్రమశక్తుల, ననిఁ జూపుము మేటివగుదవై యున్నయెడన్. 238

క. మామకయజ్ఞతురంగము, నోమూఢప్రజ్ఞ యిచ్చి యుర్వీస్థలిలో
భూమానందవిశేష, స్తోమంబుల నొందుమెపుడు సురుచిరలీలన్. 239

ఉ. కాదనినీవు పల్కఁగను గార్ముకనిర్గళితాస్త్రసంహతిన్
మేదిని నీతల ల్దునిమి మెండుగ నెత్తురుసోఁగు చుండఁగా
సాదరమొప్ప భూతనివహాయతతుష్టినిఁ జేసి జ్ఞానసం
వేదులునైన మానులకు వేడ్కనొసంగెద దానవాధమా. 240

క. ఈపుడమి దుష్టకర్ముల, నేప్రొద్దును మాయలేక పృథుశోకమునన్
దాపంబు నొందుచుండును, గాపాడెద వారిఁ గూల్చి కరుణామతినై. 241

## సహస్రకంఠ శ్రీరాముల ద్వంద్వయుద్ధము

చ. అనుటయు నాతఁ డారఘుకులాధిపు మాటల కాగ్రహించుచున్
ఘనతరకాండకాండములఁ గ్రక్కున రామునిమీఁద నేయఁగాఁ
గని నిశితాస్త్రజాలములు గార్ముకమం దరివోసి వ్రేసి త
ద్దనుజుని కోలల న్విరిచి ధారణి ద్రోచినఁ జూచి యల్కతోన్. 242

ఆ. శక్తి భిందిపాలచటులతోమర వర ముసల ముద్గరాదిముఖ్య బాణ
వార మైంద్రపాశుపతవారుణాస్త్రముల్, వైచె వాఁడు రామభద్రు మీఁద. 243

క. వాఁడేసిన సారసములఁ, బోడిమిచెడి పింజియగుచుఁ బుడమిన్ రాలన్
వాడిశరంబుల నేసెను, వేడుకతో రామవిభుఁడు విస్తృతబలిమిన్. 244

క. వెండియు సహస్రవదనుని, గండలుకడికండలగుచుఁ గడువడిఁ బడఁగన్
దండిగ నెముకలు రాలన్, మండితకాండములఁ గ్రుచ్చి మహితోద్ధతితోన్. 245

క. సౌరాస్త్ర మర్ధచంద్రము, సారసకాదేరదివ్యసాయకవితతుల్
ధీరుండై రఘురాముఁడు, ఘోరాసురుఁ డవనిఁ గూలుకొఱకై పఱపెన్. 246

ఉ. రామనృపాలశేఖరుని ప్రాకటఘోరఘనప్రకాండమున్
భీమతరాస్త్రజాలములఁ బెట్టుఁగఁ జిందరవందరై పడన్
గా మహిఁ జేసి మండిపడి కన్నుల నిప్పులు కుప్పలై మహో
ద్దామముగాను రాలగను దంష్ట్రల గీటుచు దైత్యుఁ డుగ్రతన్. 247

తే. పెక్కునారాచములనేసి పీచమడఁచి, విలుగుణధ్వని గావించి వేడ్కమించి
యట్టహాసమొనర్చిన నఖిలభూత, తతులు భీతిల్లె జగములు తల్లడిల్లె. 248

క. ఈరీతి దశశతాననుఁ, డారాముఁడు సమరభూమి నన్యోన్యజయో
దారసుఖంబును గోరుచు, ధీరులునై యుండిరంత దిక్కులువెలుఁగన్. 249

క. ఇరువురి మేనులు మూఁపులు, చరణంబులు తొడలు జానుజంఘలు శిరముల్.
శరనిర్భిన్నము లగుచును, విరిసినకింశుకములట్లు వెలిఁగెను జూడన్. 250

చ. కినిసి కడంగి రాఘవుఁడు కేలునఁ గార్ముకమూని ధీరతన్
ఘనశరమేయఁగా నదియుం గాఢతమంబు జనింపఁజేయుచున్
ఘనరవ మొప్ప భీషణముగా వడిరాఁగను జూచి రోలి నా
దనుజుఁడు కోపతాపములు దండడిచేయఁగ నుగ్రమూర్తియై. 251

తే. గంధవహాస్త్రమున దానిగాఢతమముఁ, బాపి తద్భంగ మొనరించి పన్నగాస్త్ర
మొకటి వింటను సంధించి యుఁరవడించి, మించినజవంబుతో నేసి మిహిరకులుని.

క. ఆకోల పెక్కురూపుల, భీకరసర్పంబు లగుచుఁ బృథుగతి రాఁగా
వే కని రాముఁడు నవ్వుచుఁ, బ్రాకటకోదండ మెత్తి పటురభసమునన్. 253

క. గరుడాస్త్రంబును గైకొని, సరగున సంధించి వాని జక్కాడుటకై
పరగించె నంత నాశర, మరిభీకరనినదయుతము సైకడుఁ బెలుచన్. 254

తే. బహుళగరుడాకృతులు దాల్చి పక్షసంఘ, వాతనిర్ధూతపర్వతవ్రాత మగుచు
నిగిడి కడలను బుడమిని నింగి నిండి, నడుమనే త్రుంచెఁ దన్ముక్తనాగశరము. 255

ఉ. వెండియు రాముఁ డాదనుజవీరునిపై జ్వలనాస్త్ర మేయ నా
ఖండలకాంతితో నదియుం గాఢతరాగ్నికణంబు లొల్క భూ
మండలి నెల్ల నిండుకొని మండుచు రాఁగని చూచి వాఁడు వే
దండకరాభ ఘోర భుజదండ సముజ్జ్వలకార్ముకంబునన్. 256

క. వరుణాస్త్రము సంధించియుఁ, బిఱబిఱ నేయంగ విపులభీషణకరపు
ష్కరద సమావృత పుష్కర, వరసంపాతంబు గలువర్షముతోడన్. 257

మ. అనలాస్త్రంబును ముంచి పోక యది యుద్యత్కీలలం బైకి రాఁ
గని రాముం డనిలాస్త్ర మేసి వడి నక్కాండంబు మున్గూల్పఁగా
దనుజుం డయ్యెడ దంతిశస్త్రమువడిన్ దర్పించి యేసె న్మహా
ఘనుఁడౌ రామునిమీఁద నుద్దవడితోఁ గ్రౌర్యంబు మిన్నందగన్. 258

క. ఆసరమున దంతావళ, భాసురతతి గళితబహుళబంధుర దానో
ద్భాసితజంబాలితభూ, వాసిక్తయై కదియ రాఁగఁ బార్థివుఁ డలుకన్. 259

క. పటపటఁ బండ్లను గీటుచు, నిటలస్థలమందుఁ జెమట నిగుడుచునుండన్
బటుకార్ముకగుణనాదము, దటుకునఁ గావించి రోషదర్పితమతియై. 260

క. హరిశరము శరాసనమున, కరమరుదుగఁ గూర్చి పరపె ఘను లెన్నఁగఁ ద
ద్గురుశరమున హరిసమితుల్, శరములు పెక్కగుచు దిశలు బెగ్గడిలంగన్. 261

క. దారుణసటౌఘములచే, దారితసర్వాభ్రవిపులతతియై పెలుచన్

భూరినిజరావచలితో, దారహరిద్విరద మగుచు దర్పించివడిన్. 262

ఆ. కులిశనిభము లైనగోళ్లచేఁ దత్కుంభి, కుంభములను జీల్చి ఘోరముగను
గుంభినిం బడంగఁ గూల్చెఁ దన్నాగాళిఁ, గోఁతు లెల్లఁ జూచి కుతుక మొంద. 263

శా. ఈరీతిన్ రఘురామదానవవిభు ల్వీక్షింపఁగాఁ జేర్చి దు
ష్పారోదగ్రబలాతిరేకములతోఁ బల్లూకు సన్నద్ధులై
ధీరు లెచ్చఁగ నట్టహాసరవము ల్దిఙ్మండలి న్నిండఁగా
సారెం జేయుచుఁ బోరొనర్చిరి వడిన్ జాచద్భ్రూపేశులై. 264

తే. ఒండొరులు గొంతవడి దాఁక నుత్కటముగఁ దిరిగితిరిగి భ్రమించుచుఁ దివిని పెనఁగి
వలయముగఁ బోయి క్రమ్మఱ బహుళగతి వి,శారదులు నై రయంబున శౌర్య మొప్ప.

క. సంగరమున నొండొరులిల, మంగళకరజయముఁ గోరి మాత్సర్యముతో
సింగములమాడ్కి నెలిగిరి, చెంగటఁ గలవారు చూచి చిత్రంపడఁగన్. 266

క. పోరెడివారలు శూరులు, వీరులు నగువారి గోత్రవిభుసన్నిభులై
దారుణసంగరమందున, వైరుల గుండియలు చెదర వఱలిరి కినుకన్. 267

తే. వారిబలవిక్రమంబులు వారిహస్త, లాఘవము ఘోరతరశస్త్రలాఘవంబు
సాంపరాయికవైచిత్ర్యసరణి జగతి, వారియం చెన్నవచ్చునే వాసిమిగుల. 268

క. క్రమ్మఱ దృఢముష్టిప్రహా, రమ్ములచే మల్లురట్లు రణభాగమునన్
హుమ్మని పోరిరి పదహ, స్తమ్ములు పెనఁగొనఁగఁ బట్టి ధైర్యస్ఫూర్తిన్. 269

క. ఖండననిజకరవర కో, దండవినిర్ముక్తశస్త్రతతిభంగాస్ర
జ్మండలమండిత రిపుజన, మండల వారిధిపరీతి మహి వెల్గి రొగిన్. 270

ఉ. నాగులు సిద్ధసాధ్యులును నాకపురేశుఁడు యక్షపుష్యపు
న్నాగవరేణ్యులు న్మునులు నాకతలంబున నుండి సొంపుతో
బాగుగ రామదానవులబాహుబలంబును విగ్రహంబునున్
సాగరనిమ్నభావమును స్వాంతమునం బొంగఁగఁ జూచి రాయెడన్. 271



క. తారానాథుఁడు నీలుఁడు, తారాసుత వాయుసూతి తారాది మహా
శూర మహీరుహచరులును, ఘోరాకృతి నొప్పు దనుజకుంజరుఁ డెలమిన్. 272

తే. వారిసమరంబు పొడఁగాంచి బహుళభీతి, శేష గడగడవడఁకుచు చిత్తములను
దిగులుపుట్టంగ నిశ్చేష్టఁ దివిరి కలహ, భూమినుండిరి చిత్తరువ్వబొమ్మ లట్లు. 273

ఉ. కమ్మరిసాగి చందమునఁ గుంభిని సంచలనంబు నొందె వే
గమ్మున దిగ్గజావళికి గంధరసంధులు క్రుంగె నాదికూ
ర్మమ్ము భయంబుచెందె ఫణిరాజు శిరంబులు వాల్చె బుక్కసం
ఘమ్ములు రాలె లోకముల గాఢభయంబు జనించె నాయెడన్. 274

క. శ్రీరామచంద్రుఁ డాయెడ, సారెకుఁ జిత్తంబులోన సమరోచితమహా
బాణిని జింతించి మహా, శూరులు తన్మెచ్చుచుండ సురుచిరలీలన్.

తే. బ్రాహ్మమస్త్రంబు విల్లునఁ బఱఁగఁ గూర్చి, దాని నేయఁగ సురారాతిదర్పమడఁగి
జడిసి మాయాబలుండునై సమరభూమి, వదలి కనఁబడకుండఁగఁ బాఱిపోయె. 2

క. అది గని సర్వసుపర్వులు, విదితంబుగ నఖిలజనులు వీరాసురులున్
మదిలో విస్మయమొందిరి, కదనంబును విడిచి వాఁడు కనఁబడకుంటన్. 2

ఉ. దాఁగినఁ జూచి రాఘవుఁడు దర్పములోన నెనె నోరి ధైర్యమున్
భోగము బాహుశక్తిబలపూర్ణత నెందుఁ జనె న్దురాత్మ నీ
వేగతిఁ బోవ నా నిపుడు వీరుఁడ శూరుఁడనంచు నాకడన్
బాగుగఁ బల్కు వాక్యములు వ్యర్థములయ్యెఁ గదా జగంబులన్. 2

తే. ఓడ వనిలోన నెన్నఁ డేనొరుల కనుచు, నాటివీరంబులును విడనాడ నగునె
మున్ను నృపతుల ధనచయము గ్రహించి, తెచ్చుటయుఁ గాననంబునఁ దిరిగి మాయ.

క. చేసి నిశాసమయంబున, గాసిలి నిద్రించు భరతుఁ డెఁ జేరి వెసన్
దోసం బనకయె హయమును, మోసముచేఁ గొనుచుఁ బురికిఁ బోవుట మాడన్. 2

తే. వీరకృత్యంబులే యివి యెంచి చూడఁ, బురుషకార్యంబులెట్లవుఁ బొలుపుమిగుల
వడిఁ బురాకృతదోషంబువలన నిపుడు, చిక్కితివి నాశరానలుచేత నిచట. 2

ఉ. కాన నిశాటనాథ నినుఁ గయ్యములోపలఁ బోవ నిత్తునే
మానుగ బ్రహ్మరుద్రులును మాటికిమాటికి నీకుఁ దోడుగాఁ
బూని దయార్ద్రచిత్తములఁ బొందుగ వచ్చిన నింగికేగినం
గాని సహస్రశీర్షములఁ గాల్చెద నుగ్రశక్తిచేన్. 2

తే. నేఁడు నీరక్తమాంసముల్ నిఖిలభూత, తతులు భక్షించి ముదమునఁ దనిసి చూడఁ
గాను జేసెద ద్రోహివి కామలోలుఁ, డవు సురారాతి వీవు నీయవనిలోన. 28

క. నిలునిలు నాముంగల నీ, బలముఁ జల విపుడు చూపి బాహుబలిమిన్
బలిమి న్నినుఁ బరిమార్చెదం, జెలిమిన్ సుకృతంబుఁ గాంతు నే నధికముగాన్. 28

క. ఆసన్నమృత్యుఁడవు నిను, నీసునఁ గఠినోక్తు లాడ నేలర క్రూరా
రోసము గలిగిన యెడలన్, భాసురముగ నిలిచి పోరు బవరములోనన్. 29

చ. అని పరుషోక్తు లాడి శ్రవణాంతరసీమ గుణంబుఁ జేర్చి వే
గొని పరమేష్ఠిమార్గణముఁ గొంకక చాపముఁ గూర్చి పెల్లునన్
దనుజునిమీఁద వేయఁగను దారుణకాలధనంజయాకృతిం
దనరఁగఁ దచ్ఛిలీముఖ ముదగ్రత మింటిని నంటి వాసిగన్. 28

క. భుగభుగయని పొగఫుట్టఁగ, ధగధగయని శిఖలు వెలుఁగఁ దతశిఖికణముల్
ఎగసియుఁ జిటచిట రాలఁగ, నగణిత మగు కాంతినిగుడ నస్త్రోద్ధతితోన్. 287

రాముఁడేసిన బ్రహ్మాస్త్రముచే సహస్రకంఠుఁడు చచ్చుట

క. చని నిర్జరరిపువక్షము, ఘనముగ నదిచొచ్చి పోవఁ గ్రక్కున వాఁడున్
వినువీథినుండి ధరఁ బడె, ఘనవాహానుపవినిఁ గూలు గ్రావము రీతిన్. 288

తే. పడి తదీయశరాహతిఁ బ్రాణములను, బాసి దిక్కులు వెలుఁగొంద భాసురముగ
సకలలోకేశుఁడౌ రామచంద్రుమేనుఁ, జొచ్చెఁ దేజోమయాత్ముఁడై శోభనాంగి.

శా. ఆనాకేశరిపుప్రపాతహతమై యత్యుగ్రశబ్దంబుతో
నానాపర్వతశాఖిసంచయము చూర్ణంబై విచిత్రంబుగా
నానారీతులఁ గూలె భూతలమున న్నాగార్తిఁ బాసె న్వడిన్
దీనత్వంబును బాసి లోకవితతుల్ తెల్వొందె సంతుష్టిమై. 290

క. శూరుఁడు సంగరధీరుఁడు, వీరుఁడు నౌ దనుజవిభుఁడు వి్రలందూలన్
ఘోరారావము గలిగెను, సారెకు విస్మితులు నరి సర్వజనంబుల్. 291

తే. అపుడు గంధర్వకిన్నరాద్యఖిల సేవ, వితతి రఘురామురణకర్మ వేడ్కఁజూచి
పాడి యాడి సుమాసారవృష్టి గురిసి, రతులసంతోష మొదవ నాయధిపుమీఁద.

సీ. ఆయెడఁగదన మొప్పారెను విఱిగిన కరములు శరములు గళితశక్తి
కరవాలశక్తిముద్గరభిందివాలము ల్పరిగె పరిఘలు పట్టసములు
కడికండలైన చక్రప్రాసకుంతము లొప్పగియైనసురియులు శూలతతులు
తుదలేకపడియున్నతోమరరథములు కూలినఘోటక కుంజరములు

తే. సోలి మైచఱచిన రక్తచోదకులును, రాలి మెఱసెడికోటీరరత్నములును
వికతజీవులునై యున్న వీరదనుజ, వర్గములు కల్గి విస్మయావహము నగుచు. 293

తే. మఱియు నమృతాబ్ధికన్యక మాడ్కి వెలిఁగె, హాసకువ్వీతనిజదేహాసురుచి గలిగి
చారువాసంతమాసంబు సరణి నొప్పె రక్తఫుల్లపలాశ శిరమ్యమగుచు. 294

క. నిరవద్యదీప్తిచేతం, బరఁగెడి వేసంగిపోలె బంధురమగుచున్
వరదివ్యాంబరమణివి, స్ఫురణంబును గల్గి తమిని చూడ్కుల కింపై. 295

క. వలచినతనపతిచెంగట, విలసితభావమున మెలఁగువెలఁదియుఁబోలెన్
సలలితరాగోదయముం గలిగి జనేక్షణములకును గమనీయంబై. 296

క. నిరతానందసమాహిత, వరదాసనుశీలు దివ్యవాసమువోలెన్
గరమొప్ప నధికమార్గణ, గురుకోటులు మిగులగల్గి కొమరొందుటచేన్. 297

తే. దివ్యమైనట్టి నేరేడుదీవివోలె, గడఁగి నవఖండరూపంబు గలిగి భూత
రాజవరదేహమునుఁ బోలెఁ బ్రబలి వేడ్కఁ, గదల నాడెడి భూతాదిగణముగలిగి.

క. చోరరాజిదగుచుఁ దనరెడి, గురుకాననసీమవోలెఁ గొనకొని మాడ్కిన్
వరపుండరీకసముదయ, పరివృతమై చెలఁగి సర్వభాగము లందున్. 2!

తే. కమలమిత్రుని రుచిసొంపు గగనభాగ, తలముకై వడి శెలఁగె సుదారమహిమఁ
గ్రమము దప్పినతారకాప్రకరయుంతము, గలిగివై కృతిఁదాల్చినకతన నపుడు. 3(

క. ధనదునిశరణమువోలెన్, ఘనశంఖాంకలును గల్గి కడువిస్మయమై
తనరెన్ దురమంతట నా, దనుజాధీశ్వరునిసతులు తమవిభుఁ డనిలోన్. 3(

— సహస్రకంఠునిభార్యలు రణభూమికి వచ్చి ప్రలపించుట —

మ. ధరణీనాయకుఁడైన రామవిభుచేంతం గూలె నంచు న్వడిన్
సురవిద్వేషులు చెప్పఁగా విని మహాశోకంబు వైఁ బొంగఁగా
దరుణీసంఘము వెంటనంటి నడువ న్దాపంబు డెందంబులన్
గరిమం జెందఁగఁ గుందుచుం దుటుములై ఘర్మాంబువుల్జారఁగన్. 3(

చ. అడుగులకెంపుచాయలు రయంబున భూతలమందుఁ బర్వఁగాఁ
దడబడి మేఖలారుచిరదామములన్ సడలంగఁ గొనులు
న్వడి నసియాడ మించులను పంచనచేసెడి దేవకాంతులన్
ఉడుగక దిక్కుల న్వెలుఁగుచుండఁగ మందగతుల్ చెలంగఁగన్. 3(

ఆ. కమ్రకంఠహారగణములు తెగిరాల, నశ్రుజలము వరద లగుచుఁ గనులఁ
జారఁ బయ్యెదలును సారెకుఁ దొలఁగంగ, వేణి వార మపుడు వీడిపోవ. 30

క. వాడినవాతెఱమోము. ల్వ్రేడెడి సుమమాలికలును వెలయుంచు నుండన్
బోడిమి రోదసి నిండఁగ, వీడనిరోదనవినాదవిస్రుతి చెలఁగన్. 30

తే. వచ్చి రణభూమిలోపలఁ బడినమగనిఁ, గాంచి మితిలేనిదుఃఖాబ్ధి కరడులందుఁ
దేరి నిజనాథుపైఁబడి తెల్విలేక, హాయటంచని యేడ్చి రాయసురసతులు. 30

క. వేమారిటుదుఃఖించుచు, నామగువలు పల్కిరంత నవనీపతియా
రాముని మానవమాత్రుని, గా మది నూహించి నీవు కార్పణ్యమునన్. 30

క. ప్రాణేశ్వర శ్రీరాముని, బాణాగ్ని న్మిడుతమాడ్కిఁ బడి కాలి వెసన్
బ్రాణములు పాసి తుమ్మా, క్షోణీస్థలిఁ ద్రోచి యెచటఁ బోచ్చితో చెపుమా. 30

క. శ్రీకరభుజబలదర్పిత, పాకారిప్రముఖదేవపతిసన్నుత సు
శ్లోకచరిత్ర గుణాకర, ప్రాకటసత్కీర్తిధామ కరనృపభీమా. 30

శా. హానాథా మముఁబాసి పోవనగునే యన్యాయముంగాదె యీ
దీనత్వంబున నుండఁ జాల మిచట న్దిక్కెవ్వరున్ లేరుగా
నానాభోగవితాన సౌఖ్యరతుల న్నర్మోక్తులం జేరుచు
న్నానారీతుల నేలువా రెవరు విన్నాణంబుగాఁ బ్రీతితోన్. 31

తే. దేవతాశ్రేష్ఠుఁ డాదిగ దేవతతుల, నెన్న రాని తపంబున నెలమిఁ బొందఁ
జేసి మృతిలేక యుండ నీక్షితిని దివ్య, వరము లొందినవాఁడ వవార్యతేజ. 311

క. నినుఁ జూచిన లోకస్థులు, ఘనభయవిత్రస్తులగుచుఁ గాంతారములన్
మునుకొని దాఁగుదు రయయో, వినవింతలు పుట్టెనేఁడు విశ్వములోనన్. 312

శా. రామాశ్వంబును దెచ్చినందునఁ గదా రక్షోధిపా నీకు నీ
భూమిం జావొనఁగూడె లేనియెడలం బూర్ణంబుగా నిత్యమున్
భూమానందరసాబ్ధిలో మునుఁగుచుం బుత్రాదులం గూడి బల్
ప్రేమన్ సౌఖ్యము నొందుచుందువుగదా పేరొందగాఁ బెంపునన్. 313

క. వినవైతివి మామాటలు, గనవైతివి కార్యసరణి గర్వముతోడన్
జనవైతివి శ్రీరాముని, ఘనసన్నిధి శరణుచొచ్చి కావు మటంచున్. 314

సీ. తొల్లి సురాధీశు దురమున నోడించి పావకు మర్దించి పట్టి యమునిఁ
గాఱించి నైఋతి గాసిల్లఁగాఁ జేసి వరుణుని నోడించి వాయుదేవు
సమరంబులో గెల్చి సాంబమిత్రు నిఁగొట్టి పరఁగ నీశానునిఁ బాఱఁదోలి
నీలావు లావుగా నిఖిలలోకంబుల నెగడినవాఁడవు నేర్పుతోడ

తే. నట్టి నీకిట్టి కష్టంబు పుట్టె నేఁడు, దైవకృత్యము నెవ్వరు దాఁటగలరు
కుడువక యెపోవునే తొల్లి గూర్చిఁ జేసి, నట్టి ప్రారబ్ధకర్మ మీ యవనిలోన. 315

మ. హరితో వైరముఁ బూని మున్నెవరు సౌఖ్యం బొందిరే చూడ నా
హరి రామాకృతిఁ దాల్చి దుష్టజనసంహారంబుఁ గావింప నీ
ధరలోఁ బుట్టినవాఁడు నీమనమునన్ దర్కింప లేవైతివో
పురుషవ్యాఘ్రమణి కన్నులెత్తి కరుణం బూర్ణంబుగాఁ జూడవే. 316

క. శోకింప వలదటం చని, మాకుం బోధింప వేల మాన్యచరిత్రా
శోకాబ్ధి మునిఁగి నారము, చేకొని రక్షించువారు క్షితి లేరుకదే. 317

క. ఎప్పుఁడు నీనగుమొగముం, గన్నులకింపొందఁగాఁ గనుగొందుమొ నీ
కన్న మఱెవ్వరు గతి మా, కున్నారా జగతిమీఁద నూహింపంగన్. 318

క. ఎక్కడికేగుదు మింక మే, మెక్కడ నివసింతు మెవరు హితమగు తెలుపున్
జక్కఁగఁ జూపుదురీయెడ, దిక్కెవ్వరు మాకు నేఁడు తెలిసుక చెపుమా. 319

శా. ఆరామక్షితిపాలునాజ్ఞఁ గొని నిత్యప్రాభవోపేతుఁడై
సారాచారుఁడు వాయుసూనుఁడు మహాసద్ధర్మతన్వచ్చి నీ
తారామాధిపుశౌర్యబాహుబలసత్త్వాది ప్రచారంబులన్
సారెం జెప్పి మఖాశ్వ మిమ్మతనికిన్ సౌఖ్యంబు చేకూరెడిన్. 320

క. పలుదుర రామునితోఁ బగ, బలురుపగర్వాంధ మతని బంధుతుక్షితిన్

సలలితముగ వర్తించును, తెలియుము నరుఁడతఁడు కాఁడు దేవుఁడు కనుమా. 321

క. అని నీకు హితము గఱపిన, వినక వ్యాయముఁ జూని బట్టి వేగమె చంపం
గను యత్నించినఁగని యా, ఘనుఁడదరక నిన్నుఁదన్ని కడక న్నడిచెన్. 322

ఉ. ఆకపినాథుమాటలను హర్షముతో విని యున్న నీకు
ప్రాకటమైనకష్టమును బ్రాప్తముగాదుకదా సురారి మే
మీకథ గుర్తెఱింగి జగదీశ్వరుతోఁ బగ వల్దటంచుఁ బ
ల్కీకను జెప్పిన న్వినక వేంద్రపుఁజూపులఁ జూచి పెట్టఁగన్. 323

క. చీపొమ్మనిఁగదింపుచుఁ, గోపంబునఁ దిట్టితపుడు గొనకొని కర్మం
బీపట్ల ననుభవించితి, వాకదవాటిల్లె మాకు నకటా యిచటన్. 324

ఆ. మృత్యువునకు నీవు మృత్యువై యుండియు, మృత్యుచేతఁ జిక్కి మృతినిఁ జెందు
టరయ మాకుఁ జిత్రమయ్యె నం చని నాథుఁ, గొంత మేఱఁ దలఁచి కూలియున్న.

క. పతితలలు తొడల నిడికొని, క్షతనేత్రజలంబుచేతఁ దడపుచు మరలన్
గుతలంబునఁ బొరలింపుచు, నతిఘోరముగాఁగ నేడ్చె రాణో దేవి. 326

విభీషణుఁడు సహస్రకంఠుభార్యల నూరడించి హితంబుపదేశించుట

క. దానవకాంతల దుఃఖము, దానవనాథుండు మాన్ప ధరణీశభువా
జ్ఞానమతుండై చని యా, మానినులం జూచి పల్కె మంజులఫణితిన్. 327

క. భవదీయనాథవసధిని, భవహారుఁడైనట్టి రామభద్రుని శరసం
భవపావకుఁ డీవేళను, భువనంబుల లేక చేసెఁ బురుణింపంగన్. 328

క. రామామోఘప్రహారిని, భీమాసురపర్వతంబు భేదించె నెసన్
గామినులారా వగచిన, నేమిఫలప్రాప్తికలుగు నిఁక మీకరయన్. 329

ఉ. పుట్టినవారు గిట్టకయె భూమిని నుందురె సార్వకాలమున్
బుట్టినకాయలన్నియును బుట్టినతీరునఁ జెట్టునుండునే
పుట్టుచుఁ గిట్టుచున్ సకలభూతచయం బిటులేగుచుండు నీ
గుట్టును మీ రెఱింగి కడుఁ గ్రూరమనోవ్యథఁ బాయుఁ డొప్పుగన్. 330

క. మానినులారా శ్రద్ధగ, మానుగ నేఁ గఱపునీతిమార్గము వినుఁడీ
మానుఁడు మానసదుఃఖము, గానఁగఁ జర్వపదము గావున భక్తిన్. 331

తే. బ్రహ్మవలనను గల్గెనవ్యక్త మొకటి, దానివలన మహత్తను తత్త్వమయ్యె
నమ్మహత్తత్త్వజనితమైయలరెఁ జుమ్మి, తగ నహంకారమనునది దైవగతిని. 332

తే. పంచతన్మాత్రలంత సంభవము నొందెఁ, బంచభూతాళి వానిచేఁ బరిఢవిల్లె
నంబరంబున నుత్పన్నమయ్యెఁ బవనుఁ, డతనినుండియె యనలుండు ధాయుగ్నివలన. 333

క. అప్పులు కలిగెఁ దానం, దప్పక భువి జనితమయ్యెఁ దద్ధరవలనన్
ఒప్పుగ నోషధితతి పెం, పొప్పగ జన్మించె నంత నుత్కటమగుచున్. 334

తే. సర్వసస్యంబు లోగిఁబుట్టెఁ జారుకాంతి, చేతఁదత్సస్యములనుండి చిత్రమైన
ధాన్యసందోహములు కల్గె ధరణిమీఁద, సకలజీవిగణవ్రాతశర్మమునకు. 335

ఉ. అన్నము పుట్టె వీర్యభవ మంతట దాన జనించెఁ బ్రీతిమై
నన్నలు పూరుషు ల్గలిసి యంగజుకేళిఁ బెనంగ నయ్యెడన్
గ్రన్నన శుక్లరక్తములు గర్భములోపలఁ జేరి పిండమై
పన్నగ వృద్ధిఁజెందె కడు భాసిలి జీవముగల్గి పిమ్మటన్. 336

క. తడబడి నవమాసంబులు, గడచిన గర్భమునుండి కరువలిచేతం
గడువడిఁ ద్రోయంబడి తాఁ, బుడమిన్ జన్మించు దేహి పూర్వకర్మముచేన్. 337

తే. చిన్నతనమునఁ బ్రాణులు ప్రీతినాడి, తరుణులై కామభోగేచ్ఛఁ దనివి నొంది
వృద్ధులై కష్టములఁ జిక్కి చెలయుచుంద్రు. గాని మీఁదటిగతి వారు గానలేరు.

క. వనరుహనేత్రుని మాయం, గనఁజాలక వెఱ్ఱులగుచు గర్వముతోడన్
ఘనులను దూఱుచు దుష్కృతి, మనకుం బొల్పడును రెల్ల మూఢులు పేర్మిన్.

తే. ఈషణత్రయసంసర్గ మెపుడు మాని, షోడశములగు షడూర్ములఁ గూడి చెడక
ద్వంద్వములబొందు నందక డెందమందు, నిందిరేశుని సేవింప నెసఁగు సుఖము.

క. సరసిరుహపత్రేక్షణు, చరితామృతపానులగుచుఁ జరియించెడిస
త్పురుషులను దప్పనవ్వుల, దురితాంబుధిఁ ద్రోయుచుండు దుష్టేంద్రియముల్. 341

తే. అనిలమానసములను సహర్నిశంబు, లందు నేస్తంబు పెంపొందఁ బొందుగాను
చిత్తమేవంకఁబోయినఁ జెలఁగి పవనుఁ, డామనంబును నిత్యంబు నంటి తిరుగు. 342

క. సకలేంద్రియతతి దానిం, బ్రకటితముగఁ గూడి చనుచు బరమప్రీతిన్
వికలాత్మఁ జేయు నెంతటి, సుకవీశ్వరునైన నదియుఁ జోద్యముగాఁగన్. 343

క. యోగాభ్యాసమువలనన్, బాగుగ మానసముఁబట్టి బంధించినచో
రాగద్వేషయుతాఖిల, భోగేంద్రియరాశి వశముపొందును జుండీ. 344

మ. కలలోఁగన్న పదార్థ మశ్వరముగాఁ గన్పట్టునెబ్భంగి నీ
యిల నాచందము నొందుచుండు గరిమ న్నెవంక దేహేంద్రియా
దులపైఁ బ్రీతి నటింపకే సతతముం దుష్టిం బ్రవర్తింపుచున్
వలనొప్పారఁగ దుఃఖరాశి గడువన్ వాంఛింప మేలేర్పడున్. 345

చ. పరఁగ ఋణానుబంధమున భర్తృసుతాదుల పొందుఁగల్గు ని
ర్భరముగ నెప్పు డాఋణము పాయునొ తోడనె తత్తనూజనుం
దరగృహనాథవర్గములు ధారుణి నాశము నొందుచుండు ని
బరణిని మీరెఱింగి వరసద్గతి కేగెడివాంఛఁ గోరుఁడీ. 346

క. ఈరాముఁడు మానవుఁడే, నా రాక్షసరాజచక్రనాశముకొఱకై
ధారుణిఁ బుట్టెను నిర్జర, వారప్రార్థితుఁడు నగుచు వరదుం డెలమిన్. 347

క. అనయము సజ్జనపోషణ, మును జేయఁగ దుష్టజనులఁ బుడమిం గూల్పం
గను మదిఁ గోరుచు జనకుని, పనుపున దారానుజన్మపరివృతుఁ డగుచున్. 348

చ. చని ఖరదూషణాదిసురశాత్రవసంఘముఁ జంపి పిమ్మటన్
వనితను బాసి దుఃఖమున భానుజుఁ జేరి తదగ్రజన్మునిన్
ఘనముగ నొక్కబాణమునఁ గాశ్యపిఁ గూల్చి రయంబుమీఱ నా
వననిధిఁ గట్టి ధైర్యమున వానరకోటులఁ గూడి పెంపునన్. 349

ఉ. వారక రావణాదుల నవార్యబలాఢ్యుల శౌర్యధుర్యులం
బోర వధించి మానులను బుద్ధుల రంజిలఁ జేసి వేగ భూ
భారము వాపి రాజ్యము సుభాసురకీర్తిఁ జెలంగ నేలుచున్
సారెకు సర్వమానవుల సంతసమొందఁగఁ జేయుఁ గూర్మిమై. 350

తే. అట్టి దేవాదిదేవుని విమలయశుని దురితదూరుని సంతతసంతుష్టమతిని
రామచంద్రుని రాక్షసప్రకరహరుని, సార్వకాలంబు మదిలోన సరసభక్తి. 351

క. తలపోయుచు దుఃఖము మీ, తలపులలో విడిచి సద్మతతికిం బ్రీతిన్
వలనొప్పఁ బోవు టొప్పును, సులలితముగ మీమగండు సద్గతిఁ జెందెన్. 352

తే. అని విభీషణుఁ డాదనుజాధినాథుఁ, సతుల నూరార్చి వేగమె సద్మములకు
ననిపి తత్పుత్రుఁ బుష్కరాక్షాఖ్యఘనుని, బాహుబలధుర్యుఁ గైకొని భాసురముగ.

ఉ. వచ్చి రఘుప్రవీరువరపాదసరోజయుగంబుపైన నా
సచ్చరితాత్ము వైచి యల సారసనేత్రుని రామచంద్రునిన్
నిచ్చలు భక్తితోఁ గనుచు నేర్పునఁ బల్కెను మంజుసూక్తులన్
మచ్చికతోడ రామ జనమాన్యచరిత్ర పవిత్ర శ్రీకరా. 354

క. కరుణాసాగర శుభకర, నిరుపమగుణధామ రామ నిర్మలధామా
గురుబలసహస్రకంధర, వరపుత్రుఁడు వీఁడు వినయపరుఁ డురుభీతిన్. 355

తే. నీశరణు చొచ్చెఁ గావునఁ నేఁడు వీనిఁ, గావుమీ చిత్రవతికిని గరుణ రాజు
గాఁగఁ జేయుమటంచని కర్బురేశుఁ, డగువిభీషణుఁ డాడినపుడు వినుచు. 356

సీ. పరపురంజయుఁడును బాహుబలుండునా రామచంద్రుఁడు దయారసముచేత
దనపాదములమీఁదఁ దరలనిభీతిచేఁ బడియున్న దశశతవదనపుత్రుఁ
బుష్కరాక్షునిఁ జూచి పూర్ణకృపాదృష్టిఁ జేత నిట్లనియెను జెలువు మిగుల
దనుజేశవరపుత్ర తతదివ్యగుణపాత్ర పెద్దతోఁ బాదము ల్విడిచి లెమ్ము
తే. భద్రమగుఁగాక నీకు నీవసుధమీఁద, సకలభోగంబులకు మహాస్పదముగైన
చిత్రవతిలోన నెప్పుడు చెన్నుమీఱఁ, గాపురముచేయుచుండుమా కాంతిగుణ్య. 357

క. జనకునికిని సంస్కారం, బనఘా కావించి కీర్తినందుము కడలన్
ఓనరుం బుణ్యము సాధ్వస, మును లేదు నిజంబుగాను ముల్లోకములన్. 358

{ శ్రీరాముఁడు పుష్కరాక్షునికిఁ బట్టముగట్ట భరతుని నియోగించుట. }

మ. అని శ్రీరాముఁడు పల్కసంతసముతో నావేళ నుత్సాహియై
తనచెంత న్నివసించియున్న భరతున్ ధర్మాత్ముని న్ధన్యునిన్
గనిపల్కెన్ భరతేశ నీవిఁగొనుచున్ గల్యాణభూయిష్ఠమై
ఘనసౌఖ్యాకరమై విచిత్రతరమై కన్పట్టుచు న్గాంతితోన్. 359

తే. తివురుచుండిన చిత్రవతీపురంబుఁ గాన నేగి తదీయసంస్కారమెలమి
నితనిచేతను జేయించి హితవుగుల్క, గాను నభిషిక్తుఁగావించి కరుణమించి. 360

క. ఎకిమీనిఁ జేసి మంత్రి, ప్రకరము వెనువెంట రాఁగ భాసురలీలన్
బ్రకటితముగ నాచెంతకు, నకళంకస్థితిని నీవి నవఘా తెమ్మా. 361

ఉ. భానుకులాబ్ధి చంద్రుఁ డిటుపల్కిన నాభరతుండు వేడ్కతో
దానవనాథసూనుని వితర్పితమార్గణుఁ బుష్కరాఖ్యునిన్
మానుగఁగూడి సర్వసుఖమాన్యుఁడునై వరశోభనంబునై
గానఁగవచ్చు నప్పురిని గ్రక్కునఁ జొచ్చి నిశాటకోటులున్. 362

క. గుములై తమఁగని మెండుగ, సుమములు పైఁజల్లి పొగడి చూచుచునుండన్
విమలంబుగ నిజకాంతులు, క్రమముగఁగడలందు మిగుల రాణింపంగన్. 363

తే. రాజమార్గప్రవిష్టులై రమ్యరత్న, సానుశిఖరోపమంబును జారుకాంతి
శారికాకీరకలహంస సంభృతంబు, పరమకేకీచమూయుక్త భాసురంబు. 364

సీ. కనకమయానేక కలశసంయుక్తంబు ద్వారకవాటవితానరాజి
రాజితంబు విశేషరత్నసంఘుష్టంబు బహుళవాతాయన భాసురంబు
భామినీసుమచక్ర భర్మసాలోన్నత స్వస్తికమాక్తిక ధ్వజసురాజి
సంఘుభూయిష్ఠంబు సాలరసాలాది పాదపసందోహ బంధురంబు

తే. రాజమండలదీప్తంబు ప్రకటసౌధ, రాశిరత్నప్రభాజాలరంజితంబు
నైన దశశతవదనుని హరిహర్మ్యమును బ్రవేశించె భరతుండు ముదముపొదల. 365

క. మగని న్మనములఁ దలఁచుచు, వగనొందుచు హా యటంచు వసుధంబడుచున్
దిగులొందుచున్న రక్కస, మగువలఁగని పల్కె నపుడు మమత దలిర్పన్. 366

ఉ. భామినులార మీమగఁడు భాసురసద్గతికేగె నీయెడన్
జేమఱి మీరుదుఃఖమున గ్రేగుట మంచిదికాదు జీవులీ
భూమిని నాయువుందొరఁగి పోయినవెంటనే చావకుందురే
కామసముద్రమగ్నులయి గాసిల నేటికి నిత్యమిత్రియన్. 367

క. మీమనసుల కెల్లప్పుడు, రామామణులార చారురఘురామవిభున్
శ్రీమమునఁదలఁచుచుస్థిర, కామితసుఖపదము గల్గఁ గడుపడితోడన్. 368

క. అని హితవచనంబులచే, తను దానవనాథసతుల తతశోకంబున్
మునుముట్టఁ బాప వారలు, ఘనదుఃఖము మాని రంతఁ గరుణామతియై. 369

తే. వేదవిహితాగ్నిసంస్కారవిధులఁ దొల్తఁ, దత్తనూజునిచేత నా దశశతాఖ్య
దైత్యపతికిని జేయించి దశదినోర్ధ్వ, కర్మ నెఱవేర్పఁ జేయించుచుఁ గౌతుకమున. 370

క. రతనాలగద్దెమీఁదను, మతిమంతునిఁ బుష్కరాఖ్యు మాన్యచరిత్రున్
కృతకౌతుకమంగళఘను, నతిముదమున నునిచి తాను హర్షముతోడన్. 371

క. బంగారుకలశములలోఁ, బొంగారెడి సర్వతీర్థ పుష్కరములచేఁ
జెంగున నభిషేకంబును, శృంగారముమెలఁగఁ జేసి జేజేలలరన్. 372

ఉ. ఆయెడ వేత్రహస్తులు మహాత్ములు నాయకనాయకోత్తముల్
నాయకకార్యకర్మముఖసాధనబాహులు కార్యవాహులున్
శ్రీయుతులై నధీయుతులు చిత్తము లుల్లసిలంగ నాయులై
పాయక తత్కుమారునెడ బాళిచెలంగఁగనుండి రింపుతోన్. 373

చ. పడపడి రాఘవానుజుఁడు భాసురచామరముఖ్యశోభితున్
సదమలగాత్రు మంత్రిహయసంయుతుఁ బుణ్యుఁడిఁ బుష్కరాఖ్యుని
న్నుదమునఁ గొంచు రాఘవుని మ్రోలను జేరి శిరంబువంచి త
త్పదకమలద్వయంబునకు భక్తిగ నంజలిఁ జేసి సాశ్వసిన్. 374

తే. పుష్కరాఖ్యు సమర్పించెఁ బొలుపుమిగుల, నంతసర్వసుపర్వులు యతులు మునులు
మర్కటులు దానవోత్తము లాసనములందు, సంతసించుచునుండిరి సరసిజాక్షి. 375

క. ఈకరణి రామభద్రుఁడు, ప్రాకటముగ దశశతాస్యు బవరములోనన్
భీకరశస్త్రంబులఁ బర, లోకంబున కనిపె నెల్లలోకులు మెచ్చన్. 376

క. తారేశానురసోదర, వారసమాశ్లిష్టుఁ డగుచుఁ బార్థివుఁ డెలమిన్
సారెకు జనములు పొగడ నుదారపరాక్రముఁడు వెలిఁగెఁ దా రణమందున్. 377

## బ్రహ్మదేవుఁడు శ్రీరాముల నుతించుట

మ. గిరిజా చెప్పెద శ్రద్ధతోడ వినుమా గీర్వాణసంయుక్తుఁడై
సరసీజాసనుఁ డేగుదెంచి సకలక్ష్మాపాలచూడామణిన్
ధరణీజాహృదయాబ్జపూషుని సదర్మాత్మునిన్ రామునిన్
సరసీజేక్షణుఁ జూచి మ్రొక్కి పలికెన్ సద్భక్తి పెంపారఁగన్. 378

క. రామ మునీశ్వరదేవ, స్తోమామలహృదయధామ సుందరనామా
నీమహిమఁ దెలియఁదరమా, భీమాసురసంఘభీమ పృథుబలరామా. 379

తే. అగ్రజన్ములయందు హోమమందు సర్వ, భూతములయందు దిశలందుఁ బొలుపుమిగులఁ

బర్వతములందు నభమందు వనములందు, నిండియుందువు చూడంగ నేర్పుతోడ.

ఉ. వేయి శిరంబులుం గనులు వేయిపదంబులు వేయిచేతులున్
శ్రీయుత నీవు దాల్చి సరసీజనపర్వతవృక్షనిమ్నగా
తోయధికాననాదియుతదుర్భరధాత్రి ధరించి వేడ్కతో
నేయెడనైన భాసిలుదు వీశ్వర మానిహృదబ్జభాస్కరా. 381

క. లోకంబులన్ని చెడి పెం, జీకటిరై యుండు వేళ జీవననిధిలో
శ్రీకరవటపత్రంబునఁ, బ్రాకటముగ నుందు వీవు బాలునిరీతిన్, 382

క. దేవా నీముఖమున భూ, దేవతలు కరంబులందు ధృతిమంతులు నా
భూవరులు తొడల వైశ్యులు, వావిరిజన్మించి రంఘ్రిపదమున శూద్రుల్. 383

క. మనమునఁ జంద్రుఁడు కన్నుల, నినుఁడును బ్రాణములవలనఁబృషదశ్వుఁడు నా
భిని సురవర్త్మము శీర్షంబున నాకము గల్గె నీకుఁ బురుషశ్రేష్ఠా. 384

క. శ్రవసుల దిక్కులు గలిగెన్, అవనియుఁ బదజనిత మయ్యె నందంబుగ సం
భవమొందె వారియు నీముఖ, భువనజమునఁ బొలుపుమిగుల భువనాధీశా. 385

తే. నీహృదయమేను రఘురామ నిత్యధామ, వాణి నీజిహ్వ భవదీయ భాసురాంగ
రోమసందోహములయందు రుచిరకాంతి, భూర్జతరు లగు దేవతల్ పుట్టిరెలమి. 386

క. పరమబ్రహ్మము నీవే, నిరుపాధికసర్వజగము నీలోనుండున్
గరుణాసాగర శుభకర, పరమేశ్వర దురితదూర పరహితకారా. 387

ఉ. స్థావరజంగమంబులును జారుచతుర్దశలోకముల్ మహా
పావనదేవపక్షిపశువారమ్ము గాగ్నిపురోగమాద్రులున్
జీవనరాసులున్ సకలచిత్రపదార్థవిశేషధర్మముల్
భూవనసత్త్వమానులును బొందుగ నీహృదయంబులోపలన్. 388

చ. కలవు పరాత్పరా పరమగణ్య శరణ్య పరాత్మ శ్రీకరా
జలరుహనాభ సర్వగత సర్వచరాచరసాక్షి చిన్మయా
లలితతపఃపరా సకలలక్షణ లక్షితనిర్వికల్పని
ర్మలభవరోగనాశబుధమాన్యచరిత్ర పవిత్ర రాఘవా. 389

సీ. సతతనిరాభాస సాకేతపురివాస కంధిగంభీర భీకరవిదార
నిశ్శంకనిర్లేప నిష్కామనిర్బాధ నిఖిలసుఖప్రదనిపుణధీర
సకలాఢ్యశుభకరసర్వేశసమభావ సత్యసంకల్పక సత్యవాక్య
జగదన్వయాకార జగదేకగురువీర జగదుదయాకార చారుహార

తే. ప్రకృతిహీన నిరంజన ప్రబలదనుజ, భీమ రఘుకులసోమ విభీషణాసు
రేంద్రరక్షణనీకంటెనెక్కుడైన, దేవుఁడెవ్వఁడు కలఁడుర్విఁ దివిరిచూడ. 390

క. గురుబోధధీప నిర్మల, గురుమధురాలాప హేమగురుమణిచాపా

నిరతవినాశితపాపా, నిరసితబలశౌర్యభూపనిర్గతకోపా. 391

క. కొందఱు నిను సగుణునిగాఁగను, గొందఱునిర్గుణునిగాఁగ గురుతరభక్తిన్
డెందములఁ దలఁపుదురు గో, విందజగద్భారహరణ వివిధాభరణా. 392

మ. వరదా నీచరణాబ్జముల్ మనమున న్వర్ణించి వారున్నతిన్
ధరపై మృత్యుశిరంబుఁదన్ని వెలుచన్ దర్పించి సంసారదు
ర్భరపాథోనిధి దాఁటి పావనులునై రాణించు నీలోకసు
స్థిరసౌఖ్యంబుసు జెందుచుందురుకదా దీప్తిన్విజృంభించుచున్. 393

ఆ. నిన్నుఁ బ్రతిదినంబు నియతితోఁగొల్వని, వారు పవనపూర్ణభస్త్రిచయము
పోలె సంతతంబు నుచ్ఛ్వసనంబుల, విడుచుచుంద్రు కోర్కి విస్తరిల్ల.

మ. అనఘా యెప్పుడు నీస్వరూపములఁ బ్రత్యక్షంబుగా దృష్టులన్
గనఁగా శక్తులుగారు శాస్త్రములచేఁ గన్పట్టివర్తించునీ
వనయంబుం దతచిత్స్వరూపమున ధాత్ర్యాదిప్రపంచంబు సం
జననంబేర్పడె నంతకన్న మునుని జర్పింపలే నచ్యుతా. 395

క. నలి నెండగాలి పాంథులు, జలమందునఁ గ్రుంకి ఘోరసంతాపంబున్
లలిదాఁటుకరణి దాఁటుదు, రిలభవతాపంబు మనుజు లీశు భజనచేన్. 396

క. నీమాయఁ దెలియఁదరమా, ధీమంతులునైన బుధులు తెలియఁగ లేకే
భూమిన్మధుమక్షికసం, స్తోమంబుల మాడ్కిఁజిక్కి చొక్కిరిలేశా. 397

ఆ. మనసు నిగ్రహించి మానితసంసార, వాంఛ విడిచి పరమభక్తి మించి
చిత్తమందు నిన్ను స్థిరముగాఁ జింతించి, భవభయంబు ప్రజలు పాయవచ్చు. 398

విభూతివృత్తము. మోక్షలక్షణేక్షణా మోక్షభాగ్యరక్షణా
మోక్షమార్గదాయకా మోక్షసౌఖ్యనాయకా. 399

ఉపజాతివృత్తము. సర్వాధారా సుగుణవిగుణా సర్వజీవాధివాసా
సర్వాతీతా సుగుణవరదా సర్వగీర్వాణమోదా
సర్వవ్యాపీ సకలహృదయా సర్వవిశ్వాంతరాత్మా
సర్వాధ్యక్షా కమలచరణా సర్వకార్యప్రవీణా. 400

క. రామా మునిజనకామా, కామాదివికారదూర కరుణాధారా
ప్రేమన్గావుము జగదభి, రామా సత్కీర్తిధామ రఘుకులసోమా. 401

క. ఈరీతి నజునిచే రఘు, వీరుఁడు పొగడంగఁ బడుచు వెలిఁగె న్మిగులన్
సారోదారప్రాభవ, శూరులు కని మెచ్చుచుండ సురుచిరలీలన్, 402

తే. అంతబలకీర్తిశాలియై యలరుచున్న, పుష్కరాక్షుండు రఘురాఘుపుంగవాబ్జ
చరణముల దివ్యనవరత్నచారుపుష్ప, సమితిచేతను బూజించె సంతసమున. 403

క. ఘనభక్తిమిగులఁ గ్రమ్మఱ, జనవాభుండైన రామచంద్రునిఁజిత్తం

బున నిల్పి తన్మయత్వం, బున మెలఁగుచునుండె నతఁడు పూర్ణప్రీతిన్. 404

చ. రఘుకులసోముఁడై నరఘురాముఁడు రాక్షసరాజవంశసం
భవకృతపూజఁ గైకొనుచుఁ బల్కెను నాతనిఁ జూచి ప్రీతితో
శివమగుఁగాక నీ కసురశేఖర నీజనకుండు గర్వియై
కపులను యోగిపుంగవులఁ గాంతల మానులఁగాసి పెట్టుచున్. 405

తే. లోకకంటకుఁడై మహాలోభబుద్ధి, మెలఁగినందున దురమున మేటికోల
లను వధించితి నాతని ననఘ నీవు, బుద్ధిమంతుఁడవై యుండు పుడమిమీఁద. 406

క. దీనులయెడ విశ్వాసము, మానుగఁ గైకొనుచు దురభిమానుల వేగం
బోనీక చంపి సంతత, దానధురంధరుఁడ వగుము దానవనాథా. 407

## శ్రీరాములు మరలి యయోధ్యకు వచ్చుట

క. అని నీతిగఱపి రాముఁడు, తనతమ్ములఁ గీశతతుల దానవపతుల
న్మనసారఁగూడి పుష్పక, మును నెక్కి సురౌఘ మెలమి ముదమునఁ బొగడన్. 408

తే. చిత్రవలి డించి సంతోషచిత్త మమర, నేడుదీవులు గడిచి యహీనహేమ
నగముపైఁ జేరి రాజిల్లె నలినమిత్రుఁ, డుదయగిరిపైన వెలుగొందుచుండు రీతి. 409

క. రామాజ్ఞఁబొంది నిజహృ,ద్ధామంబుల నధికభక్తిఁ దలఁచుచు దివిజ
స్తోమంబు లోలి నిజగృహ, సీమలఁ జేరంగఁ జనిరి చెలువము మీఱన్. 410

ఉ. మేరునగంబు భక్తిగ నమేయకనత్కనకాఢ్యరత్నము
ల్గూరిమి రామభద్రునకుఁ గోరి యొసంగెను మోక్షకామియై
సారసుభక్తితో నపుడు సారసనేత్రుఁడు రామచంద్రుఁ డిం
పారఁగ వానిఁ గైకొనుచు భాసురసైన్యసమేతుఁడై వడిన్. 411

క. భేరీతూర్యాగురుధ్వని, దారితదిఙ్ముఖుఁడు నగుచు దర్పముతోడన్
ధీరులు మాన్యులు నృపతులు సారెకుఁ దనుఁ జూచిచూచి సంతసమొందన్. 412

తే. మంగళాలంకృతము మహామంజురత్న, ధర్మమణికాంతిసంభృతభాసురమ్ము
హస్తిరథసైన్యవాజిప్రశస్తవిబుధ, పూరితం బగు సాకేతపురవరంబు. 413

క. చొచ్చి మహోన్నతభాగ్యుఁడు, సచ్చరితుఁడునైన రామచంద్రుఁడు పేర్మిన్
ముచ్చటలూరఁగ నుండెవి, యచ్చరు లానంద మొంది యాడుచు నుండన్. 414

సీ. అప్పుడు సంతోష మంతరంగమ్ముల నుప్పొంగుచుండఁగా నొప్పుమిగిలి
పల్లవారుణపాణిపల్లవోజ్జ్వలలును గరిరాజగమనలు కమలవైరి
వదనలు సరసిజపత్రనేత్రలు మహాసుకుమారతనులతాశోభితలును
పంచాస్యమధ్యలు పక్వబింబోష్ఠలు నాచాన లావేళ హర్మ్యశాల

తే. గోపురప్రాంతములనుండి కువలయేశుఁ, డైన శ్రీరామచంద్రుని నమలయశుని
జూచి మనముల నుబ్బుచు సురుచిరముగ, వినుతిఁ జేయుచు నుండిరి వివిధగతుల. 415

క. శ్రీయుతుఁడు రామచంద్రుఁడు, జాయామణిఁ గూడి పీతి సవనముఁ జేయం
గా యత్నించె మనంబున, నాయెడ సురతుష్టికొఱకు నధికప్రీతిన్. 416

తే. ఇట్లు తలపోసి సభదీరి హితులఁ గార్య, రతులఁ దమ్ములఁ గనుఁగొని రమణఁ బల్కె
నశ్వమేధం బొనర్చెద నఖిలవస్తు, వితతి నొనఁగూర్చ నియమించి వేడ్కతోడ.

మ. ప్రకటోర్వీరమణప్రధానుల మహాబాహాబలోపేతులన్
సుకవీశుల ధర్మమార్గరతులన్ జుట్టాల వైశ్యాదులన్
సకలాచారధరామరేంద్రతతులన్ సన్మాన్యులన్ గణ్యులన్
అకలంకస్థితిఁ బిల్వనంపుఁ డని తానాడంగ వారంతటన్. 418

క. రామాజ్ఞ నొంది యెల్లరఁ బ్రేమం బిలిపింప జనులు వేడుకలూరం
గామదిఁ బొంగుచు వచ్చిరి, శ్రీమహితాయోధ్య కపుడు చెన్నలరారన్. 419

## శ్రీరాముఁడు వసిష్ఠాదులఁగలసి యశ్వమేధ మొనర్చుట

క. అమ్మఖమున ఋత్విక్కర, ణమ్ము వసిష్ఠాదిమానిసాధులకు విభుం
డిమ్ములనిచ్చినఁ గైకొని, సమ్మోదము చెంది దివ్యపరయువుపొంకన్. 420

తే. గౌతమాత్రేయజాబాలి కణ్వరైభ్య, వామదేవభరద్వాజవాలఖిల్య
గాధిసుతకుంభసంభవ కశ్యపాత్మ, జాదు లగుమానిసత్తముల్ హర్ష మొప్ప. 421

మ. హయమేధార్థము శాస్త్రసమ్మతిగ నుద్యచ్ఛాలలంగట్టఁగా
నయమార్గస్థులఁ బంపి పిమ్మటను విన్నాణంబుగా వానిలో
నియమంబొప్పఁగ వేదులెల్లఁ గడఁకన్నిర్మింపగాఁ జేసి దు
ర్భయవిధ్వంసకు భూసుతేశు నమలుం బ్రహ్మాండభాండోదరున్. 422

క. రాముని దీక్షాసహితుని, భూమిజతోఁగూడ నఖిలభూజనులెల్లం
గామించి చూడ నమ్మఖ, భూమిఁ బ్రవేశింపఁ జేసి పొంకుగ వారల్. 423

తే. భద్రకరదివ్యవాద్యరవంబు సకల, దిశలఁ బెంపారుచుండఁగ దివిజతతులు
చదలుపైనుండి సంతోషసహితులగుచుఁ, జూచుచుండఁగ నావేళ సురుచిరముగ.

క. ప్రాతస్సవనము దొలుతన్, బ్రీతిగ మాధ్యందినంబుఁ బిదప సత్కీర్తిన్
ఖ్యాతిగఁ దృతీయసవనము, సీతాపతిచేత నపుడుచేయించి రొగిన్. 425

క. శ్రుతినాద మంతకంతకు, వితతంబై పెంపుచెంద విబుధశ్రేణు
ల్మతిమంతులు సుగుణాఢ్యులు, సతతము విని చోద్య మందసాగిరి మఱియున్.

సీ. సొరిది ఋగ్వేదయజుర్వేదసామవేదస్థమంత్రజములై తనరుచున్న
స్వాహాస్వధాకారవారవషట్కారములనొనర్పఁగఁ జేసి రెలమిమీఱ
నతిరాత్రనామక మహ నాప్తోర్యామ గారుడచయనము లగ్నికబైల్వ
షట్కంబు ఖాదిరషట్కంబు కాంచన త్రికజంతుఫలషట్క మొకటఁ జేర్చి

తే. యిర్వదొక్కటియూపము లేర్పరించి, లలితవస్త్రాక్షతలచే నలంకరించి
యాగమోక్తవిధానంబు ననుసరించి, నిల్పి రవనిని వానిని నియతితోడ. 427

ఉ. ఆయెడ లోకమాత వినయాదిగుణోన్నత భక్తరక్షణో
పాయసమేత దివ్యమణి భర్మసుభూషణభూషితావనీ
తోయజనేత్ర భవ్యనుత తోఁపుభక్తిని రాత్రినంతయుం
బాయక యశ్వమేధహయపావనసేవను జేసె నిష్ఠతోన్. 428

క. ఆహయసవమునఁ బ్రీతిన్, ఆహూతులునగుచు దానవారాతులు స
స్నేహమునవచ్చి రమితో, త్సాహులునై రామవిభుని సరసను భక్తిన్. 429

ఆ. త్రిశతసంఖ్యగల్గు పశుసంహతినికుళ, రజ్జుశతులచేతఁ బ్రకటితముగ
బంధనం బొనర్చి పరగయూపస్తంభ, ములకుఁ గట్టిరపుడు మోహనాంగి. 430

క. యాజకులు వస్త్రభూషణ, రాజివిరాజితమునగుచు రాణించెడిదౌ
వాజినిగొనియూపాగ్ర, భ్రాజితగా రజ్జువులను బంధించి తగన్. 431

తే. మంత్రపూతను గావించి మగిడిదాని, ఛురికచేతనుఛేదించి సొరిదిమించి
గురువసిష్ఠుండు తద్వపఁ గొనుచునగ్నిఁ "బ్రకటితాశ్రావయ"యనుమంత్రములచేత.

తే. ఆహుతుల్వేల్చి పిమ్మట నాతురంగ, దేహకృంతనముచుజేసి తెగిచి యంగ
హోమమును జేసె దేవమహోపకార, ముగను మునినాథుఁ డావేళ మోహరించి.

శా. ఈరీతిం బశుసంహతిం ద్రిశతముం వేదోక్తమంత్రంబులన్
ధీరుండామునిపట్టి కట్టి వెలుచన్ దీపింపఛేదించి త
చ్ఛారీరస్థవపాంగహోమము లొగిన్ సంప్రీతితోఁ జేసె నో
నారీరత్నమ మానివర్గములు విన్నాణంబుగాఁ జూడఁగన్. 434

ఉ. పావకుఁ డాహుతుల్గొనుచు బంధురకీలల నంత సారెకుం
దేవపథంబుదాఁకగను దీవ్రసతో నిగుడించి ప్రోల్లస
ద్భావసమేతుఁడై వలయవద్ధాగ్నిఁ గ్రమ్మరె భద్రవాద్యన
ద్రావము మించె దద్విమలరమ్యహవిర్భుజులైరి దేవతల్. 435

క. రాముం డయ్యెడఁ బ్రేమం, గామించి యొసర్చునట్టిగంధర్వమఖో
ద్దామవిచిత్రముఁ గనుఁగొన, గా మదిఁదలపోసి పోసి కౌతుక మమరన్. 436

తే. జన్నిగట్టులగుములును జగదధీశ, వరులు మూఁడుపకొలములవారు పాద
జాతు లితరులు విస్మయ సహితులగుచు, గానుకలుగొంచు నచ్చిరి కౌతుకమున. 437

క. శ్రీరామచంద్రుఁ డధ్వర, చారువిచిత్రంబుఁజూడఁ జనుదెంచిన భూ
భారవహాదిజనంబుల, నారసి సంతోషమగ్నుఁడై యియ్యమునన్. 438

క. రేయుంబవళుల నిత్యము, పాయక జననికరములకుఁ బరమప్రీతిన్
జేయించిపెట్టెనన్నము, శ్రీయుతు లరుదెంచుచుండ శీతాంశుముఖి. 439

సీ. మహి మహితాద్రిసమానశాల్యన్న కూటకూటకటాహఘుష్టమగుచు
లవణమరీచ్యాజ్యలలితవస్తువ్రాత శాకాభిరామవిస్తార చూత
ఫలయుక్తమగుచు విభాసితనారికే ళామలరంభాఫలాళియట్లె
ద్రాక్షేక్షుసందోహరాజితం బగుచు మా షతిలాదిమూరాధ్యసారసాన్న

ఆ. భక్ష్యభోజ్యలేహ్యపాయసాపూపాది, సురుచివస్తుసంఘశోభితంబు
నగుచుఁ జూచువారి కతిశయవిస్మయా, కరము నగుచుఁ దోషకరము నగుచు 440

క. వెండియుసిద్ధార్థరసా, ఖండామ్రవిశేషఖాండ కలితంబగుచు
న్నిండుగ నుండిన యన్నము, మండితరాజితసుపత్రమండలమందున్. 441

చ. ఉనిచి నవీనగోఘృతము నొప్పుగ దొన్నెలఁబోసి వేడ్కతో
ఘనముగ భక్ష్యభోజ్యములు గాదిలివడ్డనచేసి తుష్టిగాఁ
గను భుజియింపుఁ డంచనఁగఁ గౌతుకమొప్పఁగ నెల్లవారొగిం
దిని ముదమంది మేమిపుడు తృప్తులమైతిమి సర్వభాగులన్. 442

ఉ. నీకు శుభంబు గీర్తియును నిక్కముగానగు రామచంద్ర సు
శ్లోకచరిత్ర యంచనెడి సూనృతమానవకోటివాక్యముల్
ప్రాకటరీతిగా వినుచు భావములోపల సంతసించుచు
న్నాకమలాప్తవంశజుఁ డహార్యపరాక్రము డుండెఁ బిమ్మటన్. 443

తే. ఇటుల నుచ్చావచంబులై హితముగుల్క, భోజ్యభక్ష్యాన్నరాసులఁబోలుపుమిగిలి
ఘోటకాధ్వరమొప్పారెఁ గొదువలేక, సర్వజనసమ్మతంబునై జగతిలోన. 444

క. సీతాభామాయుతుఁడై, భూతలపతియైనరామభూవిభుఁ డంతన్
ఖ్యాతిగ దీక్షాంతంబునఁ, జేతోమోదంబు గలిగి చెలువముమీఱన్. 445

తే. ఆవభృథస్నానమును జేసి యతులధివ్య, బహుళపశకోటిధనముల భర్మ రత్న
భూషణాంబరసంఘాతభూము లెలమి, బ్రాహ్మణులకును ఋత్విజప్రవరులకును. 446

సీ. ఉద్గాతృహోతల కున్న తాధ్వర్యున కును బ్రహ్మకును మదిఁగూర్మితోడ
నిచ్చిసత్కారంబు లెలమితోఁగావించి కపుల సన్మానించి కర్బురేశుఁ
డైనవిభీషణు నతనిసైన్యంబుల నధికమర్యాదల నాదరించి
దీనప్రజావళిమానసములుప్పొంగఁ గవులను బుధులను గారవించి

ఆ. తక్కనట్టివారిఁదనిపి యెల్లర నిజ, వాసములకుఁ బోవుఁగింగఁ జేసి
భూమిజాతఁగూడి భుజబలసోదర, సంయుతుండునగుచుఁ జతురగతిని. 447

క. పదివేలవత్సరంబులు, పదిలముగ నయోధ్య నేలి వరభక్తిగఁ దొం
బదిలోమ్మిదిహాయమఖములు, ముదమున నొనరించెఁ ద్రిదశముఖ్యు లలరఁగన్. 448

తే. మానవతి సీత నంతట మానిచంద్రుఁ, డైనవాల్మీకినివసించువట్టియాశ్ర
మమున విడిపింపఁగాఁ జేసి మరలభూమి, జాతరూపున బంగారుప్రతిమయొకటి.

క. కావింపఁజేసి దీక్షన్, భావంబలరార భూమిభామాదిమహా
శ్రీవనితాన్వితుఁ డగుచుం, గావించె మఖంబొకండు కౌతుకమొప్పన్. 450

క. పిమ్మట సహస్రవర్షము, లిమ్మహిఁ బాలించి జనకజేశ్వరుఁ డెలమిన్
నెమ్మిఁ గుశలవులనుసా, మమ్ములుగల సుతులఁబిలువ మమతంబనిచెన్. 451

ఆ. మిత్రసాధ్యయగుచు శత్రుదుస్సాధ్యయౌ, నాయయోధ్యయందు నతులమైత్రి
వారి నునిచి తాను భాసురనిజరాజ్య, భారవహనరతినిఁ బాఱఁదోలి. 452

చ. మనమలరారఁగా నపుడు మానవకోటులఁజూచి నెమ్మి ని
ట్లనియె హితంబుఁ జెప్పెద సురారులకృత్యము మాని పెద్దలం
గని ప్రణమిల్లి వారిదయగాఢముగాఁ గొని సార్వకాలమున్
మనుటయె మేలు కాన మది మాటికిదినిఁ బరిగ్రహింపుఁడీ. 453

## శ్రీరాముఁడు పురజనులకు హితం బుపదేశించుట

క. దారలు పుత్రులు ధనములు, సారెకుమనుజులను మోహసాగరమందున్
గారించియుంచు మీరా, దారిసివిడనాడి మంచిదారిని జనుఁడీ. 454

క. భూమీసురసేవాపర, కాములునై మెలఁగి వారికరుణను భవిక
స్తోమంబుఁబడసి నిత్యం, బీమహి వర్తింపనగును హితమతులారా. 455

శా. కామోదారము మాని నిష్కపటులై కళ్యాణభూయిష్ఠమై
భీమాఘౌఘనివారకంబునగుచున్ బెంపారుసజ్జ్ఞానమున్
వేమాఱున్ దలపోసి మీమనములన్ విభ్రాంతులన్వీడుచున్
భామాసంగమకామనాశరతులై బాగొప్ప వర్తింపుఁడీ. 456

చ. భువనహితార్థమై తరులు పూర్ణఫలంబు లొసంగు నిత్యమున్
భువనహితార్థమై నదులు పూర్ణముగాఁ బ్రవహించు నెప్పుడున్
భువనహితార్థమై జలదపూగము నీటి నొసంగుఁగాన మీ
రవనిఁ బరోపకారపరులై చరియింపుఁడి శాంతభావతన్. 457

ఆ. కుంటి గుడ్డి చెవిటి కూని వారలఁగాంచి, పరిహసింపవలదు పాళిమెఱసి
పాపకార్యకరణపద్ధతి వదలుఁడీ, పరమధర్మకార్యపరతఁ జేసి. 458

క. మీమానసచక్రంబులు, మామకరూపాభిరామమార్గములుగాఁ
గామించి చేయుచుండిన, కామితఫలసిద్ధిఁ గాంత్రు కడపటఁజూండీ. 459

క. కపటద్యూతము లాడక, చపలులఁ జేరంగఁబోక చౌర్యక్రియలం
దెపుడైన మెలఁగుచుండక, కృపణుల రక్షించుటొప్పుఁ గృపచే నవనిన్. 460

క. ధరణీసురనిర్జరవర, గురుభూధనముఖచయంబు గోరక యెపుడుం
బరనిందయు నాత్మస్తుతి, నిరసించి మెలంగవలయు నిశ్చయసరణిన్. 461

మ. సకలప్రాణులహృత్సరోజములఁ జంచత్ప్రాణవాతాకృతిం
ప్రకటత్వంబుగఁదాల్చి విష్ణువెలమిన్ భాసిల్లఁ దత్సంస్థితిం
గుకవుల్గానగలేక జంతుహృదయ క్షోభంబు నిత్యంబొగిన్
సుకరత్వస్థితిఁ జేసి దోషయుతులై శోభిల్లుచుం దృష్ణచేన్. 462

తే. పుడమి గడిమిని మెలఁగుచుఁ బూర్ణభావ, సారభోగసదానంద జలధిమగ్ను
లగుచుఁ గాలంబుగడపి యంత్యమునమిగులఁ, గాలుసమ్మెటపోటులఁ గాసిఁబడుచు. 463

తే. పిదపఁ గర్మానుసారులై వితతజంతు, జాలగర్భంబులను జొచ్చి పాఱఁబుట్టి
పెరిగిమృతిఁజెందుచుందురు పృథివిమీఁదఁ, గానరెన్నఁడుమీఁదటిగతిని గాన. 464

క. జ్ఞానంబుగల్గి సత్య, జ్ఞానానందస్వరూపసహితునిఁ బరుని
న్మానుగ యోజనజేయుఁ డ, నూనసుఖప్రాప్తి కలుగుచుండు నిజముగన్. 465

తే. వేయు శ్రీశునినామముల్ విపులభక్తి, నెవ్వఁ డనిశంబుఁ బఠియించు నింపుగాను
జన్మకర్మంబులతనికి జగతి లేవు, నిక్కమని పల్కి రార్యులు నియతితోడ. 466

క. సత్యమె మోక్ష మొసంగును, సత్యమె సత్కీర్తినొసఁగు క్ష్మాతలమందున్
సత్యమె సర్వసుఖంబులు, నిత్యంబొసఁగూర్చుచుండు నియతిదలిర్పన్. 467

చ. సతతము సర్వజంతుతతిఁ జంపక సత్కరుణాంతరంగులై
యతులను సూరివర్గముల హర్షముతోడుతఁ బూజసేయుచున్
సతులను మాతృభావమున స్వాంతములోపలఁబూన్కిఁ జూచుచున్
జితమతులై మహాత్ములను జేరి యజింపుఁడి సార్వకాలమున్. 468

క. అంతశ్శత్రుల నార్వుఱఁ, బంతంబునఁబట్టి తెగిచి బాధించినచో
నంతటఁజిత్తమువశమై, సంతసమునుగలుగఁజేయు సమరసవృత్తిన్. 469

క. నిరత మహాహతచక్రము, కరమరుదుగ జంతుహృదయకమలములందున్
గురురవయుతమై వెలయును, వరకాంతిస్ఫూర్తి లొప్ప వడిగాఁజూండీ. 470

తే. తన్మహారవమధ్యంగతంబు నగుచు, జ్యోతిభాసిల్లుచుండ నా జ్యోతినడుమ
గ్రాలుచున్మానసంబొప్పఁ గమ్రసరణి, నదియుఁవిలయంబునెపుడొందు నంతమీఁద.

చ. పరమసుఖంబు చేడ్పడును బాళిఁజెలంగఁగ భూసుతాత్మసో
దరులను గూడి నేను నిజధామముఁజేరెదఁగాన వేడ్కనీ
పురముననుండుఁడంచు బుధపూజ్యుఁడు రాముఁడు పల్క వారు దు
ర్భరతరదుఃఖమగ్నులయి పల్కిరి క్రమ్మఱ భీతచిత్తులై. 472

క. దేవా నిర్మలభావా, భావాతీతాత్మ వాస వాసవముఖస
ద్దేవాదిస్తుతపదరా, జీవా నీదర్శనంబు చేయకయుండ్వన్. 473

క. జీవింపఁజాల మనఘా, భావంబలరార మమ్ముఁ బరమప్రీతి
న్నీవెంటఁ గొనుచుఁ జనుమో, పావనగుణధామ రామ భవహరనామా. 474

శా. దారస్వాత్మజభవ్యభర్మఖచితోద్యద్రత్నసంఘుష్టవి
స్తారోదగ్రసుభూషణప్రతతిపై సర్వంసహాభాగశ్శృం
గారోద్యానవితానగానవనభోగవ్రాతసంశోభితా
గారాదిప్రకరంబుపై మనసు వేడ్కం బోదు సర్వేశ్వరా. 475

క. నినుఁబొగడనివాక్యంబులు, నినుఁగానని నేత్రతతులు నీపదసేవా
ఘనరతి నతులును లేకయొ, కన భువి మనఁగలమె రామ కాంతిసుసీమా. 476

తే. దీనమందార మణిహారదీప్తరత్న, భర్మమందిర భవహార పరమధీర
కరుణతోడుత మమ్మేలు ఘనతరోగ్ర, సార దశరథవరసుకుమార శూర. 477

చ. అని కడుదుఃఖమగ్నులయి యందఱు మ్రొక్కుచు సందియుంబునన్
ఘనగతిఁ గుందుచు న్విగతకల్మషభావము లొప్పఁబల్కఁ దా
విని జననాథచంద్రుఁడును విశ్రుతతేజుఁడునైన రాముఁడా
మనుజులఁ జూచిసత్కృపను నుంజూతరోక్తులఁ బల్కె- భామినీ. 478

క. పదియాఱుకళలచే నే, విదితంబుగ నొప్పుచుందు విశ్వేశుఁడనై
సదమలకృపనందొకకళఁ, బదిలంబుగ నుంతుఁగాన భర్మప్రతిమన్. 479

క. కావింపుఁ డందునిత్యము, పావనముగ వెలుఁగుచుండి పరమసుఖంబున్
గావింపుచుందు భక్తిగ, సేవింపుచు బ్రతుకుఁ డనుచుఁ జెప్పినవారల్. 480

తే. కనకరామునిఁ జేయించి కనకరత్న, ఖచితలేఖాలయంబున ఘనత నిలుప
నందుఁ దాఁజొచ్చి నిలిచెను బొందుగాను, షోడశాంశసమేతుఁడై సొంపుమీఱ. 481

ఉ. పిమ్మటనాత్మపుత్రులను ధేర్మిని నాపురిడించి ప్రీతిమై
నమ్మనుజాధినాథుఁడు నిజానుజభూమిసుతాన్వితుండు నై
సమ్మతిమీఱఁగా నపుడు చయ్యనఁ దత్సరయూనదీజలం
బిమ్ములఁ జొచ్చి మేనులను సెంతయుఁనీటిని ద్రోచి లీలతోన్. 482

## శ్రీరాముఁడు వైకుంఠనగరి కరుగుట

క. సాకేతాదిసుపర్వులు, ప్రాకటముగఁ బ్రస్తుతింప రమణీయముగా
వైకుంఠనగరి కేఁగెను, శ్రీకరమగు రూపమునను జెలువముమీఱన్. 483

క. నాటంగోలె జనంబులు, హాటకరఘురామవిభుని నధిక ప్రీతిన్
బాటించి భక్తిపరులై, మాటికిమాటికిని తలఁచి మానసతతులన్. 484

ఆ. కొలుచుచుండి పాపకోటులఁ బోఁద్రోచి, జ్ఞానసహితులగుచు సరసిజాక్షు
దయకుఁ బాత్రులగుచుఁ దనరారు చుండిరి, నిత్యవైభవముల నిపుణులగుచు. 485

తే. మగుడి శ్రీరామచంద్రుని మూర్తి నతని, సుతుల గుశలవనాముల సూరిమతులఁ
గౌతుకంబున సేవించి ఘనతఁ గాంచి, జగతి నరదఱు మెలఁగిరి సంతసమున. 486

క. భామా సద్గుణసీమా, రాముం డీలాగుభక్తరక్షాకరుఁ డై
కామించియుండు నాపురి, భూమానందంబుతోడ బుధులుప్పొంగన్. 487

క. దశశతవదనహారంబై, శిశుగురువృద్ధాంగనాది సేవ్యంబగుచున్
దిశలందు వెలయుచుండిన, దశరథసుతుచరిత మెవరు తఱుగనిభక్తిన్. 488

చ. చదివిన వ్రాసిన న్వినిన శర్మపదంబొనఁ గూడుఁ గీర్తు లీ
పదిదిశలం దఖండముగఁ బర్వును నిత్యముఁ బుత్రపౌత్రులుం
బదిలముగాఁ జెలంగుదురు భాగ్యమువచ్చును బాపనాశమౌ
మఁద మొనఁగూడుఁ జూడఁగ నమోఘజయంబు ఘనంబుగానగున్. 489

క. అని పార్వతికిని శంభుఁడు, జననాథుఁడైన రామచంద్రునివిజయం
బును సర్వము దెలిపిన విని, మనమున సంతోషవార్ధి మగ్నయు నగుచున్. 490

తే. సతత మా రామవిభు పాదసరసిజముల, భక్తితోడఁ దలంచుచు భవుని వినుతిఁ
జేయుచుండెను గైలాసశిఖరిమీఁద, నఖిలలోకైకమాత శ్రీహరునివనిత. 491

క. సూతుఁడు సత్యసమేతుఁడు, ఖ్యాతిగ నీరామజయము సమ్మునితతికిం
గౌతుకమొప్పఁగఁ జెప్పిన, నాతఱి విని వార లెలమి హర్షోత్కర్షన్. 492

చ. మనములఁ గోర్కెలూరఁగ క్షమాపతి యా రఘురాము నెన్నుచున్
వినయము దోఁపఁ బ్రహ్మణులు వేడ్కను బల్కిరి సూతుతోడ నో
ఘనమతి శ్రీరఘూద్వహుని గాథను మాకును జెప్పి సంశయం
బును నెడబాపినాఁడ విఁకఁ బోయెద మిప్పుడు నిన్దలంచుచున్. 493

క. కరుణాసాగరుఁ డమలుఁడు, నిరతిశయానందమోక్ష నిధియై భూభృ
ద్వరుఁడౌ రాముఁడు భక్తుల, నిరతముఁ గాపాడుచుండు నెమ్మిచెలంగన్. 494

క. రాముని మహిమను దెలియక, భూమిని గల మూఢజనులు పూర్ణభవాబ్ధిం
గామించి చొచ్చి బాధల, వేమఱును బొందుచుంద్రు వీక్షింపంగన్. 495

క. అని చెప్పి సూతుఁ డెన్నుచుఁ, జని రాముని నాథు నంత సంతోషముతో
డనుదపమును జేయఁగఁ జనె, ఘనుఁ డా సూతుండు భక్తిఁ గలితుండగుచున్. 496

చ. నిరతము శ్రద్ధతో నెవరు నీరజనేత్రుఁడునైన రామభూ
వరుని చరిత్ర వ్రాయుదురొ భక్తిఁ బఠింతురొ యాలకింతురో
కరువడి వారికిన్ భవము పాయును మోక్షము వచ్చు నిత్యమై
సురుచిరదివ్యభోగములు శోభిలుచుండును సార్వకాలమున్. 497

క. ఎందాఁకఁ దొగలరాయం, డెందాఁక మహర్షిపరసురేశాదిమహా
సందోహ మందు ముదమున, నందాఁకఁ జెలంగు నీమహాకృతి పుడమిన్. 498

చ. కలుషవిదూర నిర్గతవికార దయాకర సర్వసూరిహృ
జ్జలజవిభాకరా సకలశాస్త్రవశీకర ధీర భూరిని

ర్మలగుణశీలవార జనరమ్యశరీర నృపాలశేఖరా
నలినభవాదిదేవ మునినాయకసేవితనిత్యమందిరా. 499

క. మునిజనకామా దానవ, జనభీమా సుగుణధామ సన్నుతనామా
ఘనమోక్షకరణధామా, జననాయకకుముదసోమ జగదభిరామా. 500

మాలిని. అగణితవరశీలా యత్నకార్యానుకూలా
సుగుణనిచయమాలా సూరిహృన్మధ్యఖేలా
విగతకలుషజాలా వీరలక్ష్మీవిశాలా
జగదధిపతిబాలా సర్వలేఖారికాలా. 501

సీ. శ్రీరామసేవాప్తసిద్ధగీర్వాణాంధ్రకవితావినిర్మాణఘనపవిత్ర
రామవఝ్ఝులవంశరమ్యపారావారచంద్రదయారససాంద్రకమ్ర
హారితసగోత్రసురార్చనాపస్తంబసూత్రసంతతపాత్రసూరిమిత్ర
కొండయతనయ సద్గుణమణిసంచయ బ్రహ్మవిద్యావహృద్యభవ్యకాయ

తే. నయగుణవిధేయకొండయనామధేయు, విరచితంబగు శ్రీరామవిజయకృతిని
వెలయునుత్తరభాగంబు పెంపునొంది, యవనినాచంద్రతారార్క మగుచునెపుడు.

సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తి | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము. అబ్బయామాత్యప్రణీతము | ... | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | ... | 5 | 0 |
| అప్పకవీయవిమర్శ, శ్రీగిడుగురామమూర్తిగారిది | ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 12 |
| అంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక (పాతది) | ... | 8 | 0 |
| ఆదిపంచకము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆది సభాపర్వములు | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| అనంతునిఛందము (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రకుమారసంభవము - ఆదిపూడి సోమనాథరావు | ... | 0 | 12 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు (నిఘంటుత్రయము) కాలికో | ... | 2 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రశ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిది, 6 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన | ... | 3 | 0 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది, లఘుటీకానుక్రమణికతో | ... | 5 | 8 |
| కాశీఖండము, శ్రీనాథకవి | ... | 3 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | ... | 0 | 12 |
| గరుడాచలము - యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గీతమంజరి, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి | ... | 1 | 12 |
| చెన్నబసవపురాణము | ... | 1 | 8 |
| ఛందోదర్పణము, (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి | ... | 2 | 8 |
| దశావతారచరిత్ర | ... | 4 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | | [illegible] | 8 |
| ధనాభిరామము | | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక | ... | 3 | 0 |
| నృసింహపురాణము | ... | 2 | 8 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నలచరిత్ర, ద్విపద, క్యాలికో బైండు ... | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మిక్కిలి మల్లికార్జునకవి ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీతిచంద్రిక, శ్రీచిన్నయసూరిగారిది ... | 0 | 12 |
| ,, టీకతో ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవి ... | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన ... | 2 | 0 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు ... | 1 | 0 |
| పాండురంగమాహాత్మ్యము, లఘుటీక, క్యాలికో బైండు ... | 6 | 8 |
| బసవపురాణము, ద్విపద, చిన్నసైజు ... | 4 | 8 |
| బిల్హణీయము ... | 1 | 4 |
| భక్తిరసశతకసంపుటము I, 20 శతకములు ... | 3 | 0 |
| ,, II ,, ... | 3 | 0 |
| ,, III ,, ... | 3 | 0 |
| భాస్కరరామాయణము ... | 8 | 0 |
| భారతసావిత్రి ... | 0 | 2 |
| భగవద్గీతా కందార్థములు ... | 1 | 4 |
| ,, పద్యకావ్యము శ్రీగోపీనాథ వేంకటకవికృతము ... | 1 | 4 |
| భోగినీదండకము ... | 0 | 2 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలు కాగితములమీఁద ముద్రితము ... | 5 | 0 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతిది. వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో ... | 1 | 0 |
| యయాతిచరిత్ర, పొన్నికంటి తెలగనార్య ... | 2 | 0 |
| డిటో ఆకొండి వ్యాసమూర్తిగారిది ... | 0 | 3 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము ... | 0 | 6 |
| రాధికాసాంత్వనము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.